శ్రీరస్తు

# నృసింహపురాణము.

ఎఱ్ఱాప్రగడ ప్రణీతము



చెన్నపురి :

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

**1924.**



శ్రీ

# నృసింహపురాణము.

## పీఠిక.

---



కి నిరంతరంబు కడుఁ జెన్నొసలారెడురాగలీల ను
త్సేకముఁ బొంది యొప్పు తనచిత్తము చూపెడుమాడ్కి నిత్యర
మ్యాకృతి నైన కౌస్తుభము నక్కునఁ బయిం బచరించు నుత్తమ
శ్లోకుఁ డహోబలేశుఁ డతిలోకుఁడు లోకముఁ గాంచుఁ గావుతన్. 1

ఉ. చందనచారుపత్త్రకము సంస్తుతకౌస్తుభకర్ణికంబు న
స్యందితలాంఛనభ్రమరసంగమనోజ్ఞము నైనయట్టిగో
విందునురస్తలంబ యరవిందముగా నొగియించి యున్న య
య్యిందిర నాచు గాతఁ గృప నింపగుచూపుల భక్తసంతతిన్. 2

ఉ. గద్దియ నైనతమ్మివిరికమ్మనితావికిఁ గ్రమ్ముతేఁటు లే
ప్రొద్దును మ్రోయుచందమునఁ బ్రోడలు చట్టులు గూడి చుట్టులన్
బెద్దయెలుంగునం జదువఁ బేర్మియెలర్పఁగ నొప్పువేలుపుం
బెద్ద నయంపుమత్కృతి కభీష్టచిరస్థితిదాయి గావుతన్. 3

చ. పఱలు జటాటవిం గుసుమవల్లరు లై చదలేటినీటి నె
త్తఱుల జనించుక్రొన్నురువుతండము లై తలసుట్టుఁబాము మే
నఱువుఁడుఁ గుప్పసంపుఁబొర లై చెలువార సితేంశుచంద్రికల్
నెఱయఁగఁ బ్రోచు మస్మఖమునీషితకావ్యకళాకుముద్వతిన్. 4

చ. తనరఁగ గ్రుచ్చి యంబిక ముదంబునఁ గౌఁగిటఁ జేర్చుచో ఘన
స్తనయుగకుంభయుగ్మములు దార్కొని యొప్పునకై యసూయ మైఁ
జెనకి పెనంగ నొండొకటిఁ జేరినలాగున నల్లసిల్లఁ బెం
పెనసినవానిఁ బ్రీతి నుతియించెద నేనిక మోము వేలుపున్. 5

చ. కరకమలంబు నొసంగఁ బటికంపుఁగమండలుపంటి కాంతి భా
సుర మగుమౌక్తికంపుజపసూత్రము దాల్చుట బ్రహ్మవాద మై

పరఁగినహంసముం బిలిచి బాలమృణాళముఁ జూపుచంద మై
సిరి తిలకింప నొప్పుబుధసేవితమూర్తిఁ దలంతు భారతిన్. 6

ఉ. వీనుల తేనె యై పరియ వింతగఁ గావ్యరసంబు గ్రోలి యా
మానవకోటికిం బహుసమానత మానఁగఁ జేసె నెవ్వఁ డ
వ్వానికి నీడు లేరు మునివర్గములోపల నమ్మహాత్ము మే
ధానిధి నాద్యు రామకథానిధికీర్తిధురీణుఁ గొల్చెదన్. 7

ఉ. వేదము నచ్చికట్టి శ్రుతివీథులతత్త్వముఁ బట్టి చూచి యా
వేదముకంపునింపునకు వెగ్గలమై నిగుడంగఁ బాలు నా
మోదము లెల్లఁ గొల్పి యనుమోదితకీర్తుల మిన్నుదాఁకు న
య్యాదిమపండితుం గొలుతు నచ్యుతమూర్తిఁ బరాశరాత్మజున్. 8

ఉ. భాసురభారతార్థములభంగులు నిక్క మెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథలు ద్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసమునిప్రణీతపరమార్థము తెల్లఁగఁ జేసినట్టి యు
ల్లాసనకల్పులం దలఁతు నాద్యుల నన్నయతిక్కనార్యులన్. 9

క. వెండియుఁ దొల్లిఁటి యిప్పటి, పండితుల మహాకవిత్వపదవీగరిమా
ఖండితుల నతులతేజో,మండితులఁ దలంతు నిండుమనమున నెప్పుడున్. 10

ఉ. యామము లెన్నిదింట నిరూతాకృతిఁ బ్రత్యయముల్ శివార్చనా
రామత యొప్ప నిత్యశివరాత్రి వ్రతంబుగఁ బూని ధన్యయో
గామృతతృప్తి మైఁ ద్రిజగదర్చితలీలఁ దనర్చు శంకర
స్వామి మునీంద్రభక్తజనవత్సలు మద్గురు నాశ్రయించెదన్. 11

వ. అని యీక్రమంబునఁ బ్రధానదేవతాసంకీర్తనంబును మహాకవిజనప్రార్థనంబును సద్గురుచరణానుస్మరణకీర్తనంబును సమర్థించి కృతార్థతం బొంది కతిపయాక్షరపరిగ్రహజనితం బైన నైసర్గికచాపలంబుకతంబున. 12

ఉ. మించినవేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు కూయఁ గ్రౌంచమును నావలఁ గూయఁ గడంగుభంగిఁ బ్రా
ఘాంచితశబ్దసారులు మహాకవు లాద్యులు కావ్యశయ్య గీ
లించిన కీర్తిసంగసుఖలీలకు నేనును గాంక్షఁ జేసితిన్. 13

వ. అల్లు మహాప్రబంధకల్పనాకుతూహలాయత్తం బగుచిత్తంబుతో నొక్కనాఁడు తదనుసంధానానుబంధసమాధినిమీలితేక్షణుండ నై క్షణం బున్నసమయంబున. 14

సీ. ప్రజ్ఞాపవిత్రుఁ డాపస్తంబసూత్రుండు శ్రీవత్సగోత్రుఁ డూర్జితచరిత్రుఁ
డగు బొల్లనకుఁ బోలమాంబకుఁ బుత్రుండు వెలనాటిచోడనివలన మిగుల

మన్నన గన్నభీమనమంత్రిపౌత్త్రుండు పేరమాంబామనఃప్రియుఁడు పోత
మాంబికావిభు సూరనార్యు మజ్జనకుని బొల్లధీనిధికిని బోలమునను

గీ. జన్మనకు ననుజన్ముని గన్నతండ్రి, వేఁగినాటఁ గరావర్తివృత్తిమంతుఁ
డనఘుఁ డెఱపోతసూరికంసారిచరణ,కమలమధుకరపతిసారవిమలయశుఁడు. 15

వ. మదీయభావంబున నావిర్భావంబునొంది సదయానందమధురవాక్యంబుల నన్ను నిట్ల
ని యనుగ్రహించె. 16

ఉ. ఉన్నతసంస్కృతాదిచతురోక్తిపదంబులఁ గావ్యకర్తవై
యొన్నికమైఁ బ్రబంధపరమేశుఁ డనంగ నరణ్యపర్వశే
షోన్నయ మంధ్రభాష సుజనోత్సవ మొప్పఁగ నిర్వహించి తా
నన్నయభట్టతిక్కకవినాథుల కెక్కినభక్తిపెంపునన్. 17

క. గిరిశపదభక్తిరసత,త్పరభావము కలిమి శంభుదాసుం డనఁగా
బరఁగిన గోవిందగుణా,దరసంభృతసౌమనస్యధన్యుఁడ వెందున్. 18

క. గురుభజనపరాయణుఁడవు, సరసబహుపురాణస్మృతిశాస్త్రకథావి
స్తరవేదివి వినయోదిత,చరితుఁడ వతులానుభావభవ్యుఁడవు మహిన్. 19

క. కావునఁ బ్రబంధరచనా, ప్రావీణ్యత నీకు సహజపరిణతసిద్ధం
బై వెలసినయది యొకకృతి, గావింప జగద్ధితంబుగా నేఁ బనుతున్. 20

ఉ. శ్రీమదహోబలేశనరసింహుఁడు నాప్రియదైవతంబు మ
త్స్వామి తదీయతీర్థవిభవంబును దన్మహితావతారముల్
నీమధురోక్తిగుంఫన మనీషులు మెచ్చఁగఁ బ్రస్తుతింపు నీ
కేమెయి సంభవించు నఖిలేప్సితపుణ్యఫలోదయోన్నతుల్. 21

తే. అనినఁ బులకలు మై జాదుకొనఁగ నపుడు, మనసు వికసిల్లఁ గనువిచ్చి మహితలీల
నద్భుతానందరసమూర్తినై తలంపు, తద్గతంబుగ ధన్యత తలకొనంగ. 22

క. ఇది యీశ్వరానుశాసన, ముదయోన్ముఖమయ్యె నాకు నూర్జితశుభసం
పద నొనరింతుఁ బ్రబంధము, సదయనృసింహావతారసంస్తవసరణిన్. 23

చ. ననుఁ దన పేరివాఁ డని మనంబున నెప్పుడు నాదరించుటన్
బనిచె గుణప్రసిద్ధియును భవ్యసమృద్ధియుఁ జేయుపుణ్యపుం
బని యటఁ మత్పితామహుఁడు ప్రాక్తనసంయమితుల్యవర్తనుం
డనఘయశుండు పూర్ణపురుషాయుషజీవితధన్యుఁ డిమ్మహిన్. 24

తే. అమ్మహాత్ముఁడు నిత్యదయార్ద్రహృదయుఁ, డతులితానందజలధి నోలాడుఁగాత
విష్ణుధర్మప్రశంసాపవిత్రమైన, యస్మదీయప్రబంధసామగ్రివలన. 25

శా. ప్రాజ్ఞప్రస్తుతభవ్యభోగవిభవస్ఫారాత్ముఁ డారాధ్యస

ర్వజ్ఞుం డప్రతిమాద్భుతోభయకవిత్వప్రౌఢిశబ్దార్థయో
గాజ్ఞాసిద్ధిఘనుండు మజ్జనకుఁ డుద్యత్కీర్తి శ్రీసూర్యుఁ డ
విజ్ఞానాత్మకనాత్మయంబున ముదావేశోజ్జ్వలుం డయ్యెడున్. 26

వ. ఈనిశ్చయం బిట్టిది కావున బ్రహ్మాండాదిపురాణోక్తం బయిన శ్రీనరసింహావతారం బనుపురాణంబుఁ దెనుంగుబాసఁ బ్రకటింపవలయు నమ్మహాప్రబంధంబునకు నస్మత్పితామహహృదయగుహావిహారమహాసింహం బగు శ్రీమదహోబలనరసింహదేవుం డధీశ్వరుండగుటఁ జేసి మద్వాక్యరత్నరచనోపహారంబుల నమ్మహాదైవతంబు నారాధించి.

చ. కృతికి విభుండు శ్రీవిభుఁడు కీర్తనపావనమైన తద్గుణ
స్తుతికృతివిష్ణుదాసులు యశోనిధు లూర్జితపుణ్యు లుత్తముల్
కృతిఁ గొనియాడువారు కృతకృత్యుఁడనైతి మదీయవాంఛిత
ప్రతతికిఁ జెందఁ గల్పతరుపాకము శ్రీకరకావ్యరూపతన్. 28

వ. అని యుత్సాహంబు మిగులం జిత్తంబును వాగ్వృత్తంబును నుత్తమశ్లోకసంకీర్తనరచనాయత్తంబును నగుచుండ నత్యుదాత్తభక్తిప్రయుక్తోల్లాసభాసితుండనై కృతిఁ జేయం దొడంగి 29

## షష్ఠ్యంతములు

క. శ్రీమదహోబలతీర్థ,స్వామికి శరణాగతప్రసన్నునకుఁ గృపా
ధామునకుఁ బ్రణమజ్జన,కామితఫలదునకుఁ బరమకల్యాణునకున్. 30

క. లక్ష్మీవల్లభునకు శుభ,లక్ష్మోజ్జ్వలవక్షునకు నలభ్యాస్తపచ
స్స్వాక్షార్థరూపునకు భవ,ముక్షునిగమనైక నిరుపమాపథమునకున్. 31

క. నిత్యవివేకాపేక్షుని,రత్యయతత్త్వునకు నిరుపమానసత్త్వునకున్
నిత్యప్రహ్లాదవచః, ప్రత్యయసిద్ధునకుఁ బరమపరిశుద్ధునకున్. 32

క. ప్రసభసభాస్తంభారణి, విస్ఫురతేజోగ్నిమఖహవిర్భాగకథా
రసికాసురపశుయజనో,ల్లసనసుసంతర్పితాఖిలనిలింపునకున్. 33

క. కంసారికి నాత్మేచ్ఛా, సంసారికి మానిమానసస్ఫుటకేళీ
హంసమునకు దైవతలో, త్తంసమునకు దళితకలికి దండితబలికిన్. 34

క. ఆధారపీఠపఠికా,రాధితున కగాధమధ్యరంధ్రసుధాధా
రాధౌతప్రసృమరధా, రాధరధామాంగునకు ధరాధరణునకున్. 35

క. భీమానుజవరదునకును, రామానుజవరదునకు శరణ్యునకును సు
త్రామానుప్రభువునకును, రామానుప్రభవునకుఁ బురాతనమునికిన్. 36

# పీఠిక.

క. భవనాశనీమహాన, ద్యవగాహనవిమలబుధజనాంతఃకరణ
వ్యవసితసులభున సురుతర, భవనజసింహాత్వదళితభవకలుభునకున్.

క. గరుడాచలాంచలోజ్జ్వల, గరుడాసీనునకు సిద్ధగరుడామరుకు
నరసఖమిథునోద్ధతివి, స్ఫురదపదానునకు నిత్యశుభధామునకున్.

క. సారాన్వయధీవిద్యా, సారలసత్పుత్త్రపౌత్త్రసంపద్గుణాసం
భారమదీయహితార్థో, ద్ధారపరిజ్ఞాతకల్పతరుఫలమునకున్.

క. జ్ఞానబలశౌర్యసుఖసం, తానైశ్వర్యాదివిభవదాయిదయావి
ద్యానిత్యశ్రీఘనునకు, శ్రీనరసింహునకు భక్తచింతామణికిన్.

# ప్రథమాశ్వాసము.

---

## కథాప్రారంభము.

వ. ఏను విన్నపంబు సేయంగల లక్ష్మీనరసింహావతారం బనుపురాణకథఁ బ్రారంభం బెట్టి
దనిన నిఖిలభువనపావనం బైన నైమిశారణ్యంబునఁ బుణ్యాత్ము లగుమహర్షులు హర్షో
త్కర్షంబున రోమహర్షణుం డనుపౌరాణికునివలన నఖిలపురాణేతిహాసంబులు
పరిపాటి వినుచుండి బ్రహ్మాండపురాణంబునఁ దీర్థభాగశ్రవణంబు సేయుసమయంబున
నతికుతూహలోల్లసితమానసు లై యతని కి ట్లనిరి. 1

క. ఏతీర్థము కలియుగమున, భూతార్థము దానచతురపుణ్యోన్నతి ను
ద్యోతించు మునులు దివిజులు, నేతీర్థమునందుఁ బాయ రెన్నఁడు నెలమిన్. 2

శా. ఏతీర్థంబున సర్వకాలమును సర్వేశుండు సర్వాగమా
మ్నాతస్ఫీతయశుండు శ్రీవిభుఁడు ప్రేమస్థేమమై దాను న
బ్జాతావాసయు నిత్యవాసరుచిరై భాసిల్లు నొం డెచ్చటం
జేతోవృత్తి గణింపనొల్లక జగజ్జేగీయమానస్థితిన్. 3

శా. ఏతీర్థంబుఁ దలంచువారు వినువా రీక్షించువా రెప్పుడుం
బ్రీతిం గూడి భజించువారు దురితాపేతాత్ము లై యొయ్యెడం
వీతాతంకనుతిం దనర్తురు జగద్విఖ్యాతకీర్త్యుజ్జ్వలం
బేతీర్థంబు పురాణయోగివిదితం బేతీర్థ మూహింపఁగన్ 4

శా. ఏతీర్థంబు సమస్తతీర్థతిలకం బిష్టార్థసిద్ధిప్రదం
బేతీర్థంబు సమగ్రవైభవశుభోపేతప్రభూతోదయం
బేతీర్థంబు విముక్తిసాధనగృహం బేతీర్థ మింపారఁగా
నాతీర్థం బెఱిఁగింపు మాకుఁ బరమోదాత్తప్రబంధోక్తులన్. 5

క. అని ప్రార్థించిన మునులకు, వినయావనతాంగుఁ డగుచు విశ్రుతవాణీ
ఘనుఁ డధికబోధనుం డి,ట్లను బుధహర్షణుఁడు రోమహర్షణుఁ డెలమిన్. 6

ఉ. ఈగుణకోటియంతయును నెక్కడ నెక్కడఁ గల్మి దుర్లభం
బాగనుసిద్ధమై మునిగణార్చిత మైనరహస్య మేను వి

ద్యాగురుఁ డైన మద్గురుముఖాంబురుహంబునఁ గంటి నిప్డు త
ద్వాగభిరూపితార్థము భవద్వచనంబుల కుత్తరం బగున్. 7

సీ. ప్రోగులై యెందును బోఁ గేర్పడక యున్న శ్రుతు లన్నియును నోజ సూత్రపఱిచె
ముఖ్యశాస్త్రంబుల మునికోటిఁ జదివించి యెల్లచోటుల వెలయింపఁ బనిచె
నాదిపురాణంబు లయ్యైమతంబుల పేళ్లు వెట్టియు నిరూపించి నిలిపెఁ
బంచమవేదమై పరఁగు మహాభారతముఁ జేసి పురుషార్థసమితిఁ బ్రోచెఁ

గీ. బుట్టినప్పుడె సంస్కృతిపాశముఁ గప్పి, నట్టియెఱుకను బుట్టినపట్టిఁ గనియె
నెవ్వఁ డట్టిమద్గురు నుతియించి భక్తి, విష్ణుమాహాత్మ్యకథ లెల్ల విస్తరింతు. 8

వ. సమాహితహృదయుల రై వినుండు. 9

ఉ. సంతతపుణ్యవర్తనుఁడు సద్గుణసంస్తుతకీర్తనుండు ని
శ్చింతమనస్సరోరుహవశీకృతకృష్ణుఁడు వీతకృష్ణుఁ డా
క్రాంతనియత్యపేలవుఁడు గాలవుఁ డన్ముని తీర్థసేవనా
త్యంతికభక్తి మేదినిఁ బ్రదక్షిణవృత్తిఁ జరించె నెల్లెడన్. 10

సీ. అర్థి గంగద్వార మాడెఁ బుష్కరములు గనియె హరిక్షేత్రమునఁ జరించెఁ
గౌశికిఁ గొనియాడెఁ గాశి వసించెఁ బ్రయాగంబు సొచ్చె గయావటమున
నిలిచె గంగాపయోనిధిసంగమముఁ జూచె శ్రీపురుషోత్తము సేవఁ జేసె
సింహాచలం బుపాసించె గోదావరీకృతగాహనుం డయ్యెఁ గృష్ణవేణిఁ

గీ. దఱిసె శ్రీవేంకటాచలస్థాయిఁ గొలిచె, సహ్యజావేణిఁ దోఁగెఁ దత్సవిధసీమ
సప్తసాలాంతరశయాను సరసిజాక్షు, రంగనాథుని నెఱఁగె శుభాంగుఁ డగుచు 11

వ. ఇట్లు పరిపాటిం బ్రసిద్ధంబు లగు తీర్థంబు లాడుచు మఱియును. 12

క. గోకర్ణము సహ్యగిరియు, శ్రీకుల్యముఁ బుష్పనగము సిద్ధాచలమున్
లోకనుతుఁడు చూచుచు లక్ష్మీకలిత మహాబలంబుఁ జేరెం బ్రీతిన్. 13

క. అందు భవనాశనీనది, నందనదళితారవిందనవమకరంద
స్యందమదపదిందిందిరఁ, జందనచంద్రాంశువిశదసలిల భజించెన్. 14

వ. తదనంతరంబ. 15

ఉ. ఆమునినాయకుండు వినయానతుఁడై కొలిచెం జగత్త్రయ
స్వామిఁ బ్రసన్నభక్తినయసాధ్యుఁ గామితభక్తలోకచూ
డామణి సర్వదైవతశిఖామణి శ్రీనిధి సత్కృపానిధిన్
శ్రీమదహోబలేశ్వరుఁ బ్రసిద్ధమహత్త్వజితాఖిలేశ్వరున్. 16

వ. ఇవ్విధంబున శ్రీనరసింహసందర్శనం బొనరించి కృతార్థుం డై యచట ననేకముని
మహర్షిమధ్యంబున మధ్యందినదినకరానుకారియై తేజరిల్లువాని శ్రీమన్నారాయణచ
రణైకభావు దేవశ్రవుం డను మునిపుంగవుం గనుంగొని నమస్కరించి యాతనిచేత

సంభావనంబు వడసి యాసీనుండై గాలవుండు నమ్మహాత్ముండు వివరించునచ్యుతమ
హిమాత్మకంబు లగుపుణ్యకథనంబు లాకర్ణించుచుఁ గృతాంజలియై యి ట్లనియె.

క. చూచితి ననేకతీర్థము, లీచందము పుణ్యతీర్థ మే నెఱుఁగ మునీం
ద్రా! చిత్తము తెలివొందెను, గోచరమై యహోబలంబు గొనియాడంగన్. 18

క. ఇచ్చటఁ బొల్లి జనార్దనుఁ, డచ్చపువాలారుగోళ్ల నసురవరేణ్యుఁ
వ్రచ్చె నన నతనిసూనుని, మెచ్చె ననఁగ నేను వింటి మితకథనములన్. 19

సీ. అఖిలలోకేశ్వరుం డగుపరమాధిపుతోడ విడువని వైరంబు దొడరునట్టి
మోఱక మేటికో మొఱఁగె దైత్యునిబుద్ధి నెబ్భంగి నిష్ఠదై త్యేంద్రసుతుఁడు
శ్రీవత్సవక్షు మెచ్చించె శ్రీనరసింహమూర్తి యేకారణమున జనించె
విభుఁ డహోబలనాథవిఖ్యాతి నెట్లొందె నీతీర్థవరమున నిందుఁ గలుగు

గీ. పుణ్యతీర్థంబు లెయ్యవి భూరిపుణ్య!, యింతయును సవిస్తరంబుగా నింపు మిగుల
నానతిచ్చి కృతార్థుఁ జేయంగవలయు, నన్ను నిమ్మును లెల్ల నానందమొంద. 20

క. అని పలికిన గాలవుపలు, కనుమోదించుచు మునీంద్రు లందఱుఁ దమ నె
మ్మనములు చెవులకు సొమ్ముగ, నొనరించి కుతూహలాధికోల్లాసితులై. 21

క. తనవదనమునన చూడ్కులుఁ, నినుపఁగ దేవశ్రవుండు నిరుపమవిద్యా
ఘనుఁ డిట్లనియెను గాలవుఁ, గనుఁగొని గంభీరవాక్ప్రకాశప్రౌఢిన్. 22

క. నీ వడిగిన యర్థము ముని,సేవితము సమగ్రబోధసిద్ధిప్రద మి
ష్టావాప్తికరము శ్రుతిసం, భావితము ప్రశస్తనిత్యపాండిత్యనిధీ!. 23

క. ఏనును బెద్దలచే మును, వీను లలరఁ దరతరంబ విన్నవిధంబుఁ
మానసమున నున్నతెఱఁగుఁ, గానుపువం గన్నక్రముముఁ గథన మొనర్తున్. 24

వ. అనిపలికి దేవశ్రవుం డిట్లని చెప్పం దొడంగె. 25

సీ. అఖిలలోకావంద్యుఁ డగుచంద్రుఁ డెందేని గలిగె నుజ్జ్వలఫేనకణముమాడ్కి
నైరావణాదిమహాకరు లెందేని ప్రభవించె మకరశాబములపగిదిఁ
గమనీయసురతరుసముదయం బెందేని జనియించె శైవాలచయము భంగి
భుజనైకమాత మాధవుపత్ని యెందేని పొడమె మాణిక్యంపుబొమ్మపోల్కి

గీ. నాదిమత్స్యకూర్మములవిహారలీలఁ, దనరు నెందేని ప్రకృతి సత్యములకరణి
నట్టి యంభోధి యొప్పారు నద్భుతైక,సారమహనీయమహిమ కాధార మగుచు. '6

క. తాన లవణాబ్ధి యనినను, దాన మధురజలధి యనిన దాన యమృతపా
థోనిధి యనినను సకలా,నూనగుణస్తుతికి నాత్మ యొకఁడ యుదధికిన్. 27

క. కావున దుగ్ధాంభోనిధి, శ్రీవిభవము వర్ణనంబు చేసెద సాక్షా
చ్ఛ్రీవల్లభమూర్తి యగుటఁ, బావనములు తద్గుణానుభావస్తవముల్. 28

ఉ. ఒక్కొకవేళ శీతకిరణోదయవేళలఁ బొంగి నింగికిన్
నిక్కి మహాబ్ధివీచికలు నిర్మలదివ్యవిమానపంక్తిపైఁ
బిక్కటిలంగఁ గొన్ని మరువు వెట్టినయంతయుఁ జూడనొప్పు న
ల్దిక్కుల శారదాభ్రులవదీ ప్తివిభాగత నొందుచాడ్పునన్. 29

ఉ. ఎక్కడు వేడ్కఁ గ్రోలికొని యొండక యున్నపయోధిపల్లముల్
గ్రక్కుడునో సుధాకిరణకాంతిచయంబు లనంగ నెంతయున్
మిక్కిలి యుల్లసిల్లు నునుమింపులు దేరెడుముత్తియంబు లిం
పెక్కినమ్రోఁతలన్ దరఁగ లెంతుఁ దటంబులఁ బ్రోవువెట్టఁగన్. 30

సీ. బిగియుల్లసిల్లెడుపగడంపుఁగెమ్మోవి చెలువంపుబింకంబు చిగురులొత్తఁ
దనరారుపులిననితంబబింబమున నాకలితమై ఫేనదుకూల మమరఁ
గ్రమ్ముముక్తాఫలఘర్మాంబుకణములు చెదరి యొంతయు సౌఖ్యపదవి నొసఁగ
నెసఁగునుద్వృత్తమీనేక్షణరోచులపొలపంబు లొయ్యారములు దలిర్ప
తే. లలితభంగుల నొప్పు వేలావధూటి, కమ్రభంగభుజంబులఁ గౌఁగిలించి
ఘనరసోల్లాసలీలలఁ గ్రాలి క్రాలి, యుదధి తెంచుఁ జంద్రోదయోత్సవమున. 31

ఉ. ప్రేపులు రేలుఁ బెద్దయును బేర్చి సమీపనగేంద్రచంద్రకాం
తోపలతోయదంబు నద లొక్క మొగిం జనుదెంచి యాదటన్
బైపడఁ దాను నుల్లసితభాతిఁ దదీయనదాభిసారమున్
దీపెసలారఁ గైకొని ముదించు నదీశతికోర్కి వింతగన్. 32

చ. తటరుహవిద్రుమద్రుమవితానము లొప్పఁ బయోధి కింక ను
త్కటచటులోర్మిహస్తముల గర్వమున న్వెడలంగఁ ద్రోచినం
బటుతరభావ మేది బహుభంగి వికీర్ణత నొంది క్రింద న
చ్చట నచటన్ బొనుంగుపడి ప్రగ్గినబాడబకీలలో యనన్. 33

తే. కడలిచేతు లార్చుచు ఫేనఘనతరాట్టహాసరుచితోఁ బ్రవాళజటాలి విద్రిచి
యౌర్వశిఖిఫాలలోచనం బనఁగ సింధు, వమరతాండవ మాడెడుహరునిఁ బోలి. 34

చ. పొలుపుగ నెల్లనాఁడు నుడివోవక పెల్లుగఁ బూఁచు తీఁగెలం
దెలుపులు మీఱి తోయనిధితీరవనంబులు జూడ్కి కెప్పుడున్
ఎలమి యొనర్చు వేల్పులచలేంద్రునిఁ గవ్వముఁ జేసి తెచ్చుచోఁ
జిలికిననాఁటి యయ్యమృతశీకరసేకము పాయుదో యనన్. 35

ఉ. తెక్కలతోడ కొండల నెఱిం దనలోన నడంచికొన్న నీ
సెక్కి బలారి పంచె నొకొ యీజలపూరము పేర్మి యంతయుం
దక్కవ సేయ నన్నక్రియ దండడి నొందను బేర్చి పెల్లుగా
నొక్కట నీరు గ్రోలెడుఁ బయోదగముచ్చయముల్ పయోనిధిన్. 36

సీ. సిరిపుట్టినిల్లు రాజీవలోచను సెజ్జ పట్టు మహీకాంతకట్టుఁజీర
గిరులు డాఁగెడుగొంది గిరిభేదిపగఱకు బలుకోట బడబాగ్ని బ్రతుకుచోటు
పటుపయోధరములపాలిప్రపాసీమ యమృతాంశుపొడవున కనుగలంబు
మర్యాదలకు గుడి మహిమలకందువ యఖిలరత్నములకు నాకరంబు
గీ. సురతరువనంబు వాహినీసుందరులకుఁ, గూర్మినిల్కడ గంభీరగుణము సెలవు
తనరునొప్పినయముల కెల్లఁ దానకంబు, ననధిఁ గొనియాడఁ జతురాననునకు వశమె. 37

వ. ఇట్లు వారవిభవోదారం బగుదుగ్ధపారావారంబునకు నలంకారం బగుచుఁ దదీయ మధ్యప్రదేశంబున ననేకశతసహస్రకోటియోజనవిస్తారవిపులరూపం బై శ్వేతద్వీపంబు దీపించుచుండు. 38

క. ఆదియు మహిమయు నేర్పడ, నాదిపురుషుఁ డొక్కఁడ యెఱుఁగు నన్యులకెఱుఁగం
గాఁ దరము గాదు కమలభ, వాదిదివిజవంద్య మది మహాద్భుతము మహిన్. 39

సీ. క్షీరాబ్ధితరఁగలపేరణిఁ గూడిన ఫేనసంహతి చిక్కఁ బేరె నొక్కొ
రాకాసుధాకరప్రభలు ప్రోవిడి బ్రహ్మ వెరవున గట్టి గావించె నొక్కొ
హరిపురాంతకులతో డిపురుషున రజతాద్రి కెనగాఁగ నిది సృజియించె నొక్కొ
దనుజారిహాసప్రయుక్తిఁ దనియక వెండియు సురగేంద్రుఁ డీమూర్తి నొందె నొక్కొ
గీ. యనుదరమున ముత్తియంబు లొయ్యొయ్య మూగి, తెట్టువలు సేరిపెనుమిత్తుగట్టె నొక్కొ
యనఁగ జందనకుందేందుహారరుచిర, దీప్తివిశేషతులు నచట సంధిల్లు దీవి. 40

శా. శ్వేతద్వీపనివాసు లందఱు శరజ్జీమూతరేఖాసిత
స్ఫీతాకారులు ఘోరదుర్భరజరాపేతుల్ హరిధ్యానసం
జాతానందనిరూఢు లూర్జితయశస్సంభావ్యు లంభోజసం
భూతేంద్రాదిసమస్తదేవపరిషత్పూజానమస్యోచితుల్. 41

క. హరిభక్తి తేపగాఁ దు, స్తరసంసారాబ్ధిఁ గడచుసాధుజనులకుం
గరమై దివిజగణనిరం, తరనిత్యానందము సుపదస్థితి నెసఁగున్. 42

వ. అమ్మహాద్వీపంబునడుమఁ బ్రచండమార్తాండమండలసహస్రదుర్నిరీక్ష్యసహజతేజోవిరాజితంబును, వివిధమణికిరణపటలజటిలఘనకనకప్రాకారప్రకరపరిక్షిప్తంబును, దరళపతాకాపల్లవితకేతువనవిలసితంబును, సముత్తుంగమంగళమణిభర్మనిర్మితనిర్మలహర్మ్యశిఖరవిలిఖితగగనభాగంబును, బహుయోజనసహస్రదుర్నిరీక్షాత్యాయతవిశాలసన్నివేశంబును, రమణీయరమ్యసహస్రముఖసంచారచతురప్రాకారంబును, సంభృతాఖిలదిఙ్ముఖద్వారతోరణస్ఫురణాభూషితంబును నయి వైకుంఠనామధేయం బగుమహాపురంబు భూరిమహిమాభిరామం బగుచుండు. 43

క. నాలుగుకోళులవానికి, నాలుక లిరువేలు గల ఘనస్థిరమతికిన్
బోలునె వినుతింపఁగ ననఁ, బోలికలకు మిగిలి యొప్పుఁ బురియొప్పిదముల్. 44

సీ. నారాయణునిదివ్యనామసంకీర్తనం బనిశంబుఁ జేయుమహాత్ములకును
బద్మాక్షుశ్రీపాదపద్మంబు లత్యంతభక్తిమైఁ బూజించుప్రాజ్ఞులకును
విశ్వరూపునిమూర్తివిభవంబు నేకాగ్రబుద్ధి భావించుసత్పురుషులకును
లక్ష్మీశ్వరునిసముల్లాసహేతువు లగువ్రతములు సల్పుసద్వర్తనులకు
గీ. భవము దీఱినతుది నిచ్చి భవ్యసుఖము, లనుభవింపంగఁ దగునెల్ల నగుటఁ జేసి
యఖిలవస్తుసంపదలకు నాకరంబు, గుణవిధావిభాసురము వైకుంఠపురము. 45

చ. శ్రుతిమతధర్మయోగములు చోద్యపుమూల్యము లప్పురంబునం
జతురతఁ బుణ్యవస్తువులు సారవిముక్తిపదమ్ము లమ్మువా
రతులితవిష్ణుశాసనసమాహితులైనమహాత్ము లంచితో
ద్ధతిఁ గొనువారు భూరివిహితవ్రతపారగులైనబోధనుల్. 46

సీ. తమవాఁడిమాడ్కి కందర్పునకేపని యైన సాధించుదివ్యాస్త్ర మనఁగఁ
దమతియ్యపలుకులు ప్రమదరాగాంబుధిఁ దనరారుసువ్వంపుఁదరఁగ లనఁగఁ
దమవింతచెయ్వులు కమనీయకోమలశృంగారతరువులేఁజిగురు లనఁగఁ
దమముద్దునవ్వులు తమకంపుఁజీఁకటి నిగిడించునరిదివెన్నెల లనంగఁ
ఆ. జొక్కుమందు లనఁగ సోయగంబులగను, లనఁగ సుఖమునిక్క మనఁగఁ జాలి
యనుపమానమూర్తులై యుల్లసిల్లుదు, రంబుజాయతాక్షు లప్పురమున. 47

ఉ. మారుని గన్నతండ్రి సిరిమానసము న్గబళించునేర్పు సొం
పారఁగ నైజమై చను మహారసికుండు సమగ్రసారశృం
గారరసాధిదేవత జగద్రమణుండు మురారి యట్టిశృం
గారరసైకపాత్ర మనఁగాఁ దగదే పురరత్న మెమ్మెయిన్. 48

ఉ. శ్రీసతికి న్మురారికిని సేసలు పెట్టినపెండ్లిపెద్దల
బ్జాసనుఁ డంబుజోదరమునం దుదయించిననాఁడు చేరి యు
ల్లాసము పల్లవింప సుపలాలనఁ జేసినయమ్మ లెల్ల సం
తోసమున న్ముకుందుసయిదోడులు తత్పురిపుణ్యభామినుల్. 49

సీ. హరిదాసులను హత్తి కరులు శ్రీకరు లెల్లఁ గల్క్యవతారసంకల్పలీల
శ్రీనాయకుఁడు సవరించిన బలుమావుబడిపుట్టినవి హయప్రతతు లెల్లఁ
బుట్టువుఁ జావును బోవంగఁ దట్టిన గరువంపుదిట్టలు పురుషు లెల్ల
దివ్యవిమానమాత్రికము గేహము లెల్లఁ గౌస్తుభజ్ఞాతులు క్రమ్రరత్న
గీ. జాతు లెల్ల విరించి హంసవ్రజంబు, బలఁగ మింపార రాయంచపదవు లెల్ల
విమలకమలాక్షునాభిపద్మమునఁ గన్న, తమ్ము లెప్పుడు కొలఁకులతమ్ము లెల్ల. 50

ఆ. సకలకాలకుసుమసంపద సొంపారి, నిఖిలసుఖవిహారనిర్మితులకుఁ
గారణంబులై యుదారమందారంబు, లగుచుఁ బురవనంబు లలరు నెపుడు. 51

సీ. హరిభూతభావభవ్యావతారంబులఁ గీర్తనం బొనరించుఁ గీరసమితి
సప్తసామములు సుస్వరముగ మునికోటి సదివించుఁ గోకిలసముదయంబు
శ్రీకాంతుకమనీయశృంగారలావణ్యకథలు పేర్కొను శారికాగణంబు
ప్రణవమంత్రాస్వాదపరిపాక మింపార నభ్యాస మొనరించు నలికులంబు
గీ. ఘోరసంసారతాపనివారణంబుఁ, జేయుచున్నతభూరుహచ్ఛాయచయము
సరసగీర్వాణగ్రంధంబు చల్లుఁబుష్ప,జాతి యప్పురియుపవనస్థలులయందు. 52
చ. ఉరుతరశంఖచక్రరుచి నొప్పులసద్విమలోదరస్థితాం
బురుహవిభూతిఁ బేర్చి పరిపూర్ణజలాశ్రయశాశ్వతోన్నతిన్
బరఁగి నవోత్పలాంచితవిభాగరిమ న్సిరిఁ జెంది యొప్పు న
ప్పురికమలాకరంబులు విభుం డగువిష్ణునిమూర్తులో యనన్. 53
సీ. తరితాల్పు పొక్కిటితమ్మికమ్మనితావి యెల్లనద్దెసలను జల్లిచల్లి
పరమాత్ముపదములఁ దొరఁగి పారెడు నేటితెరఁగలపై లీల దాఁటిదాఁటి
శౌరికౌఁగిటఁ జొక్కుచపలాక్షిపులకలచెలువంబునకుఁ బ్రోదిఁ జేసి చేసి
హరిమ్రోలవినతాంగుఁడై యున్నయురగారిరెక్కలు పలుమారు గిలిపి గిలిపి
గీ. కొలువు తత్తిఁగోరి సంభ్రమాకులతఁ బాయ, చెంచు వేల్పులమూకల సేద దేర్చి
వెన్నునగరిలోపల నెల్ల వెంటలకును, దానయై యొప్పుఁ బురముమందానిలంబు 54
వ. మఱియు నప్పురంబు పురుషోత్తముమహిమయుంబోలె వర్ణనాతీతవైభవంబును, లక్ష్మీహృదయంబునుంబోలె నారాయణనివాసయోగ్యంబును, వేదాంతసారంబునుంబోలె మహాయోగిదర్శనోపలాలితంబును, భాగవతపురాణంబునుంబోలె నచ్యుతావతారకథాబహుళంబును, నరసింహుదివ్యరూపంబునుంబోలెఁ బ్రహ్లాదవరదగౌరవకారణంబును, మహాగిరికంధరంబునుంబోలె హరినిద్రాసుఖోచితస్థానంబును, బుండరీకాక్షువక్షంబునుంబోలెఁ గమలాకరకమలరజోనురంజితంబును, శంకరువామభాగంబునుంబోలె సర్వమంగళాలంకృతంబును, నహోబలతీర్థంబునుంబోలె భవనాశనీరాగాగతసాధుజనానుష్ఠితహరిదర్శనోత్సవంబును, నిధిలోకంబునుంబోలె సతతసన్నిహితముకుందశంఖపద్మకాంతికమనీయంబును, సముద్రమథనావసానంబునుంబోలె దామోదరదయాలబ్ధామృతముదితసుమనస్సముదయంబును, బాతాళంబునుంబోలె విశ్వంభరోద్వహనసమస్తభోగీంద్రభోగాస్పదంబును; జ్యోతిశ్చక్రంబునుంబోలె విష్ణుపదాశ్రితనిరతమునిమండలానుగతధ్రువస్థానకమణీయంబును నగుచు ననేకనీలమణిప్రభానివహాంధకారితగగనభాగం బయ్యును పీతాంబరవిలసితంబును, శేషభోగాస్పదం బయ్యును నశేషభోగనివాసంబును, బహుసంయమిజనాధిష్ఠితం బయ్యును పరమముక్తిపదంబును, సముత్తుంగగాంగేయభవభాసురం బయ్యును శిఖండివిహారహృద్యంబును, వివిధవిలాసినీవిలసనోల్లసితంబయ్యును జితేంద్రియగమ్యంబును, సుప్రో

దరస్థితంబయ్యును సుకవిముఖవిరాజమానంబును నై విలయక్లేశంబునకు నగమ్య
ప్రదేశంబును, భయంబులకు ననాశ్రయంబును, ధర్మంబులకుఁ బరమధర్మంబును,
మోక్షంబులకు నపరోక్షంబును, మాంగల్యంబునకు నౌజ్జ్వల్యంబును, నానందంబునకు
నిష్యందంబును, సౌభాగ్యంబునకు నిత్యయోగ్యంబును, నాశ్చర్యంబులకు ననేకధు
ర్యంబును, సకలభువనపోషణంబును, సకలదురితనిస్తారకంబును, సకలశ్రుతిపురాణవర్ణ
నీయంబును, సకలసాధుజనాకర్ణనీయంబును నైయుల్లసిల్లునట్టి వైకుంఠపురంబునందు.

శా. రాకాచంద్రసహస్రకోటితులనారమ్యోల్లసత్కాంతియుం
బ్రాకారప్రతిహారతోరణసభాప్రాసాదవేదీవితా
నాకీర్ణంబును దీర్ణకేతురతసౌధాగ్రంబు నై యొప్పు లో
కైకశ్రీకర మంబుజాక్షునగ రత్యాశ్చర్యధుర్యస్థితిన్. 56

ఉ. ఆనగరంబు రాజు వివిధాద్భుతరత్నమరీచిమండలో
త్తానలసద్విమానరచితం బగుభూరిభుజంగపుంగవో
న్తానమనోజ్ఞభోగగరిమంబున నుత్కటభవ్యయోగిలీ
లానుభవంబునం బోలుచు నచ్యుతుఁ డాత్మవివేకయుక్తుఁడై. 57

శా. హేమస్తంభమణిప్రదీపములు లింపేపారుకర్పూరసా
రామోదం బెలరారు మేటితెర వొప్పారుఙ్ లసన్మౌక్తిక
స్తోమప్రస్ఫురితోపహారవితతుల్ సొంపారు మాంగల్యర
క్షాముద్రల్దవరారుఁ జక్రధరుశ్రీశయ్యానివాసంబునన్. 58

ఉ. చుట్టును గల్పవృక్షములు చుట్టును బుష్పలతావితానముల్
చుట్టును కేళిశైలములు చుట్టును సిద్ధరసాంబువాహినుల్
చుట్టును బూర్ణదీర్ఘికలు చుట్టును గోకిలకీరనాదముల్
చుట్టును హంసికాగతులు సొంపెసఁగుఙ్ హరిమందిరంబునన్. 59

మ. మును లేతెంచి నుతింపుచుండుదురు సమ్మోదంబుతో నమ్రులై
పను లాజ్ఞాపన సేయువేళలఁ దగం బాత్రుల్పిలింపోత్తముల్
పెను పై కొల్తురు మూఁడులోకములు తృప్తిం బిన్నపెద్దల్ మహా
ఘనతేజోనిధి యైనశ్రీవిభు శుభాగారాంగణక్షోణులన్. 60

ఉ. ఆడుదు రెల్లప్రొద్దు లలితాభినయంబున దేవకామినుల్
పాడుదు రింపు వీనులకుఁ బండువ సేయఁగ వేడ్కఁ గిన్నరుల్
గూడి సమగ్రతత్త్వరసగోష్ఠి సుఖింతురు యోగిబృందముల్
క్రీడ యొనర్తు రప్సరసకీర్తితభంగిఁ బ్రసన్నులయ్యెడన్. 61

వ. ఆదివ్యమందిరంబునకు నక్షకులై యష్టదంష్ట్రులు చతుష్షష్టిదంతులు మహామస్తకవక్షస్థల
బాహుచరణదారుణాభిరామశరీరులు విచిత్రభూషణాంబరగంధమాల్యాంగరాగులు

నాయుతశక్తియుక్తులును నానావిధాయుధహస్తులును నసమానసత్త్వసంరంభగంభీరు
లును నిరుపమాష్టవిధైశ్వర్యధుర్యులును నగునారసేకశతసహస్రలక్షకోటిపద్మసం
ఖ్యల మొత్తంబులై విష్ణుకింకరులు చండప్రచండాదులు పూర్వద్వారంబున గణపతి
యమప్రభృతులు దక్షిణద్వారంబునను సుఘరకోరకముఖ్యులు పశ్చిమద్వారంబు
నను పద్మాక్షపద్మగర్భంబుప్రముఖులు త్తరద్వారంబునను నిరంతరంబునుండురు మఱి
యుఁ జతుర్భుజులును శంఖచక్రధరులును బీతాంబరులును నీలాంబుదవర్ణులు నగ
ణ్యాసంఖ్యలన్నగరికి నెల్లెడలను గావలియై చరియింతురు ఇట్టి గణకోటికి నెల్లమే
టితను నారాయణప్రసాదభాజనుండును నగువిష్వక్సేనుం డనుమహాపురుషుండు గణ
విమానసహస్రంబులు పరివేష్టింప నద్భుతవిమానారూఢుం డగుచు శ్రీమహాలక్ష్మిఁ
గూడుకొని తిరుగుచుండు నట్టియసమసామ్రాజ్యంబు జగదేకపూజ్యంబై తనకు
ననురూపం బగుచు నుండ నుద్దీపితుం డై. 62

సీ. పద్మనివాసిని పట్టపుదేవియు నలినాసనుఁడు ప్రియనందనుండు
విహగాధినాథుండు మహనీయవాహనం బహికులాధీశుఁ డింపారుశయన
మతిలోకనందకం బద్భుతోజ్జ్వలహేతి ఘనపాంచజన్య ముత్కటపుఁ జింద
మింద్రాదిసురలు సమిద్ధసేనకోటి సిద్ధమునీంద్రు లాశ్రితగణంబు
తే. ధర్మసంస్థాపనలు వినోదంపుఁబనులు, శ్రుతులు నుతు లిట్టి యతులితోన్నతులఁ జేర్చి
లీల బ్రహ్మాండకోటిఁ బాలించుచుండు, నార్తరక్షాపరుండు నారాయణుండు. 63

క. ఆదేవుదివ్యమహిమం, బాదేవుఁడు తానె యెఱుఁగు నన్యుల కెఱుఁగం
గాఁ దరమె విధిపురందరు, లాదియగునదివిజులకును నందునె యెంచున్. 64

సీ. భూరిరజోగుణస్ఫురణపద్మజుఁ డనా భువనప్రపంచంబు పొడవుఁ జేయు
మహనీయసత్త్వసమాధివిష్ణుం డనాఁ బొదలించు జగములఁ బొలుపు దెలుప
గాఢతమోగుణాకలన నీశుం డనా నొక్కట నిఖిలంబు నడఁచి యడఁచుఁ
గలితగుణత్రయోజ్జ్వలపరాత్ముం డనా నెగడి విశ్వమునకు మిగిలి వెలుఁగుఁ
ఆ. గేవలుండె నిఖిలదేవచూడామణి, యాఖిలదేవతామయైకమూర్తి
సకలదేవశరణచరణాంబురుహుఁడు లక్ష్మీశ్వరుండు జగదధీశ్వరుండు. 65

చ. సిరి గరుడుండు చారుతులసీదళదామము కౌస్తుభంబు ప్ర
స్ఫురదురుశంఖచక్రములుఁ బొక్కిటితమ్మియుఁ బచ్చపుట్ట మిం
పురిలెడుచూడ్కియుం గరుణ నూనినయుల్లము నైనమూర్తియే
వరహరి గ్రాలు వాఁ డొకఁ డనాథుఁ డశాశ్వతసౌఖ్యసిద్ధికిన్. 66

చ. తపములఁ బోనిపాపములు దానగుణంబులఁ బోనిదోషముల్
జపముల నారిపోనికలుషంబులు దుష్కరః దూలిపోవు న

చ్చఁపుఁదలఁపొప్ప నొక్క మరి సర్వము నైన రమేశుపేరు తీ
యఁపుఁబలు కింపుమీఱ ననయం బొడఁగూర్పఁగ నేర్పుగల్గినన్. 67

క. కరుణయుఁ దనకుఁ దొడవు త,త్పరచిత్తులదెసయ తనకు భాగ్యము భక్తో
ద్ధరణంబు తనకు ధృతి శ్రీ,వరుఁబోలం గలుగు నొరుఁ డెవ్వఁడు జగమందున్. 68

సీ. నాలుగుమొగములబాలుఁ బొక్కిటితమ్మి సృజియించి జగములు సేయఁ బనిచె
నింపారుతెలినీటియే ఱంఘ్రితలమునఁ గలిగించి దురితము ల్గడుగఁ బనిచెఁ
దుదలు గానఁగరాని చదువులు మనసునఁ బొడమించి తగవులు నడుపఁ బనిచె
గర్వంపుఁగెంపులు కడకంటిచాయల బుట్టించి దివిజులఁ బ్రోవఁ బనిచెఁ

గీ. దలఁపులకుఁ జేరుగడ తాన తెలివులకును
నిక్క దాన పలుకులకు నెడము దాన
యజరుఁ డమరుఁ డనంతుఁ డవ్యయుఁ డచింత్యుఁ
డనఘుఁ డజుఁ డంచితశ్లోకుఁ డచ్యుతుండు. 69

వ. ఇట్టిపరమేశ్వరుండు పరమప్రభావభరణుం డగుచు భువనహితచరితంబులం బొపుచు
శుభంబులం జూపుచు భక్తజనపారిజాతంబనఁ బ్రఖ్యాతియుం గరుణారసప్రీతియుం
దనకు సహజంబులై వెలయ వైకుంఠపురంబున విహరించుచుండఁ గ్రమంబునఁ దిమి
కనుతవరాహావతారంబు లుదారంబులై ప్రవర్తిల్లినయనంతరంబ యొక్క కాలంబున
నీలమణిసుందరం బగునిందిరాసుందరీదివ్యదేహంబునం బొదలు కాంతిప్రవాహంబుగ
సిగ్గున వెలుకఁబాఱినపోలికం జులుకనై వెలిమొగులు మొత్తంబులుం దెసలుకడ న్గడ
లుపడి తూలం బ్రకటయోగనిద్రావసానంబున నానందంబునొందుగోవిందులోచనా
రవిందదళంబులచందంబు ననుకరించుటకు నాయితం బయినకరణిం గమలంబులు కమనీ
యరుచినిచయంబులం బచరింపఁ బరమపురుషపాణితలంబునఁ బ్రద్యోతమానంబగు
పాంచజన్యంబునకు నన్వితంబుగాఁ దవపూర్ణేందుబింబంబుగా నిబిడచంద్రికానిష్యం
దంబు నిగిడింప నీరజోదరుపొఁకురంబునఁ బొలుచువలుదమానికంబునకుఁ జేరువచుట్టం
బనాఁదగి యరుణకిరణుండు నిరావరణంబు లగుకిరణంబుల వేఁడిమి మూఁడుజగంబుల
నిగిడింప సజ్జనచిత్తంబులం గేలివృత్తంబులు సల్పుజలశయనునిరతిశయగుణంబుల
కనుగుణంబులైనయోజ రాజమరాళంబులు విమలకమలాకరంబుల విహరణకళాకౌ
శలంబులు సొగియింప జగదేకాశ్రయం బగుశ్రీవత్సలాంఛను నాశ్రితజనంబుల మ
నోరథంబులచాడ్పున సస్యసముదయంబులు సమగ్రఫలంబులం బొలుపార నవక్ర
విక్రమోదగ్రుం డగుచక్రధరుభావినరసింహావతారంబున విదారణీయుం డగు దైతే
యురుధిరబిందుసందోహంబుతోడిబాంధవంబు ననుసంధిపం దివురుపగిదిబంధురబంధూ
కంబు లనంగ్యసహస్రదీప్తిం దిలకింప నకుంఠితకైవల్యకళ్యాణకారణం బగునపార

నారాయణమహిమాకారపారావారంబులం జేరు ప్రబుద్ధజనంబులబుద్ధులతెఱంగునం
గలంకదేరి యొఱపులెఱిలి విలసిల్లు నుత్ఫుల్లహల్లకోల్లాసియుఁ గుముదామోదముదిత
మధుకరనికరంబును గువలయచ్ఛాయానుబంధాంధకారితకువలయంబును గాశప్రకా
శితాశావివరంబును నై శరత్సమయంబు సకలలోకాలంకారం బగుచున్న యెడ. 70

చ. నిరుపమభోగితల్పమున నిర్మలయోగవిశేషలీల మై
శరనిధికన్యకామణికుచద్వయకీలితవక్షుఁ డై మనో
హరసుఖనిద్ర నున్నకమలాక్షుఁడు మేల్కని యొప్పె యోధి పెం
దరఁగలమ్రోఁత మంగళమృదంగమృదుధ్వని యై చెలంగఁగన్. 71

సీ. నెరసినచిక్కని యిరుచన్నుఁగవచెన్ను పరిపూర్ణకుంభవిభాతి దనరఁగఁ
జెలిగ్రాలుకన్నులఁ బొలయుమెఱుంగులు కోలునీరాజనలీల లనఁగ
జిగిమీఱుపలుచని చెక్కుటద్దంబు రమణీయదర్పణరచన యనఁగఁ
దళుక్కొత్తుచిఱునవ్వు తెలుపులసొంపులు పుష్పోపహారవిస్ఫూర్తి యనఁగఁ
గీ. దనమనోహరభావంబు దనవిభునకు, నుచితమంగళవిధములు నుల్లసిల్ల
నున్న మేల్కని మున్నిటిముద్దుగూతు, రమరె నీలాబ్జమధుపగానములు చెలఁగ. 72

చ. ఉరుతరకల్పపన్నగఫణోజ్జ్వలరత్నసహస్రదీప్తి మైఁ
బరఁగఁ గరంబు పొల్పెసఁగెఁ బద్మదళాక్షుని మేను నూతన
స్ఫురదరుణాంశురాగరుచి నూరెఁ బర్వఁగ నుల్లసిల్లు సుం
దరమహనీయనీలవసుధాధరశృంగము పోల్పఁ బట్టఁగన్. 73

వ. అంత. 74

సీ. అంబుధినాదంబు నతికరింపుచుఁ బర్వె నభమునఁ బాంచజన్యస్వనంబు
జయజయశబ్దవాచాలితం బయ్యె సుదర్శనలీల సుదర్శనంబు
ముదముబ్బరాఁ గౌమోదకి బహువిధభ్రమణవేగమున నర్తన మొనర్చె
నఖిలైకనందకం బగునందకము మ్రోలదీప్తిపరంపర దీటుకొలిపె
గీ. పసిఁడిసీరుమీఁదఁ బరఁగినక్రియ నిజపక్షకాంతి దిశలఁ బ్రజ్వరిల్ల
నాదిదేవుమ్రోలఁ బ్రాంజలి యై పొడచూపి నిలిచె భుజగసూదనుండు. 75

వ. ఇట్లు బోధంబు నొంది కొండొకసేపు గోవిందుండు మందస్మితసుందరవదనారవిం
దుండగుచు నిందిరతోడ సరససల్లాపసౌహార్దంబునం దగిలి కొండొకసేపు. 76

ఉ. ఆనలినాయతాక్షి నయనాంచలచంచలతాసవిభ్రమ
భ్రూనటనంబు నాతరుణిపూర్ణముఖేందువిలాసహాస మ
మ్మానినిముగ్ధభాషణసముచితమంజులలీల యెంతయున్
మానసమున్ బ్రమోదరసమగ్నముగా నొనరింప నున్నెడన్. 77

క. డెందమునఁ గొలుపువేడ్కలు, సందడిగొన నేగుదెంచి సంయమివరులున్
బృందారకులు న్నిల్చిరి, క్రందుగ జగదీశమందిరద్వారమునన్. 78

వ. అప్పుడు. 79

సీ. అవసరం బిప్పుడ యగునంతదాఁకను బగళమై నిలుఁడు దిక్పాలవరులు
సందడిసేయక యందఱు నించుక సేపు కూర్చుండుఁడు సిద్ధమునులు
దండియలును మీరు దడియంగఁబడక యంతకయాటుపొందు గంధర్వముఖ్యు
లిందాకఁ బొగడితి రించుకపడి యింక జగడంబు మానుఁడు చారణేంద్రు

గీ. లనుచు నుద్ధతవేత్రదండాభిరాము, హస్తులై పణిహారు లందంద నిలువ
నధికమై యొప్పె సమ్మర్ద మాదిదేవు, భూరిమందిరతోరణభూమియందు. 80

వ. అట్టిసంకులసమయంబునందు. 81

క. సనకుఁడు సనందనుండును, సనత్కుమారుఁడు సనత్సుజాతుం డనఁగా
మునివరులు వనజభవునం,దను లేతెంచిరి ముకుందదర్శనవాంఛన్. 82

వ. ఇట్లు వొచ్చి యనివార్యగమనంబున నరుగుదెంచువారికి నడ్డపడి విష్ణుసారూప్యదేదీప్యమానకాయులును దత్ప్రతీహారపాలనపదవీనిత్యనిరపాయులును జయవిజయనామధేయులును నగువారిద్ద ఱమ్మునీంద్రుల కిట్లనిరి. 83

ఉ. ఇప్పుడ మేలుకాంచెఁ బరమేశుఁడు సాగరకన్యకాంతతోఁ
దెప్పలఁ దేలుచున్నతనతీయపుఁజూపులనేని యొండు మైఁ
ద్రిప్పఁడు పాఁపపాన్పుపయి దివ్యపదంబు పసిండిపావ యాం
దొప్పఁగనేని మోపఁ డట నొంగ్గుము జేరరు ప్రాలి యెవ్వరున్. 84

క. ఈసిద్ధులీసురప్రభు, లీసంయమివరులు జగదధీశ్వరుఁ గొలువం
గా సమయము గాచి తదే,కాసక్తత నున్నచంద మటు గనుఁగొనుఁడా 85

క. మీరును నొక్కింతదవవ్వు, సైరణతో నిలిచి సమయసముచితముగ ల
క్ష్మీరమణుఁ గని కృతార్థస, మారంభుల రగుఁడు తద్దయాలాపములన్. 86

చ. అనుటయు నాదిదేవుఁ బరమాత్ముఁ గనంగొన నెమ్మనంబులన్
మొనయుకుతూహలాంకురము మోడ్పడఁ గోపముచిచ్చుతోఁకునన్
ఘనతరబోధపల్లవము గందఁగ సైరణ యన్మహావ్రతం
బునకు విఘాత మొంద మునిపుంగవు లొక్కట నుగ్రమూర్తులై. 87

ఆ. అఖిలలోకగమ్యుఁ డగుపరమేశ్వరుఁ, జూడఁ గోర్వ నబ్బుసుకృతమునకు
నంతరాయ మైతి రట్టియద్దురితంబు, ఫలము ననుభవింపవలయు మీరు. 88

ఉ. కావున ధర్మవిద్విషులు కల్మషకారు లనంగ దుష్టమో
హావిలబుద్ధితో నసురలై జనియింపుఁడు సంతతంబు ల

క్ష్మీవిభుమీఁదిపచ్చరము కిన్కయుఁ గాఁతీయఁ బెట్టుఁగాత మీ
భావము లిప్పు డేపగిది బాములు పెక్కగు నిక్క మెంతయున్. 89

వ. అని వారు ఘోరంబుగా శపించిన. 90

క వెఱఁగుపడి హర్షరాగము, దఱికిన వదనములు వెల్లఁదనము గదుర బి
ట్టుఱమూర్ఛ మునిఁగి యయ్యి, ద్దఱు నిలిచిరి వేత్రదండతాడితతనులై. 91

వ. ఆసమయంబున. 92

సీ. ఇమ్మహాపురుషుల కెంతమాత్రపుఁ గాఁగ నేలకో యాకోప మిట్లు పుట్టె
నమృతాంశదీధితు ల్గగ్గి సల్లుట గాదె యీమూర్తులకుఁ గన నిట్లు కలిమి
యూహింపఁగాఁ గార్య మొకటి యేమేనియుఁ కలుగునూదక వీర లలుగువారె
సాత్త్వికు లై యిట్లు సైచిరిగాక యీ యిద్దఱు నల్పులే యిద్ధమహిమ

గీ. ననుచు మునులును సిద్ధులు నమరవరులు, నాదిగా నెల్లవారలు నచట నచటఁ
గూడి పెక్కుభంగుల మాట లాడుచుండఁ, దుముల మంబునిధిధ్యానసమతఁ బేర్చె.

వ. అవృత్తాంతం బంతయుఁ దనదివ్యచిత్తంబున నవధరించి సకలజగన్నివాసుం డగువా సుదేవుండు లక్ష్మీసహితంబుగా ససంభ్రమంబున నచ్చోటికి విజయముచేసి సనకాదు లం జూచి మీరు సకలలోకద్వారంబుల ననివారితసంచారులకు వీరు చేసినతప్పు నాయది యుపశమంబు నొందుండని యనునయించిన నయ్యోగీశ్వరులు మహాయో గీశ్వరేశ్వరుండైన లక్ష్మీశ్వరుసందర్శనంబును సంభాషణంబునుం గని కృతార్థులై పర మానందంబునఁ దదామంత్రణంబు వడసి నిజేచ్ఛం జనిరి. మధుమథనుండును మగిడి యభ్యంతరమందిరంబునకుం జని వైనతేయుం బనిచి ప్రతీహారపాలురం దనపాలికి రావించిన నయ్యిరువురుం బురాణపురుషునకుఁ బరమభక్తిప్రకారంబు లగు సాష్టాం గదండప్రణామంబు లాచరించి కృతాంజలులై యొక్కదెస నొదిఁగి నిలిచిన నప్పర మాత్ముండు బహుళకారుణ్యపుణ్యావలోకనసాధాసారంబు వారలపైఁ బరపి దరహాస ప్రసాదసాదరవదనుండగుచు ని ట్లనియె. 94

క. మీఱినమానులకినుకకు, మా అలుగక యున్న మీసమగ్రక్షమ వే
మాఱుఁ గొనియాడఁగాఁ దగు, గీఱునె సాత్త్వికులబుద్ధి కిల్బిషచయముల్. 95

ఉ. ఎంతఁ గొఱంతఁ జేసియు మహీసురముఖ్యులు నాకుఁ జూడఁగా
నెంతటివారి కైనను సహింపఁగఁ బాత్రము లమ్మహాత్ములం
దెంతటిపూజ్యు లైనఁ దగు నెంతటిమన్ననసైన నొప్పుఁ దా
రెంతలుగా మదిం దలఁతురేనియు నంతయుఁ దత్ప్రభావముల్. 96

సీ. అజ్ఞానరోగంబు లఱఁతిబెట్టెడుచోట దివ్యౌషధంబు భూదేవసేవ
పురుషార్థసిద్ధులఁ బొందెడుచోటను, నమరభూరుహము విప్రార్చనంబు

దురితాంధకారంబు పఱఁగి క్రమ్మినచోటఁ బటుభానురుచి బ్రహ్మభాషితంబు
దుఃఖభయంబులు దొడరి సోఁకినచోట నభయమంత్రము బ్రాహ్మణాశ్రయంబు
గీ. సారభద్ర ముత్తమవర్ణచరణరజము, భవ్యతీర్థంబు బాడబపాదజలము
సకలజన్మంబులకు నగ్రజన్మకులము, చేరుపోటిది సిద్ధాంతసిద్ధమతము 97
శా. నారూపంబులు మేదినీసురలు నానారూపదీప్యత్తప
స్స్ఫారోదారులు భూరితేజులు జగత్సంభావ్యకోటిప్రసా
దారంభప్రతిభావిభాసితులు విశ్వాధారు లామ్నాయసం
స్కారాకారులు లోకసమ్మతయశోగంభీరతాజృంభితుల్. 98
క. దైవాధీనము త్రిజగము, దైవము తన్మంత్రవశము తన్మంత్రము భూ
దేవతలచేతి దగుటను, దైవములకు దైవతములు ధరణీదివిజుల్. 99
ఆ. బ్రాహ్మణావమానపరు లైనవారలు, నన్ను నాత్మ నొల్లకున్నవారు
విప్రవరులఁ గరము వేడుకఁ బాటించు,వార లెల్ల నన్ను వలచువారు. 100
వ. కావున బ్రాహ్మణవచనాతిక్రమణం బొనరింపక జన్మాంతరంబులు గైకొనవలయు, నతి
మాత్రశత్రుత్వంబునను ననుమానింపవల దదియు నుదాత్తసిద్ధిప్రదంబ, యట్టిశత్రుం
డు నిరంతరంబు నుద్గతంబైన హృదయంబునం దస్మదీయసాదృశ్యంబు తనకు గావల
యుటం దలంచుటఁ దత్ప్రకారంబు సాయుజ్యసంపత్కారంబు మీరు చిరకాలంబు
నన్ను భజియించిన దాసులగుటం జేసి పరమైశ్వర్యభాజనంబులగు జన్మంబులఁ దేజో
విభవంబుల ననుభవించి తుది నస్మదైక్యంబు నొందంగలవార లిది యంతయు నేను
మాయాబలంబున మీకు శ్రేయఃకారణంబులుగా నుత్పాదించిన యుపాయంబు సన
కాదులకాదు శర్వుం డైన మద్భక్తజనంబుల ధిక్కరింప శక్తుం డగునె? యిత్తెఱంగు
మాంగళ్యంబుగా నంగీకరించునది, యంతరంగంబుల కలంకదొలంగుఁ డని యానతిచ్చి
వెండియు నిట్లనియె. 101
మ. పగవాఁ డైనను మూర్ఖచిత్తుఁ డయినన్ బాపాత్ముఁ డైనన్ మదీ
యగుణధ్యానవిధేయధీపరిణతుం డై యున్న నే నాతనిన్
సుగుణుంగా నతిధన్యుఁగా సుజనుఁగా శుద్ధాత్ముఁగా నిత్యుఁగా
జగదేకప్రభుఁగాఁ బ్రభూతవిభవస్ఫారాత్ముఁగాఁ జేయుదున్. 102
శా. ఏ నెవ్వాఁడనొ నాచరిత్రము తెఱం గెబ్భంగియో మన్మయ
ధ్యానం బెట్టిదియో యెఱుంగని విమూఢాత్ముండు మన్నామమె
ల్లైనం జేర్కొనఁ గాంచునేని దురితోదగ్రాంధకారచ్ఛటా
భానుం డీతఁ డనంగ భవ్యపదముం బ్రాపించువాఁడున్ మదిన్. 103
క. నారాయణాఖ్యుఁ డగుసుతుఁ, బేరుకొనినబోయ కట్టిపెం పొదవెను వాఁ

జేయు పుహాడో మందర, మీరటు దలపోయుడా సమాహితబుద్ధిన్. 104

వ. మదీయశరణాగతుల నిగుటంజేసి మీకు నెందును శుభంబ. సకలచరాచరజనకుం డైన కశ్యపమహామునీంద్రుండును దక్షకన్యావరేణ్య యగుదితియునుం దొలుత భవదుద్భవకారణంబయ్యెదరు ప్రహ్లాదవిరోచనబలిప్రముఖు లగు భాగవతోత్తములు భవదీయవంశంబునం బరమపావనులై యుదయించెదరు అని యిట్లునిర్దేశించిన దేవదేవు నానతి నానందంబు నొంది యయ్యిద్దఱు మునుందునకు నందంద ప్రముస్తుచుబహువిధంబులం బ్రస్తుతించిరి. హరియుం బేరోలగం బిచ్చి నిజదర్శనార్థు లగు సురముని ప్రముఖులం గృతార్థులం జేసి నిఖిలజగంబుల రక్షించు చుండె నంత 105

క. అజయవిజయులు పుట్టిరి, తేజంబునం గశ్యపునకు దితికిని సుతులై
రాజితదై తేయమహా, భ్రాజిష్ణుసుఖైకయోగ్యభాగ్యస్ఫురణన్. 106

క. అనిగాలవమునివరునకు, ననఘుండు దేవశ్రవుండు హర్షముతోం జె
ప్పినపుణ్యకథన మంతయు, వినుతోక్తుల విస్తరించి వెండియుం బ్రీతిన్. 107

## ఆశ్వాసాంతము.

క. సౌభాగ్యభాగ్యలక్ష్మీ, లాభోన్నతవక్ష భువనలాలితరక్షా
లోభాదరహితసంప, ద్వైభవభవ్యాత్మ లక్ష్య ధర్మాధ్యక్షా. 108

మానిని. భూరికృపారసపోషణ కౌస్తుభభూషణ దుస్తరభూమభవో
త్తారణ దైత్యవిదారణ విశ్వవిధాయక మంగళదాయక నా
భీరుహపంకజపీఠచతుర్ముఖ ప్రేక్షితదుర్ముఖ పేశలధా
రాధరుచిరాసిధరా దురితాగ్నిశరా న్నృహరీ గుణరత్నగిరీ. 109

క. వినతవిశారద నారద, మునివరురోద్గీతనినద మోదభ్యస్తా
దనుసుఖఖండనమండన, సునిశితనిర్వక్రచక్రశోభితహస్తా. 110

వనమయూరము.—

స్ఫారగుణహార శ్రుతిసార జగదేకాధార విదుదార నగధార ననమేఘా
కార యవికార యనికార కరుణాలంకార భవభావశుభకారణవిహారా. 111

గద్యము. ఇది శంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిమిత్రసంభవ శంభుదాసకృతనాభిధేయ యొఱ్ఱయనామధేయప్రణీతంబైన లక్ష్మీనరసింహావతారం బనుపురాణకథయందుం బ్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# ద్వితీయాశ్వాసము.



శ్రీమదహోబలతీర్థ
గ్రామణి శ్రుతికామినీశిఖామణి కరుణా
ధామ జగదవనవిహిత
స్థేమ దురితకరటిసింహ శ్రీనరసింహా. 1

వ. దేవా రోమహర్షణుండు మహర్షుల కిట్లనియె. అట్లుపుట్టి హిరణ్యకశిపుహిరణ్యాక్షు
లనుపేళ్లఁ బ్రసిద్ధివహించిన యయ్యిద్దఱు దైత్యులయందును నగ్రజుండు. 2

సీ. కనలుబింకపుఁగింకఁ గలుగు వేఁడిమియెల్ల నొక్కటియై యొడ లొత్తె ననఁగఁ
కఱకుఁబ్రల్లదమునఁ గల్గు పోఁడిమియెల్ల నచ్చమై తెగఁబొడవయ్యె ననఁగఁ
గటికరై తనగారుగర్వంబునకుఁ గల చేగ యెల్లను రూపు చెందె ననఁగ
వెగ్గలంబై పేర్చు వీరంబునకుఁ గలపసిక యెల్లను మేను వడసె ననఁగఁ
గీ. ప్రళయకాలదహనుఁ బాటించువోర యనఁ, జండదండధరునిసఖుఁ డనంగఁ
దేజరిల్లె నైజతీవ్రమానమున హిరణ్యకశిపుఁ డుపశరణ్యరిపుఁడు. 3

మహాస్రగ్ధర. తనదోర్దర్పంబు తెల్పం దలచి సరభసోత్పాతదిగ్దంతిదంత
ధ్వనితబ్రహ్మాండవాద్యోత్తరళితగతులం దారతారాఘముక్తా
జనితప్రాలంబరాకాశశధరకలితచ్ఛత్రుఁడై మేరుసింహా
సన మెక్కం జూచు దైత్యేశ్వరుఁ డతులనిజైశ్వర్యవిఖ్యాతి నొప్పన్. 4

ఆ. అసురు లనినఁ జంప నలుగు నవ్యాహారు, లనిన నోరికట్లు గొనఁగఁ దలఁచుఁ
ద్రిదివరాసు లనిన నసుమంగఁ జూచుఁ బా, తాళమునకు దేవతల నతండు. 5

క. ద్వేషించు నాగమంబుల, రోషించున్ ధర్మపదనిరూఢస్థితికిన్
బోషించు మత్సరోద్ధతి, భూషించు మదాతిరేకమునఁ జరితంబున్. 6

వ. ఇట్లు ప్రకృతిపౌరుష్యదూష్యప్రకారుం డగుచు నయ్యసురవీరుండు సంతతైశ్వర్య
విహారంబుల వర్తిల్లుచుండి తనమనంబున నొక్కనాఁ డిట్లని వితర్కించు. 7

చ. అమరులతల్లికంటెను మదంబ వరిష్ఠ త్రిలోకరాజ్యభో
గములును నాక యోగ్యములు గాని నిలింపుల కెట్లు గల్గు ను

ద్యమగరిమంబు మై సురల నందఱ మ్రుచ్చులఁ బోలెఁ దీవ్రదం
డమునను జంపి యొక్కఁడ గడక్కఁగ నేలెదు లోకమంతయున్. 8

క. కావున నుగ్రపుఁదపమున్, గావించెదఁ దపముచేతఁ గానివి కలవే
యేవిధము పనులకైనను, గేవలబలమున నుపాయకృత్యము వెలిగన్. 9

సీ. అమరపదంబును నమరేంద్రపదము తపంబను భూజంబు పండ్లు గావె
సప్తర్షిపదము భాస్వద్ధ్రువపదమును దపమను పువ్వుగంధములు గావె
పద్మజాపదమును బద్మాక్షుపదము నున్నతతపస్సుకీర్తిరత్నములు గావె
సిద్ధపదంబును శ్రీకంఠపదమును రూఢతశ్శోభాకరములు గావె

గీ. తపములావునఁ గాదె యుద్ధగణిబలము, నఖిలమును దాల్చియున్నవాఁ డహి యొకండ
కాన ధర్మార్థకామమోక్షముల కెల్లఁ, దపము సాధన మగుట సిద్ధంబ కాదె. 10

క. ఘోరమగు నిష్ఠ యుద్యద, మేయతపోనిష్ఠ నజుని మెచ్చించెద మ
త్కాయక్లేశవ్రతవిధి, నేయుల్లములైనఁ గరఁగ కెమ్మెయి నుండున్. 11

వ. అని తలపోసి యప్పుడు కదలి మునిసిద్ధసేవితంబైన గంధమాదనంబునకుం జని యందు
జటావల్కలాజినప్రముఖతపోలక్షణ లక్షణీయాకారుండై యాధీరుండు. 12

క. నాలుకలు గ్రోయుచున్నలు, నాలుగుదిక్కుల నమర్చి నడుమ నిలిచి సూ
ర్యాలోకనపరుఁడై మును, గాలొకటి మోపి నిలిచె ఘర్మపువేళన్. 13

సీ. ఏపారుతుఱఁగలి నెఱమంటలు లొండొంట వ్రేసిన నేమియు వెగడుపడక
వడిగాలి సురిఁగిన మిడుఁగుఱు లందందఁ బొదివినఁ దాలిమిఁ బిగులనీక
పొంగారి దట్టంపుఁబొగలు దూదుకొనంగఁ బర్విన నెంతయు భ్రమసిపడక
యతిమతి నల్గడ నశరిపెద్దొఱవులు పైఁబడ్డఁ గడలకుఁ బొసిచనక

గీ. దిట్టతనము పేర్మి దేహాభిమానంబు, విడిచి నిష్ఠ యేడుగడయుఁ గాఁగఁ
బరమతప మొనర్చెఁ బంచతపస్సున, గీర్తిఁడై యొక్కఁడనఁగ దితిసుతుండు 14

శా. విద్యుత్కేతువు లొప్ప శక్రధనురావిష్కారఘోరంబుగా
నుద్యద్గర్జితదుందుభిధ్వనులతో నుగ్రాంబుదవ్యూహముల్
మాద్యద్భాస్వరమండలాక్రమణసామగ్రిన్ దివిం బర్వె నే
కోద్యోగంబున గ్రీష్మశాత్రవునిపై రోత్సాహమున్ దూలఁగన్. 15

క. తొలువానలు గురియఁగఁ ద,జ్జలనివహము దైత్యవిభునిసంతప్తాంగం
బులయందుండి దినార్క.జ్వలనశిఖల డిందు జలధిసలిలము పోలెన్ 16

తే. బట్టబయలఁ బ్రౌఢపద్మాసనస్థుఁడై, యున్న యతనిమీఁద నొక్క పెట్టఁ,
గుననగంబుమీఁద గూర్చువిధంబునఁ, గూర్చె జలధరములు ఘోరవృష్టి. 17

స్రగ్ధర. దీర్ఘోక్షితాంబుధారల్ దెరలఁ బొనుచ నుద్వేగదూరుండు నూర్ధ్వజ్ఞ
న్నిర్ఘోషోత్తుంగగర్జానినదము లదరన్ నిశ్చలాంగుండు ప్రేంఖన్

నిష్ఠాతోత్పాతవిస్ఫురన్నిస్వనము లడఁగన్ నిర్వికారుండు ధైర్యం
బష్ఠాతీతంబుగా నత్యుసుగుణుఁడు నన్నాగనుం బట్టు పుచ్చెన్. 18

క. పదపడి హేమంతమునిసం, పద యొయ్యన శీతగిరి యుపాంతమునలనం
గదలి చనుదెంచునప్పుడ, నొదవిన తనువుయంబ మగుమ నొప్పుగఁ బర్వెన్. 19

ఉ. ఒక్కట మైహికంబు లగు నుత్తరమారుతము ల్పరీరముల్
ప్రక్కలు సేయు నేతెంచు నారికి నోర్వఁగరానిరాత్రులన్
బుక్కిటిఁబంటినీటఁ బరిపూర్ణఘనస్థితి నిల్చి దానవుం
డక్కజ మైననిష్ఠఁ గొనియాడఁగఁ బల్కఁగఁ బొల్చె నెంతయున్. 20

సీ. దనుజఘోరతపోగ్రతనుఁ దాఁకినమాడ్కిఁ గమలిన నెత్తమ్మి కమ్మయాను
వ్రతము వేఁడిమి చెల్లుది యిజూమునిశ్ సోము క్రమమునఁ గమలుఁ దీరమున నొదుఁగ
నసురవెచ్చనియూర్పు లడరఁజూనింతెను నీటి మూరసముందు నీరు గుదియు
జలదేవతలు వైత్యకలితనం బగ్గించు నెలగున సారసోక్తులు చెలంగ

గీ. దివిజవైరితపము నెంచఁగెల్లఁ గంటికి, నిమురలేక చూమునదియుఁబోతె
వికచసుమదనేత్రవిభవ మైనిగలు చె, న్నొందె దానవేంద్రుఁ డున్నసరసి. 21

వ. మఱియు నత్యుగ్రతపోవిశేషాభిలాషంబు దనకుం బరిపోషణం బొనరింప
నిర్దోషహృదయుండై పడంగి. 22

తే. వేళ్లదిండ్లఁ గూరలఁ గొంత నీళ్లఁ గొంత, గాలమునఁ దపోమాత్రఁ గోరి నడపె
గాడ్పు గ్రోలుచు మఱికొంతకాలముండె, వెండి యాచందమునన దా విస్మయముగ.

వ. ఇవ్విధంబున ననేకసంవత్సరంబులు ధీరవ్రతాచారుండై యున్నయాదైతేయుతా
పసుతపంబు పెంపునకుం బంకి పురందరుండు దేవగురునాశ్రమంబునకుం జని నమ
స్కరించి యతనిచే నాశీర్వచనంబుల నభినందితుండై యిట్లనియె. 24

మ. జనకుం డొక్కఁడ వేఱుతల్లులు జగత్సామ్రాజ్యపూజ్యస్థితుల్
దనకుం బాలనుచున్ సమత్సరమతిన్ దైతేయుఁ డత్యుగ్రద
ర్శనదుర్వారతపస్కుఁ డయ్యెఁ గరుణాసంపన్నుఁడా ధాతప
ట్టునఁ బ్రత్యక్షత నొంది యుత్పదవి వేఁడున్ వాఁడు నెబ్భంగులన్. 25

క. అసురతపంబు జగంబుల, కసహ్యమై యునికిఁ జేసి యంబుజభవుఁడున్
వెసఁ దత్పరిశమనమునకై, యసంశయము దివిజరాజ్య మతనికి నొసఁగున్. 26

క. నిను నాశ్రయించియున్న నే, ననఘా కడలేనివనట యనుపననిధిలో
మునుఁగుదు నె ప్రతీకారం, బొనరింపఁగదయ్యా దీని నూహించి కృపన్. 27

చ. అనుటయు దేవమంత్రి దరహాసముతో దివిజేంద్రుఁ జూచి యి
ట్లను నిది యేమి భీతిలఁగ నంచితసత్యతపోనిరూఢి నీ

కనినపదంబు ద్రిప్పుఁగ జగత్పతి పద్మజు కైనఁ బాడియే
విను దితిసూనుఁ డివ్విధము వేఁడెద నన్నను నాలు కాడునే. 28

వ. అదియునుం గాక. 29

సీ. ఏదేవుతుద మొద లెఱుఁగక నేఁడును శ్రుతిమార్గములు బహుగతులఁ దిరుగు
నేదేవు నాత్మలో నీక్షించు ధన్యులు ప్రార్థనీయులు పద్మభవుని కైన
నేదేవులీలకై యొసఁగుజగంబులు సృష్టిరక్షాసమాపేక్షఁ బరఁగు
నేదేవునకు సాటి యేదేవుఁడును గాఁడు నానాగమోక్తనిర్ణయము లొప్ప
గీ. నట్టియాదిదేవు నంబుధిశయను లక్ష్మీకపోలముకురమితముఖాబ్జు
నాశ్రయించినాఁడ నతఁడు నీయెడఁ గృపఁ, గలఁడు నీకు నేల కలుగఁ డనఘ. 30

ఉ. పొందవు దుఃఖముల్ భయము పొందదు పొందదు దైన్య మెమ్మెయిన్
బొందవు తీవ్రదుర్దశలు పొందుఁ బ్రియంబులు పొందు సంపదల్
పొందు సమగ్రసౌఖ్యములు పొందుఁ సమున్నతకీర్తు లెందు గో
విందపదారవిందపదవీపరిణదగరిష్ఠచిత్తులన్. 31

క. తను నెబ్బంగిఁ దలంతురు, జను లాభంగిన తలంచు సరసీరుహలో
చనుఁడును వారలఁ గావున, ననిశంబు కృతార్థమతులు హరిపదభక్తుల్. 32

క. హరిభక్తులతపము తపము, హరిభక్తులజపము జపము హరిభక్తులభా
సురజన్మము భవసారము, హరిభక్తులు భువనపావనైకవిహారుల్. 33

క హరి యనురెండక్కరములు, దొరకొనఁ దీపొసఁగు జిహ్వాతుది నెవ్వని క
న్నరుఁ డొకఁడ ప్రభుఁడు భవసాగరనిస్తరణప్రకారకౌశలమునకున్. 34

సీ. దారుణదురితాంధకారసూర్యోదయం బధికపాతకవిపినానలంబు
నిబిడకల్మషమేఘనిర్భరపవనంబు బాఢపాపాంబుధిబాడబంబు
క్రూరకిల్బిషశైలకులిశనిపాతంబు ఘనకలుషోరగగరుడమూర్తి
ఘోరదుష్కృతకాలకూటగంగామాళి యతులాఘహరిణపంచాననంబు
గీ. సకలకల్యాణమూలంబు సకలవేద,శాస్త్రసారంబు సకలార్థసంచయంబు
సకలమంత్రరహస్యంబు సాధుహృదయ,నర్తనము విష్ణునామసంకీర్తనంబు. 35

శా. వేదాంభోధి మథించి వెండియు మహావిస్తీర్ణశాస్త్రార్థసం
వాదంబు ల్దలపోసి చూచి బలువై వర్తిల్లులోకోక్తియున్
గాదా యంచు గణించి యొక్కతలఁపై కాదే మునిశ్రేణి సం
పాదించెన్ హరిసేవనంబుఁ దగ సంభావ్యంబు సేవ్యంబుగన్. 36

ఉ. శ్రీస్తనకుంకుమద్రవనిషిక్తభుజాంతరభాగవిస్ఫుర
త్కౌస్తుభరత్నసూత్సరుచిగర్వితనాభిసరోజసౌరభ

ప్రస్తుతమత్తభృంగరవరాగరసోల్బణభోగిభోగత
ల్పాస్తరణుం దలంచుసుకృతాత్ములపాస్తసమస్తకల్మషుల్. 37

వ. అని పలికి యాఖరదూషణశోషణపరాయణపదద్వయనిరాకరణకారణంబుగా నఖిల
దురితోత్తారణం బైననారాయణమంత్రంబు సవిశేషసంస్కారంబుగా నుపదేశించి
యిది పరమగోప్యం బైనజప్యంబు నీవు నియతమానసుండవై దీనిన సేవింపుము దుస్సి
తులెయ్యవియు నిన్నుం బొరయ లేకున్నట్లు నిమ్మహావాక్యప్రభావంబు భావింప నెవ్వ
రికి నశక్యంబు. 38

తే. అంబుజాసనుఁ డాదిగా నాద్యులెల్ల, నిమ్మహామంత్రపరమార్థ మెల్లనాఁడు
నాత్మఁ గన్గొని ముదమంది యాచరించి, యభినుతించి భజింతు రత్యంతనియతి. 39

వ. హిరణ్యకశిపుతపోవిజృంభణంబునకు భయం బందవలదు. దైత్యులయైశ్వర్యం బయ్యు
నుదుదినుట్ట నేరదు. నీరజోదరుతోడిమాత్సర్యంబు కార్యంబుగాఁ దలఁచువారికి
నేరూపంబున నిత్యోన్నతులు గలుగ నేర్చునె? విష్ణుద్వేషంబును నిరంతరరోషంబు
ను శ్రుతిధర్మవిరోధంబును సుజననిరోధంబును నసురస్వభావంబులు గావున. 40

క. నారాయణవిద్వేషులకుఁ, గ్రూరుల కాయువును శ్రీయుఁ గులము బలంబున్
దేరును బెంపును బొలియును, ఘోరనరకకూపములను గూలుదురు తుదిన్. 41

తే. విష్ణుఁ డిహపరదైవంబు విష్ణుదేవు, నొల్లమియ యిహపరముల నొల్లకునికి
విష్ణుపదభక్తిభావపవిత్రుఁ డగుట, యైహికాముష్మికప్రీతి నందఁ గనుట. 42

మ. అనువాచస్పతిభాషణంబునకు నాహ్లాదంబు సంధిల్ల న
య్యనఘుం డచ్యుతపాదసంస్మృతిరసైకాయత్తచేతస్కుఁడై
మునివంశోత్తమునంఘ్రిపద్మము శిరంబుం జేర్చి వీడ్కోలతం
డొనరింపన్ జనియెన్ పురంబునకు నిత్యోద్భాసితైశ్వర్యుఁడై. 43

వ. చని వెండియు వివిధవితర్కజనితపరిస్పందం బగుడెందంబు డిందుపఱుప నేరక సుర
విభుం డసురతపంబునకు నపాయం బాపాదించునుపాయంబు ప్రయోగంబు చేయుట
మేలు కాక యని తలంపుపుట్టిన నప్పుడ రంభాప్రభృతు లగునప్సరోవనితలం బిలి
చి గౌరవంబుగా నేకాంతంబ యక్కాంతల కిట్లనియె. 44

శా. లావణ్యోదయముల్ ప్రియంబు లుచితాలాపమ్ము లాటోపముల్
భావంబుల్ చతురస్వభావములు చెప్పం బెద్ద మీయందు మీ
కీవిశ్వంబున గెల్వఁ గూడనివిభుం డేవాఁడు లేఁ డిప్పుడున్
దేవేంద్రస్థితి మీరు కల్గుటఁ గదా దీపించె రూపింపఁగన్. 45

ఉ. మీరచినకోర్మి నేయెడల మిన్నులుముట్టి వెలుంగునట్టి నూ

అంచులకై దివుల్ తృణకణాకృతిరై వెడబాయఁ బేర్చి ద
ర్పించిన ధీరచిత్తములఁ జెల్కుఱనాటికలంక నావమీ
యంచితచారుచంచలకటాక్షము నమ్మినయస్త్ర మిమ్మెయిన్. 46

సీ. ఉల్లంబు మీమూఁడు నుచ్చిపోకకుఁ గదా వాలమ్ములను నోర్చు వారికోర్కి
మీక్రొవ్వుఁజన్నులమూఁదియునిక్క యగదా వ్రతముల నరిగెడువారియాస
లీలమీకెమ్మోవి గ్రోలుట కైకదా విడిసోమరసమాను వారితృష్ణ
మీయింపుఁగూటమి మెఱయుటకై కదా వనితలఁ బొరఁగెడు వారితివుట

గీ. పుణ్యసస్యంపుఁబంటలు భూరినియమ,తరుఫలంబులు సౌఖ్యాధిదైవతములు
నిఖిలసంసారసారంబు లఖిలలోక,రత్నములు మీర యప్సరోరమణులార! 47

ఉ. మానము ప్రోదిసై నియతిమాత్రము గాఁ బొడసై ధరిత్రినె
వ్వానికి న్రాలకున్న గరువంపుశరంబును వంచఁ జూచుచు
స్థానమహత్త్వధన్యుఁ డగుమానిసి యైనను రోషవిభ్రమ
భ్రూనటనాభిరామ లగుమీల్లుల పాదతలంబు చేరువన్. 48

చ. వ్రతములఁ గొల్చి శీలముల వ్రచ్చి జపంబులఁ గ్రోలి యుత్తమ
క్రతువులఁ దోలి యోగములు గ్రాఁచి తపంబుల వేచి యందున
ప్రతిహతలీలమై మదనుబాణచయంబులతో దుసీడలై
ధృతులు తలంచుచుండు సుదతీసుదతీక్ష్ణకటాక్షకోణముల్. 49

సీ. చామలనగుమోముఁ జందురుపొడపున రాగాంబుధులు నిట్టగ్రమ్ము ననుట
పాలఁతులనునుదీపుపలుకులయింపున నుల్లంబు నోఁటంబు నొందు ననుట
మెలఁతల తఱచు రెప్పలనలిగప్పులు జవనంపుఁజీఁకటి గవియు ననుట
చెలువలనిద్దంపుఁ జెక్కులచాయల భావము ల్వెలవెలఁ బాఱు ననుట

గీ. యద్భుతంబు లై విపులభవాబ్ధిఁ దిరుగు, జనులహృదయంబు లనియెడు జలచరములు
లీలఁ దిగువంగ వలరాజుకేల నున్న, బలువలలు గావె కాంతలచెలువు లెల్ల. 50

క. కావున మీ తెఱఁగంతయు, భావించి జగద్ధితము గుపని యొక్కటి సం
భావనముతో మిముఁ బనిచెద, నేవిధమున నైన నిర్వహింపఁగవలయున్. 51

క. దితిజుఁడు హిరణ్యకశిపుఁడు, వ్రతచర్యానిష్ఠ నున్నవాఁ డాతని ధీ
రత గంభీరతయును వికలత నొందింపుఁడు భవద్విలాసప్రౌఢిన్. 52

ఉ. మీ రిటువూని యీక్రమము మేకొని చేసిన దివ్యరాజ్యల
క్ష్మీరమణీయమై భవము చిందిలిపుందిలిగాక దన్కుఁ బెం
పారఁగ నాకు నాకులజరామరణాగరిమం బొకింతయున్
బేరు నొదంగనీ కడరుఁ బ్రీతి భుజింతు నభీష్టభోగముల్. 53

చ. చనుఁ డనురేంద్రుఁ డున్న వికచద్రుమపుష్పసుగంధిగంధమా
దనవనభూమికిన్ భవదుదంచితయోగ్యసహాయలీలకై
పనిచెద నీక్షణంబ మధుపవ్రజకోకిలకీరమీనకే
తనమధుమానసాస్పదసుధాకరదక్షిణమారుతంబులన్. 54

వ. అనిన నయ్యింతు లందఱు నట్ల కాక యని యియ్యకొని రప్పుడు తిలోత్తమ యయ్యమరోత్తమున కిట్లనియె. 55

సీ. ఏను గ్రీఁగంట నొక్కించుక చూచిన ఖలుఁ డెండ కైన నగుఁ గరఁగు ననిన
నాయింపుఁబలుకు కర్ణములు సోఁకినఁ బితామహుఁ డైన జపములు మఱచు ననిన
నేను దియ్యమున నటించిన హరుఁ డైన మునికన్నులసన్న దగులు ననిన
నాపాపు చూచిన శౌరియు నహితెల్ప మఱఁగి పల్లవశయ్యఁ బొరలు ననిన

గీ. నరతి రైనను దాల్మి యను కైన నుల్లంబు, చుఱుక నైనఁ దపము లులుక నైన
నేమములతపంబు నిల్చునె నాయెదు, రేదుర నధిప మాట లేల యింక. 56

క. చూచెదవు గాక యే నిటు, చూచిన నయ్యసురతపము సొంపఱి వ్రతని
ష్ఠాచరణము తూపరమగు, గోచరమై మనసు త్రిప్పుకొని సోలంగన్. 57

వ. అని పంతంబులు పలికిన యప్పుష్పమాటకు మునున్న యకుంఠమనంబునం బ్రమదంబునొంది నయ్యింతుపదన లందఱు పురందరు వీడ్కొని చని గంధమాదనంబుఁ జొచ్చి రంత. 58

క. వారలతోడ నెయ్యాత్మ, సారథి భవ మెల్లఁ గొని వసంతుఁడు దనయా
కారంబుఁ జూపె నక్కాంతారంబున శిశిరసమయుదర్పాపహుఁడై 59

చ. ఇదె చనుదెంచెఁ జైత్రుఁ డని యెల్లవనంబులకుం బ్రమోదముల్
పొదలఁగ మేనివార్త గొని పొరున వచ్చిన దాడికాఁడన
న్మృగువనదేవతాముఖసమీర మెదుర్కొన నుల్లసిల్లె నిం
పొదవఁగ దక్షిణానిల మనూనమనోహరఖేలనంబునన్. 60

ఉ. పండినమ్రాఁకు డుల్లి నవపల్లవముల్ తిలకింపఁ బూఁబొదల్
నిండఁగఁబర్వె తేఁగొనలు నిద్దములై నిగుడంగ మ్రాకు లొం
డొండఁ దలిర్చె నామని సముజ్జ్వలయోగరసాదనక్రియన్
గొండికపాయముల్ మగుడఁ గోరి భజించినసిద్ధులో యనన్. 61

ఉ. ఎందును బుష్పసౌరభ మెయెందును మందమదాలిఝంకృతుల్
ఎందును సాంద్రపల్లవము లెందును గోకిలకంఠకూజితం
బెందును విస్ఫురత్ఫలము లెందును గోమలకీరభాషితం
బందము లయ్యె మందమరుదంచితచారువనాంతరంబులన్. 62

తే. సరస కింశుకకోరకసంచయంబు, చెలువు తిలకించె భావినృసింహదేవు.

దీప్తినఖపంక్తి ప్రకటదై తేయరుధిర,సేకరుచి నొప్పుతెఱఁగు సూచించినట్లు. 63

ఉ. కాముఁడు లోక మంతయును గైకొని పట్టము గట్టికొన్నఁ జే
రామని చేయుపండువులయం దొడఁగూడినదివ్యగంధముల్
నామెఱుఁగారుక్రొవ్విరు లెలర్చినసంపెఁగ లొప్పెఁ గామసం
భ్రామితకామిచిత్తశలభంబులు గ్రందుగఁ జెందు మ్రందఁగన్. 64

చ. అవిరళచారుకోరకచయంబులలోకములంధచూడ్కులం
దవులఁగఁ జేసె నెల్లెడలఁ దద్వనభూములగాఢరాగముల్
యువతులచిత్తవృత్తముల నూన్న ననంగుఁడు సంగ్రహించె నాఁ
బ్రవితతలీలఁ బెల్లెసఁగెఁ బల్లవసంతతి గుత్తులోయనన్. 65

చ. తనియక కమ్మలిచ్చి చవి దాఁకినచొక్కునఁ గన్నె వ్రాలఁ జం
చునఁ జవికాటుగాఁ గఱచుచు న్నవచూతజపల్లవంబు గై
కొని విహరించుకోకిలము కొమ్మల తియ్యని మోవి మోవిమో
హనరుచిఁ బాసి పందువథికావలికిం కటఁజేసె నామనిన్. 66

సీ. అంచబోదలమీద మారంగఁ జెక్కిళ్లు గొట్టుచు నెలదోడుకొనలు నలువ
నలిబాలికల ముదం బెలరారఁ పింపిళ్లు గూయుచు మధువులు గ్రోలి సోల
జక్కవడో లక్కజపువేడుకల దిమ్మదివురన కరువలి దిగిచికొనఁగ
మలయానిలుఁడు గర్వ మలరంగ గుఱువులు వాఱుచు నెత్తావిచూఱలాడఁ

గీ. బసిఁడిగద్దియగా గ్రుద్దపైకరంబు, ప్రీతి నెంకొన సిరి పేరుఁ బెంపుఁబడయఁ
గామినులచూడ్కి రేవులకాంతి వడసి, దర్పమునఁ గ్రాల నొప్పారెఁ దమ్మివిరులు. 67

చ. వలివిరవాదిక్రొవ్విరులవాతుల మూఁతులు వెట్టి తేనియల్
కొలఁదికి మీరఁ గ్రోలికొని కొవ్వున జివ్వల నీన నొక్కమై
దలముగ దీటు గట్టుకొని దాఁటెడు తేఁటులచైద మెల్లెడన్
గలయఁగ వృక్షవాటికలఁ గ్రమ్మె నకాలతమోనికాయముల్. 68

తే. పొగడమ్రాకుల మొదలను బుప్పరసము, దొరఁగి నెత్తావియందును నెరయ నొప్పెఁ
బూచుకొఱకు నైయున్న యింపులు దలిర్పఁ, గడఁగివనలక్ష్మియమిసినకళ్లయనఁగ.

క. పూచినయశోకములయం, దేచినతమ్మెదలరవము లింపెసఁగెఁ బొరిం
దాఁచువనదేవతలచర,ణాచలితము లైనయందియలమ్రోఁత యనన్. 70

చ. విలసితచంద్రకాంతమణివేదులపై మృదుమారుతాహతిన్
దలముగఁ వ్రాలి తా నవిగఁ దాఱనిపువ్వులయుత్కళయ్యలై
పొలుపుగ మాధవీవలయముల్ తరుణీతరుణవ్రజంబులన్
బిలిచె మనోజలీలలకుఁ జేర్చు మదాకులభృంగగీతులన్. 71

చ. చిలుకలపిండు నొప్పిదము చిత్రసురాయుధలీల యేపునం
జెలఁగుమధువ్రతాళిపలుచిక్కని మ్రోఁతను గర్జ లుల్లస
త్ఫలరసపూరముం దొరలఁ బర్వుట సోనలు గాక మేఘపం
క్తులక్రియ నొప్పుభూరుహతతుల్ మధువేళఁ బయోదవేళలన్. 72

చ. మనసిజమంత్రఘోషములు మన్మథునానతిమాట లిందిరా
తనయవిలాసహాసములు దర్పకునార్పు లెలుంగు లంగజ
న్మునిచదువుల్ మనోభవునిమోహనగీతు లనంగఁ జారుషే
లనములు నెల్లదిక్కులఁ జెలంగె మదోత్కటకోకిలస్వనుల్. 73

చ అరుదుగఁ జేఁటితీఁగె గొనయం బెసకం బగుపచ్చవింట ని
బ్బరముగ మోపి కెందలిరుబత్తిడికం బరువంపుమావిక్రొ
వ్విరిబలు గాఁడితూఁపు లిడి వీరపుగర్వము నెమ్మనంబులోఁ
బిరిగొని తోలి తొప్పరలఁ బెట్టె వసంతుఁడు పాంథలోకమున్. 74

సీ వెలయు నీవెన్నెలవెల్లికాంతులసిరి పిఱుఁదుదీవులు చేరి మెఱయు చున్న
వెలయు నీవెన్నెలతెలుపునఁ జామలచూపు చీఁకటిఁ జొచ్చి సొరగ చున్న
వెలయు నీవెన్నెలతనువున నింతుల ఘనకుచంబులయుష్మ గదియ చున్న
నొదవు నీవెన్నెలయునపడిఁ బొలఁతుల తమకంపుఁజెమ్మ్వలఁ దగల చున్న
గీ. మునిఁగి పోరె మన్మథునకగ్గమై పోరె, చాలఁ గొంకువోరె తూలిపోరె
యనఁగ నుల్లసిల్లె నామనిరేలతి, స్ఫారసారసారసాంద్రరుచులు. 75

వ. ఇట్టివసంతసమయంబునందుఁ బురందరాదేశంబు నెఱపం బూని చనుదెంచినవనజలో
చన లద్దనుజతాపసునివాసంబును మునిసిద్ధగంధర్వసేవితం బైనయాపనంబున 76

సీ కమనీయకరపద్మకాంతిపల్లవములు కోమలస్మితదీప్తికుసుమములును
జారుపయోధరస్ఫారగుచ్ఛములును లలితబింబాధరోజ్జ్వలఫలములు
సురభినిశ్వాసభాసురగంధపవనులు నుచితసల్లాపకీరోత్తములును
గలమధురోద్గీతకలకంఠరవములు కాంచీనినాదభృంగస్వనములు
గీ. నతిశయిల్లంగ మధుసమయాధిదేవ, తను శుభాకారలీలలు దాల్చి దనఁగ
నెమ్మి పుష్పాపచయకేలినెపముఁ బెట్టి, యందుఁ జరియించి రింపార నిందుముఖులు.

క. క్రమమున నాటలపైఁబడి, నమరాంగన లసురవైరి కంతను వింతన్
సమదగతిఁ జేరి తమయిం, పమరెడుచెలువున నటించి రభినవభంగిన్. 73

చ. కదలుకుచద్వయంబు వడఁక న్దనుమధ్యము కత్తుదీధితుల్
చెదరఁగ మోములేఁజెమట చెన్నొదవన్ బొలపంబు గన్గవం

బోదలఁగఁ గంకణస్వనము పొల్పెసలార సుమాస్త్రదర్పముల్
ముదరఁగ నుల్లసిల్లె నొకముద్దియ కందుకఖేలనంబునన్. 79

ఆ. పిఱుఁది పెంపు వ్రేఁగుపఱుప నందంప, బయ్యెద దొలంగఁ జన్నులదర నంది
యలు సెలంగ నలసయాన మెలర్ప రా, యంచఁ బట్టఁ దిరిగె నబల యొర్తు. 80

సీ. మునికాళ్లు మోపి నిక్కినఁ బదచ్ఛవి నేలయును బల్లవించిన యొప్పుమెఱయ
వలశేది నతనాభి బెలసి యొక్కింత సాగినమధ్య మెంతయు ఘనత దీయ
మొగ మెత్తి మీఁదికి నిగిడించుచూడ్కులఁ గన్నులవిప్పెల్లఁ గానఁబడఁగఁ
గడలొత్తుకరమూలఘనకాంతి చూపఱ డెందంబుతో నిక్కి డెక్కొనంగ
గీ. నొయ్య డాకేల దవ్వుల నున్నతిఁగఁ, దిగిచి నఖదీప్తు లంతంత దీటుకొనఁగ
లీలఁ బెఱకేల నచ్చరలేమ యొర్తు, గోసెఁ బువ్వులు ప్రమదవికాస మెసఁగ. 81

తే. ఓర్తు కరతాళ మొనరింప నొర్తు సముద, గీతి పచరింప సరిత్తాళగింప నొర్తు
మధుపమదిరాదసోల్లసమత్త యగుచు, నాడె నొక్కతె లలితాంగి హారగతుల. 82

సీ. అమృతంపుసోన పైనడరినట్లై పాట చెన్నున మోరళ్ళఁ జివురు లొత్తె
మారుతాహతిపేర మ్రాకులు దలయూఁపఁ దొడఁగె మరందమాధుర్యమునకు
నింపులగమియైన యీరాగరసము దీఁగలకుఁ గోరకపులకముల నొసఁగె
సెలయేరులకు నశ్రుజలములు దొరఁగించె గిరులను మంజులగీతిఁ గరఁగె
గీ. ననినఁ బోలుఁ బొసగు నగుఁ దగు ననఁగ స, చేతనంబు లెల్లఁ జిత్రరూపు
నట్లు సోగి నిలువ నంగన యొక్కతె, పాడఁగఁ మనోజ్ఞభంగు లలర. 83

క. జంకెలు బుజ్జనములునుం, గింకలు దళుకొత్త నొర్తు గీరంబులకున్
వంకలు జదుల్లు కరములు, గంకణముల జదువు గరపె హసితోక్తులచేన్. 84

సీ. కెమ్మోవితావికే గ్రమ్ముతుమ్మెదగమి తూలెడుకురులలోఁ దొడిబడంగఁ
జలితకర్ణోత్పలదళములకాంతి న, పాంగదీప్తులు రెంటఁ బరపుగాఁగ
సీమంతమునఁ బొల్చు సేసముత్తియములఁ బెరయుగ్రమ్మడికమ్మవిరులు దొరుఁగ
నాందోళనశ్రాంతి నమరుపాలిండ్లపైఁ జెమటబొట్టులు హారసమితిఁ బ్రోవ
గీ. నళులలావున నలికాను బలిసి నిలువఁ, జూచువారిచూడ్కికి నొప్పుచూఱలిడుచు
లీలఁ బాడుచుఁ దీఁగయుయ్యాలనెక్కి, పోయియూపఁగ నొప్పారెఁ బొలఁతియొర్తు.

చ. వలపుల డాపులన్ వరుస వాలు గనుంగొనఁ జూపు లార్చుచున్
దిలకము దీర్చుచున్ గురులుదీటుచు వీనులమానికంపుటా
కులపొరి ద్రిప్పుచున్ దశనకోరకము ల్వెలయంగ మోవి మె
ప్పలరఁగ మోము లిచ్చుచును నద్దముఁ జూచె నొకర్తు వేడుకన్. 86

వ. ఇవ్విధంబున మదనవికారకారణంబు లగువిభ్రమవ్యాపారంబులఁ బ్రవర్తిల్లినయ్యం
గనలతెఱంగునకుఁ గరంగనియంతరంగంబు నిస్తరంగంబుగాశియుంబోలెఁ బొలుపు
మిగుల నాదైత్యతపోధనుండు. 87

మ. పురుషాకారముతోడ నున్నసిరియో పుంస్త్వంబు లేదో యచే
తరువో పుత్తడిరూపొ చిత్తమును జైతన్యంబు శూన్యంబొకో
విరసత్వంబులప్రోవొ నిర్భరకళావిజ్ఞానసర్వస్వమో
యరు దీచంద మనంగ నిల్చె ధృతియం దస్పందమందస్థితిన్. 88

వ. అంత 89

సీ. కలయంగ నడవిలోఁ గాచినవెన్నెల లై చారుహాసంబు లనధిఁ బోవఁ
బ్రతికూలవిధికిఁ జేపడినయత్నంబు లై చూచినంతటఁ బోక చూపు లొరుఁగఁ
బాట లన్నియు నాటపాటలై చెవిటికూదినసంపవిధమునఁ దేరఁజనఁగ
నాటలు పసిబిడ్డయాట లై పెంపటి మొరులయాటలఁ బడ నోగితముగ
గీ. గర్వములు బెండువడఁ గౌతుకములు ముడుఁగఁ, నదటులాఱడివోవఁ బ్రల్లదములడఁగ
నసురచిత్తంబు గానఁగ నలవి గాక, సిగ్గువోయిరి యచ్చరచెలువ లెల్ల. 90

ఉ. ఆతనినిష్ఠయున్ ఘననిరాకులధైర్యము దన్ను నెంతయుం
బ్రీతుని గా నొనర్పఁ గృపపెంపు దలిర్ప సరోజసంభవుం
డాతతసిద్ధసంయమిగణావృతుఁ డై మహనీయహంసవి
ఖ్యాతమనోజ్ఞయానమున నచ్చటికిం జనుదెంచె నత్తఱిన్. 91

ఉ. చాలుఁ దపంబు చాలఁగఁ బ్రసన్నుఁడ నైతి వరంబు లిత్తు నీ
లోలత యేర్పడంగ నతిలోకనుతవ్రతి వేఁడు మన్న నా
చాలవరేణ్యుఁ డంబురుహసంభవుమాటలు వీనులందు ధా
రాళసుధారసప్లవనరమ్యము లై ప్రమదం బొనర్పఁగన్. 92

తే. చక్క జాగిలి మ్రొక్కి యంజలిపుటంబు, మౌళిఁ గదియించి నిలిచి సముచితార్థ
మధురబహువిధస్తోత్రసమ్మర్ధరచన, మున్నుగా నతఁ డిట్లని విన్నవించె. 93

క. దేవర ప్రసన్నుఁ డగునటె?, సేవకులకుఁ బడయరానిసిద్ధియుఁ గలదే?
భావితవివిధైశ్వర్యక, భావహము గదా భవత్కటాక్షం బెందున్. 94

వ. కావున నసురేంద్రత్వంబు నాకు గృపసేయవలయు నిదియ మదీయాభిలాషంబనినఁ
బితామహుం డసురేంద్రున కిట్లనియె. 95

చ. సమధికపూర్వదేవకులసంజనితుండవు నీవు నీకు న
య్యమరపదంబు దక్కనసురాధిపతిత్వము నీక యంత యు

య్యామరవరేణ్యసంకదకు నగ్గల మై పెనుపొందు వైభవం
బమరుట యేమిటం గలుగు నట్టివరంబుఁ దలంపు మింపుగన్. 96

క. అనినఁ దగువరముఁ దన నె, మ్మనమున నూహించి యసుర మతి యిట్లనియెన్
వనజభవుఁ డింక వీఁ డే, మని వేఁడునో యనుచు నాకులాత్మత నొందన్. 97

సీ. దేవకులంబుచే దేవయోనులచేతఁ బితృకోటిచే దైత్యవితతిచేత
గ్రహములచేఁ దారకములచే మనులచే ననలసమీరతోయములచేత
నరులచే గిరులచేఁ దరులచేఁ బశుమృగపక్షిదంశకకీటపంక్తిచేత
నసికుంతశరపరిఘాద్యాయుధములచేఁ గాష్ఠపాషాణసంఘములచేత
గీ. నవని నంతరిక్షంబున దివమునందు, వాసరంబులయందు శర్వరులయందు
నా కపాయంబు లేకుండ లోకవంద్య, యిమ్ము మతి యెవ్వియును నొల్లనింతనిజము.

గీ. అనిన నిచ్చితి ననియెఁ బద్మాసనుండు, దైత్యపతియు మహాప్రసాదంబు దేవ
యనుచు నొందల మోడ్చుకేలమర నొప్పి, హర్షపులకాంకురాలంకృతాంగుఁ డగుచు.

వ. వనరుహసంభవుండు దితిసంభవుని ప్రభూతవరదానసంభావితుం జేసి నిజనివాసంబు
నకుం జనియె. నసురేశ్వరుండును నమందానందమందస్మితసుందరుండగుచు నాత్మగృ
హంబునకుం జనిజననికి నమస్కరించి తద్వృత్తాంతంబంతయు నెఱింగించి తదభినంది
తుం డై ప్రియానుజుం డైన హిరణ్యాక్షు నను మోదింపఁ బెంపారుచున్న సమయం
బున నప్పుహావీరులతపోలాభంబునకునభినవోల్లాసంబునం బొంగునంతరంగంబులతోడ
నముచిపులోమబలరామశంఖకర్ణవిప్రజిత్తుహయగ్రీవప్రముఖు లైన దానవులనేకులు
చనుదెంచి యతనిం గని సముచితసల్లాపసంస్కారంబులు నడపి యతనికిట్లనిరి. 100

మ. దితిసంతానము దానవాన్వయము నీ తేజంబు నితోర్జిత
స్థితి నేపారుటఁ జేసి నేఁడు దల యెత్తెన్ బేర్చి యీదైత్యసం
తతి యంతంతకు నీసుమ్మీఁ బరప దోర్దర్పంబు సొంపొందఁగా
ధృతిదూలంబడుపాట దప్పి విసరెన్ దేవాహితశ్రేణికిన్. 101

ఉ. జన్నములుం బరాన్నములుఁ జాలఁగ మ్రింగి కరంబుఁ గ్రొవ్వి పే
రన్నునఁ గ్రాలునచ్చరలయాటలు చిత్తములన్ గరంపఁగాఁ
గిన్నరవల్లకీమధురగీతులు వీనుల కింపుఁ బెంపఁగాఁ
జెన్నుగ నుండి మమ్ము నొకచీరికిఁ గైకొన రాదివౌకసుల్. 102

చ. హరి తనకు న్గలం డని పురాంతకుఁ డాముర వైరిసేత తె
వ్వరుసన మాన్ప నొల్లఁ డని పద్మభవుండును నాత్మలోన ని

ర్జరులకు మేలు గోరునని సంయమికోటితలంపుల న్నిజ
స్ఫురణము యూపహించు నని పొంగుచు నుండు మహేంద్రుఁ డెప్పుడున్. 103

ఉ. అట్టిసురాధినాథునదవంతయుఁ బాపి నిలింపసర్గముల్
దట్టము లొగ్గి తాపసులదైన్యము పాల్పడఁ జేసి లోకముల్
గట్టిగ నీవ యేలుము ప్రకాశితదైత్యకులాభివృద్ధికై
పట్టము గట్టి మమ్ముఁ దగఁ బంచి పను ల్గొను మీశ్వరుండ వై. 104

వ. అని పల్కి యసుర తక్షణంబ భృగువంశభవ్యుం డగు కావ్యున చ్చటికిరావించి తదుప
దిష్టప్రకారంబునం దొడంగి మయనిర్మితమాణిక్యమయమహితసింహపీఠంబున నమ్మ
హానుభావు నునిచి భార్గవపురస్సరంబుగా నఖిలతీర్థోదకంబుల నభిషేకంబు గావిం
చిదైత్యదానవరాక్షసాన్వయంబునకుం బలివి గమ్మని పట్టంబు గట్టి వివిధాశీర్వాదం
బుల నతనిం బ్రస్తుతించిన నసురులయార్పులు నిస్సహాణపణవకాంస్యకాహళాదితూ
ర్యంబులరొదలుఁ దిక్కులు పగిలించె నంతం బోవక దిక్పతులడెందంబుల గారించె
నంత 105

ఉ. దానవనాథునొందల సుదగ్రత నొప్పునవాతపత్ర మా
మ్లానసుధాంశుబింబగరిమంబునఁ బెంపెసలారి యింద్రలో
కీనయనోత్పలావళులు ఖేదము నొందఁగఁ జేసె ఘోరఘు
ర్మానుగతప్రచండకిరణాకులభాస్కరమండలాకృతిన్. 106

సీ. అసురవల్లభుప్రతాపాగ్ని పర్వెడులీల దిశల నుల్కాపాతదీప్తి పొదివె
దైతేయనాథునుద్ధతికి నుల్కినభంగి ధాత్రి సముత్కంపతరళ యయ్యె
దనుజతేజముఁ గని దైన్య మొందినమాడ్కి మార్తాండుఁ డెంతయు మాఁగువాఱె
విబుధారికినుకకు వెగడొందుతెఱఁగున వనరాశి కరము ఘూర్ణనము నొందె

ఆ. గిరులు వడఁకె నధికపరుషంబులై వప, నములు చెలఁగె నిబిడతిమిర మడరె
వహ్ను లగ్రధూమవారితజ్వాలంబు, లగుచుఁ బొనుఁగుపడియె నద్భుతముగ. 107

క. అవి యెల్లఁ జూచి దైత్యులు, దివిజకులాపాయభంగి దెలిపెడునవె యీ
వివిధోత్పాతము లని ప్రముదవికాసితు లైరి దుష్టతామసబుద్ధిన్. 108

వ. ఇట్లభిషిక్తుం డై యపూర్వగీర్వాణపుంగవుండు గర్వగరిమాక్రాంతస్వాంతుండును
నగుచు మయదత్తంబును మణిమయూఖమంజీరమంజులంబును మనోరథానురూపగ
మనంబును నగుమహారథం బెక్కి హిరణ్యాక్షప్రముఖు లగునాప్తజనంబులు పరివే
ష్టింపన నేకదానవసేనాసమేతుండై చని మహాశైలదుర్గగోచరయుఁ బ్రాంశుప్రాకారప
రివృతయు నుత్తాలవిశాలాట్టాలకవిలసితయు నుదగ్రగోపురాగ్రగృహీతగ్రహమార్గ
యు సమధికోత్సేధసౌధదీధితిధవళాయమానదశదిశాభాగయు సకలసమయసముదితసు

మనోవికాసభాసమానోద్యానద్యోతితరోధోంతరయు సపుత్రభోగభూమియు రత్నవతీనామధేయము నగు మహాపురి భార్గవోపదిష్టశుభముహూర్తంబునం బ్రవేశించి.

క. అం దుండి సకలసంపద, లుం దనుఁ జేరంగ నఖిలలోకంబులు న
స్పందితనిజాజ్ఞ నొందల, లం దాల్పఁగఁ దాల్చె రాజ్యలీలోత్సవముల్. 110

క. దైతేయులు దానవులును, భూతనిశాచరపిశాచములు తద్దయు సం
ప్రీతిం బొదలఁగ నాతని, యాతతసామ్రాజ్య మంతకంతకుఁ బెర్చెన్. 111

ఆ. ఆహిరణ్యకశిపునైశ్వర్య మెంతేప, ర్ధిల్లఁ దొడఁగె నంత దివిజకులము
పేర్మి పరఁగఁ జొచ్చెఁ బేర్చు వేసవియెండ, నెరిలి యువురుచిఱుఁతకుడువుపోలె.

క. వైరము గొని దైత్యుఁడు దు, ర్వారభుజారంభరోషరభసాకులుఁ డై
కారింపఁ దొడఁగె నమరులఁ, బోరులు తనకు న్వినోదములుగాఁ గడిమిన్. 113

స్రగ్ధర. వేదండోద్దండహేలావితతరథపదావిష్కృతాస్వీయభాస్వ
త్పాదాతానేకసేనాప్రకరపరికరప్రాభవాభీలలీలా
వైదగ్ధిం బేర్చి దైత్యేశ్వరుఁడు రణధురావాంఛ పైకొన్నమారై
ఛేదింపం ద్రుంప నొంపన్ బెఱుసనక విజృంభింప నోర్వ న్నిలింపుల్. 114

వ. అమ్మహావీరుండు. 115

సీ. పేర్చుచుఁ బఱతెంచుభిదురంబు నని మొనఁ బెడచేతఁ బెడమోము వడఁగ నడచి
భీతిఁ బాఱెడిపుగహూతు వెన్కొని పొడు దఃవట్టి దర్పంబు దలకు మీర
నమరావతీపురం బంతయుఁ జూఱాడి చెలఁగి సురస్త్రీల చెరలుబట్టి
వెల్లయేనుంగును వెలిమావుఁ గైకొని సుందరమును హరిచందనంబు

గీ. పారిజాతసంతానకల్పకతరువులఁ, గొని సుమేరునిచిత్రరత్నకోటికొండ
లర్థిఁ ద్రవ్వి తెంపెను గొని యమమఃవిభుని, కరుణ ముందల విడిచివిక్రమము మెఱసి.

వ. మఱియును. 117

ఆ. శిఖులు చూపకుండ శిక్షించి హుతికి నై, నోరు దెఱవనంపి మేరవెట్టి
వేఁడియొల్ల నుడిపి విబుధారి కినుకమై, భీతిపాత్రుఁ జేసె వీతిహోత్రు. 118

సీ. మెచ్చక యొగుచైనమృత్యువుమెడఁ ద్రొక్కి క్రొవ్వాఁడికోఱలు ద్రెవ్వ రాచి
కినుకతో జంకించి కింకరకోటులఁ బొంకంబు చెడఁ గొంకువోవ నడిచి
మదువివుఁ గొని మాఱుమలయుకాలునుబోతు నొడిసికొమ్ములుపట్టిముడుఁగఁ ద్రోచి
మండెడుపటుకాలదండంబు చేతులఁ బిసికి వేఁడిమియార్చి బెండుచేసి

గీ. పేదప్రాణులఁ బొరిగొనుబిరుదుమగఁడ, వగుదు వీ వని యందంద మొగముమీఁదఁ
జప్పటలు వెట్టి దైత్యుఁడు జమునిఁబొవుఁ, జేవయునుఁ బొల్లగాఁ గాసిచేసివిడిచె.

క. రక్కసుఁడు వయ్యె నమరుల, దిక్కొరగితి దాయ నీవిధిం బొమ్మనుచున్

స్రుక్కఁగ నడిచె నిశాచరు, నక్కజముగ నసురపతి గదాహతి నాజిన్. 120

సీ. లీలమైఁ బాతాళమూలంబు దాఁకను సలిలధిసలిలంబుఁ గలఁచి సొచ్చి
జలములు ద్రిక్కఁగ సకలరత్నంబులు వెఱచి సాగరపతి వీడుకొలిపి
మకరకర్కటకూర్మమత్స్యమహానాగబలముల బలువిడిఁ బారిసమరి
క్రూరదుర్వారదారుణపాళివిసరంబు వోరంపుఁగడఁకఁ దుత్తుమురు చేసి
గీ. పశ్చిమాశాధినాథు విపశ్చదర్ప, నీయగాంభీర్య దైతేయనాయకుండు
సమరతలమున భంగించె సకలదైత్య, సముదయంబును నానందజలధిఁ దేల. 121

క. జవమును బలమును బొలుపఱి, భువనంబుల నెంగుఁ దిరుగుపోఁడిమి యొడలన్
బవమానుం డవమాన, ప్రవిహతమతి యయ్యె నసురపతికోపమునన్. 122

క. నవనిధులు పుచ్చుకొని భవ్యవిమానము నాచికొని సురారి కడిమిమై
భవసఖుఁ డితఁ డట్టిదకా, నవు నని భిక్షేశుఁ జేసె నయ్యక్షేశున్. 123

ఉ. ఎక్కుడు దిద్దు భూతియును నెమ్ములు సొమ్ములు భిక్షు జీవనం
బొక్కటి కట్టఁజీరయును నుండఁగ నిల్లును లేదు నిక్కవం
బిక్కఱకు న్దపస్వినులు నేచిన నయ్యెడు నేమి యంచుఁ దా
నొక్కని శర్వునిం బఱుప నొల్లఁడు దైత్యుఁ డనాదరంబునన్. 124

వ. ఇవ్విధంబున సకలదిక్పతుల న్బరిభవించి తదీయపదంబులుం దాన కైకొని మాఱులేక
మలయుచును సర్వలోకైకభీరుం డై విజృంభించి. 125

సీ. వనరాశిజలములు వడిఁ ద్రిప్పుకొనులీలఁ గలఁగించు మందరనగముకరణి
నంబుజప్రియశశిమిత్రులఁ బోరిఁ బట్టి బాధించు సింహికాప్రభవుభంగి
ఘనగోత్రగోత్రశృంగంబులు వెసఁ దాఁకి పొడి చేయుఁ దీవ్రదంభోళిపగిదిఁ
బ్రబలబలాహకప్రకరంబు వ్రచ్చి వందఱలాడుఁ బటుమారుతంబుమాడ్కి
గీ. దిగ్గజంబులగుండెలు దిగులుకొల్ప, హోరరవమునఁ గ్రూరమృగారిపోల్కిఁ
బ్రకటభుజదర్పమునఁ దన్నుఁ బట్టలేక, దుర్విషహుఁ డై హిరణ్యాక్షపూర్వజుండు.

సీ. తపములఁ గ్రుస్సినతపసులఁ బట్టి తెప్పించి యచ్చరలతోఁ బెండ్లిసేయు
మోదంబుతో నశ్వముఖుల లాయంబులఁ గట్టి బొక్కనియాలఁ గవణమెత్తు
భుజగేశ్వరులశిరంబుననున్నమణు లూడ్చి కొమరార వట్టువగుండు లెత్తుఁ
జెలఁగి గంధర్వులచేతివీణెలు పిశాచుల కిచ్చి పాడించి చూచి నవ్వు
గీ. ఖడ్గములు పాదుకలు ఘుటికములు నపహ, రించి సిద్ధపుంగవుల గారించుచుండు
భువనబాధలు దన కిట్లు ప్రొద్దుపోక, లుగ సురారాతి పేర్చె నుల్లోకుఁ డగుచు.

క. సదభిమతము లగుదుగఖము, విదితముగ హిరణ్యకశిపవే స్వాహా య
న్నదిదక్క మంత్ర మొండె, య్యదిచోరకుండఁగ సురారి యాజ్ఞాపించెన్. 128

చ. సరసిజసంభవుండు హరి శర్వుఁ డనంగఁ గలారె వేఱె యొ
క్కరుఁడు జగత్త్రయంబునకుఁ గర్తయు భర్తయు సంప్రహర్తయున్
దిరముగ నేన కాక యని దేవకులద్విషుఁ డాగమక్రియా
కరులకు దన్నుఁ గొల్వుఁ డని గర్వమున న్నియమించె నెల్లచోన్. 129

సీ. భానుఁ బిల్పించి నాపంపునఁ బాయని తెరువరి వై మీఁదఁ దిరుగు మనియె
జంద్రునిఁ బిలిచి నాశాసనంబున జగంబున నెల్ల యోషధుల్ ప్రోవు మనియె
ననిలునిఁ బిలిచి నాయాజ్ఞఁ బ్రాణులకెల్ల నలయుప్రాణంబవై మెలఁగు మనియె
ననలునిఁ బిలిచి నాయానతియందున బాచకాదికమోజపఱుపు మనియెఁ

గీ. దనచరిత్రంబె వర్ణింపఁ బనిచె ఋషుల, నితిహాసపురాణార్థజాతి నెల్లఁ
దన్ను వినుతింపఁ బనిచె వేదముల నెల్ల, దైత్యనాయకుఁ డఖిలవిధాయకుండు

మ. జముఁడై తాన సమస్తకర్మగతులున్ శాసించు శీతంబు నూ
ష్మము వర్షంబును దాన యయ్యయితఱిన్ సంధిల్లఁగాఁ జేయు న
ర్థముఁ గామంబును దాన కైకొని ప్రమోదం బందు ధర్మంబు మో
క్షము నాత్మీయకటాక్షలక్ష్యము లనన్ గర్వోత్కటస్వాంతుఁడై. 131

ఉ. నేలయుఁ గొండలుం దిశలు నింగియు దీవులు నంబురాసులున్
గాలములున్ గ్రియావళులు గాడ్పులు వహ్నులు నాకమర్త్యపా
తాళములు న్నిజాకృతులు దాల్చి సరోరుహసూతిఁ గొల్చిన
ట్లాలఘుశీలుఁ గొల్చి సదయాత్మత యేర్పడ వచ్చి నిచ్చలున్. 132

వ. ఇట్లు లోకపరమేశ్వరుం డగునసురేశ్వరుండు నిరంతరైశ్వర్యుండును, గురుభుజవీర్యుండును, దివిజమర్దనకార్యంబులు నవార్యంబులై చెల్లుచుండఁ జండప్రతాపదీపితత్రిలోకుం డగుచు ననేకసంవత్సరసహస్రంబులు సామ్రాజ్యంబు సేయుచుండె నాఖండలప్రముఖబృందారకు లందఱు రహస్యంబునఁ గూడఁబడి గురునితోఁ గర్తవ్యంబడిగిన నమ్మహామతి మరుత్పతి కిట్లనియె. 133

క. నీతులచేఁ ద్రోవఁడు దుర్నీతుని యుద్రేక మెసఁగి నిగిడినయెడ లో
కాతిక్రమహేతు వగు న, హేతుకశానాశనంబు నెమ్మెయిన నగున్. 134

చ. కడిఁదివరంబు వారిరుహగర్భునిచేఁ గొనినాఁడు వాఁడు మీ
యెడ ననిశంబుఁ బెన్పగయు నీసును రోషము నెమ్మనంబులో
జడిగొని యుండుఁ గావున నసాధ్యుఁ డబాధ్యుఁడు దైత్యనాథుఁ డే
వడువునఁ బౌరుషంబుఁ గొని వాని జయించుట వ్రేఁగుఁ జూడఁగన్. 135

సీ. సామంబుచే శత్రు సాధింత మంటిమా సామంబు ఖలునందు సేమమగునె
భృత్యులతో దాయ భేదింత మంటిమా యాసహోదరసాహసుం డసురవరుఁడు

దానంబు వశ్యవిధాయక మంటిమా మెల్లమెల్లను వాఁడు కొల్లగొనిరొ
దండితనంబున దండింత మంటిమా చెనసి యజేయు నిర్జింపరాదు

గీ. కానఁ జతురుపాయంబులు కార్యసిద్ధి, జనకములు గావు మఱి చూడ సంధివిగ్ర
హాదు లైనషడ్గుణములు నప్రయోజ,నములు పగతుఁడుఘనుఁడు దుర్దముఁడుఁ గాన.

క. స్థానంబును వృద్ధియు న,ద్దానవపతియందు నంచితములైనవి దే
వానీకము సంక్షయగత, మైనయది త్రివర్గతత్త్వ మారసిచూడన్. 137

వ. స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్రదుర్గబలంబులనుసప్తాంగంబులునుసంపన్నంబులై
తదీయసామ్రాజ్యంబు రిపులకు నభియోగ్యంబు గాకుండుటయు నాకౌకసులకు
నస్మహీమ విగతం బగుటయుఁ బరమేష్ఠిదత్తవరలాభంబుననుదయోన్ముఖుం డైనవాఁ
డునుం గావున నసురకుం గాలబలంబు సమధికం బగుటయుఁ ద్రిలోకంబులును
దనయధీనంబులుగాఁ గైకొని యున్నవాఁ డగుటంజేసి దైవబలంబు సిద్ధం బగుట
యవలంబింపనగుటయుట నాకుం దోఁచినకర్జం బది యట్లుండె వెండియు నొక్కటె
అంగు చెప్పెద. 138

శా. కామక్రోధముఖాద్యమై నయసుహృద్వర్గంబులఁ గెల్వ నే
నీమంబుండు సమర్థుఁ డాతఁడు విరోధివ్రాతముం గెల్చు నీ
కామక్రోధముదాదినిర్జితుఁడు దుష్కర్ముండు నై యుండువాఁ
డీమై నెవ్వరిచేత నేనియు రమాహీనుం డగుఁ బ్రేల్మిడిన్. 139

క. అజితాత్ముఁ డైనయాతని, విజయంబును సిరియు విరియు వేగంబ శర
త్ప్రిజనితజలధరములు గడు, నిజము లగునె యంబరముగ నిముసం బైనన్. 140

మ. గతిఁజూం డిప్పుడు కామరోషముల నుద్రేకించి లోకంబు దు
స్స్థితి నొందించుచు నున్నవాఁడు విభవాంధీభూతచేతస్కుఁ డై
మతిహీనుండును బోలె సౌఖ్యనిరతిన్ మత్తిల్లి యున్నాఁడు ని
ర్జితుఁ గావింపఁగవచ్చు దైవపరతన్ జేపట్టి యీపాతకున్. 141

క. విజయాభిమానతృప్తు బ,హుజనద్విష్టుఁ గామసంవృతోన్మాదు వినో
దజితుని వెసఁ దొడరంగా, విజయం బగు ననిరి నీతివిస్తరవేదుల్. 142

క. తనుఁ దా నెఱుఁగనివానికిఁ, దనుఁ దా దండించుకొనిన తామసునకు నెం
దును దైవబలము లేదింత నిరూఢతఁ గనినసిరియుఁ దప్పుగ దోఁచున్. 143

వ. మనకు దైవంబు దాతయు వాసుదేవుండ మనకేయున నేల యనేకబ్రహ్మాండకోటిజా
తంబు లైనచరాచరభూతంబులకుఁ బరాయణంబు నారాయణాభిధానం బగుతే
జంబ. ఈజగంబుల సంకటం బుడుప నాదేవునకు నసాధ్యంబు.మన మిమ్మహాత్ముశ్రీ

పాదపద్మంబులు చేరి మనతెఱఁగంతయు విన్నవింతము. మున్ను చెప్పితి. హరి
శరణాగతుల యాపదలఁ బాపకోపు నాపురుషునకు మనసు నెయ్యదికర్తవ్యంబు
గా నానతిచ్చెఁ దత్ప్రకారంబున నపకారునకుఁ బ్రతికారంబు చేయుట మిదియ
నిశ్చయంబు గావున 144

మ. త్తకోకిల రండు పోదము లెండు వేగమ ప్రస్ఫురత్కులిశాయుధా
ఖండఖేలన హేతిభీతనగప్రజాభయదాయితా
చండచండతరంగసంభ్రమసంప్రవర్ధకి వార్ధికిన్
పుండరీకదళాక్షుమందిరభూమికిన్ మహినేమికిన్. 145

వ. అని సురలకు గురుండు వితథం బగునీతిపథంబునన్ బరమహితం బుపదేశించె నని
దేవశ్రవునిబలన గాలవుండు వినినపథంబు విశదవిస్తారంబుగా నుపన్యసించె. 146

## ఆశ్వాసాంతము.

క. శ్రీకుసీవళధామ, వ్యోమాయ శహాంకిరణయుతకౌస్తుభర
త్నాతపరచితేంద్రధను, స్స్వతనపినాంబుధరభీరశుభాంగా. 147

భుజంగప్రయాతము.
మహాంభోధికల్లోలమాలావిలోల, న్మహాభోగిశయ్యాసనాక్రాంతకేళీ
మహాశక్తిముక్తోపమానాత్మమాయా, మహాయంత్రకభ్రామ్యమాణత్రిలోకా. 148

క. వైకుంఠనాథ సమద, శ్రీకంఠగ్రహణరిపురాశిల విరించి
శ్రీకంఠాదికమూర్తిమ, యాకుంఠనిజైకచిన్మయాకార హరీ. 149

స్రగ్విణి. సత్యసత్యాకవోత్సంగసంగప్రియా, నత్యనత్యంతరోన్మత్తముక్తస్తుతా
నిత్యనిత్యోదితోన్నిద్రనిద్రాన్వితా, దిత్యదిత్యాత్మజోద్రేకరేకాపహా. 150

గద్య. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్యధుర్య
శ్రీసూర్యకవిమిత్రసంభవశంభుదాసులక్షణాభిధేయఎఱ్ఱయనామధేయప్రణీతంబైన
శ్రీలక్ష్మీనరసింహావతారంబను పురాణకథయందు ద్వితీయాశ్వాసము.




శ్రీరస్తు.

# తృతీయాశ్వాసము.



మద్గరుగరుడాచల
ధామ సుధాధామతీవ్రధామసహస్రో
ద్దామద్యుతి తేజోనిధి
సీమ శ్రీమహితదేహ శ్రీనరసింహా. 1

వ. దేవా గోమహాక్షణుండు మహాత్ముల కిట్లనియె నంత బృహస్పతిమతంబు తమకు నభిమతంబుగా నేకమతంబున నమృతాశనులు నముచిశాసను మున్నిడుకొని యాప్రాద్రి కదలి యుత్తరాభిముఖులై చని. 2

మహాస్రగ్ధర. కనిరుగ్రగ్రాహనక్రగ్రహణఘుమఘుమాకారకల్లోలడోలా
స్వనసంప్రద్యోతకేళీసరభసఫణభృచ్ఛారుజూటాగ్రజాగ్ర
ద్ఘనరత్నోదంచితోద్యత్కటకుటిలమయూఖచ్ఛటాటోపమిథ్యా
జనితౌర్వాగంభశుంభత్సలిలనివహాని స్తంద్రు రత్నాకరేంద్రున్. 3

వ. కని తదీయమహామహిమకు నంతరంగంబులఁ గౌతూహలాద్భుతానందంబులు సందడింప నందఱుం దమలో నిట్లనిరి. 4

సీ. కల్పాంతవేళ భీకరసూకరాకృతిఁ దనరి విచ్చలవిడిఁ దఱిసియాడె
నఖిలంబు మ్రింగి మాయాశిశుమూర్తియై లీలమైఁ దనయిచ్చఁ దేలియాడె
ప్రతిచోరుపైఁ గినుక చూపి మీనాకార మింపారఁ దనివోవ నీదియాడె
నమృతంబు నెపమున నచలంబు లోవైచి తనయోపుకోలఁదులఁ ద్రచ్చియాడె
గీ. నెపుడు పాయ కున్నట్టివాఁ డించు నిమ్ము,నుండుఁ డబ్ధీంద్రుపై నెంతకూర్మి గలదొ?
యఖిలజగదీశ్వరున కింత యనుగలముగ, నేమితప మొనరించెనో యిప్పయోధి. 5

చ. ఇది యొకఁ డేల యీజగము లిన్నియుఁ జెన్నునఁ గన్నతల్లి బ
ల్లిదుఁ డగుశౌరిపేరురము లీలమెయిం దనయాటయిల్లుగా
ముదము దలిర్ప నొప్పెసఁగుముద్దియ యీతనికూఁతు రట్టె యీ
యుదధివరేణ్యుపుణ్యమున కొండొకఁ డెందును నీడు గల్గునే. 6

వ. అని యనేకవిధంబులం గొనియాడుచుం జని వినువీథి నంబుధినిందఱియం జొచ్చి
దవ్వుదవ్వులయందు శ్వేతద్వీపంబునుదన్మధ్యగోచరంబును నగువైకుంఠపురంబునుం
గని మ్రొక్కి యొండొరులకుం జూపుచు. 7

శా. ఈవారాశికి దానభూషణముగా నీదేవి శుభ్రాంబుజ
శ్రీవిభ్రాజిత మయ్యె దీనినడుమన్ జెన్నొంది హేమోజ్జ్వలం
బై వైకుంఠపురంబు కర్ణికతెఱం గారంగ నిందూర్జిత
శ్రీవత్సాంకునిఁ జూత మింక ప్రమదస్థేమున్ మహాళీంద్రుఁగాన్. 8

క. అని పలుకుచుఁ జిత్తంబులు, ఘనతరభక్తిరసభరితకలితము లై పే
ర్చిన నమరవరులు నిజకర, వనరుహపుటఘటితనిటలవన్యస్తకు లై. 9

శ్లోకము శ్వేతద్వీపాయ సంసారతిమిరశ్వేతభానవే,
నమః కైవల్యకంఠాయ వైకుంఠనగరాయ చ. 10

వ. ఇట్లు తొడంగి బహువిధస్తోత్రనాదంబులు రోదోంతరంబున మేదురంబులుగాఁ బు
రంబు సొత్తెంచి రాజమార్గంబున రాజమందిరాభిముఖు లై వచ్చుదివిజులకలకలం బా
కర్ణించుచు వైకుంఠనాథుండు ననాథనాథుండును నగు శ్రీనాథుండు నాకౌకసులం
దడయక తోడ్కొని తేర వైనతేయు నానతిచ్చి పుచ్చిన. 11

సీ. భాసురసౌవర్ణపక్షయుగ్మముకంటెఁ బ్రకటితం బగుబంధుపక్ష మమర
నంచితహరిచందనాంగరాగముకంటె రాజితం బగుముఖరాగ మొసఁగ
లాలితహారాద్యలంకారములకంటెఁ బూరుషాకారంబు భూషణముగ
నభిగమ్యమ్ముపదన్యాసంబుకంటెఁ బ్రియోక్తపదన్యాస ముల్లసిల్ల

గీ. విబుధకోటి నెదుర్కొని వినతపట్టి, యాదిదేవునియాదరం బపుడు చెప్పి
యందఱును సంతసిల్లంగ నంతిపురము, కొలువుకూటంబునకు వారిఁ గొనుచుఁ జనియె.

చ. అనుపమలీల నొప్పుపరమాత్ముని దివ్యసభానివాసమున్
గనుఁగొని యద్భుతప్రమదకౌతుకపూరములన్ మునింగి య
య్యనిమిషకోటిచిత్తము నిరంతరదైత్యనికారఘోరవే
దనఘనభార మెల్ల దిగద్రావి భజించె నవీనభావమున్. 13

### — అంగవర్ణవచనము. —

వ. ఇట్లు సభామంటపప్రవేశం బొనరించి యనంతరంబ వారగ్రభాగంబున నుదగ్రభో
గిభోగమహాశ్వేతశయనీయంబునఁ గమనీయహిమశైలశృంగసంగతంబగుసతోయతో
యదంబుచాయను నుపమేయం బగుచుం బాలుపారుసోయగంబును, నవపారిజాతపల్ల
వంబులయుల్లాసంబు నుల్లసం బాడుచు శ్రుతిసీమంతసిందూరరంజనరంజితంబులై నవి
యవి యవియనికొని యాటలకుం జాలకాలఁ జెన్నొందుచరణతలంబులును, వరణాం

గుస్తనిష్ఠ్యూతస్యూతం బగుమిన్నేటి తెలివిసీటికిఁ బ్రోది గావించునుజ్జ్వలనఖచంద్రి
కానిష్యందంబును, సువృత్తంబులు సుస్నిగ్ధంబులునై నెఱసంగ జీలకైవడి నెల్లనడ
నడికి మైవడిరైయి నెఱయు నిరుదొడలును, దొల్లియు మధుకైటభాసురశిరోవిదళనం
బునకుం దగిన నెళ వయ్యు నింకను హిరణ్యకశిపువక్షోవిదారణంబునకుం గారణప్ర
దేశం బయ్యెడునని జతనంబునం బొదివి పాటించినయనువునఁ గనకాంబరసంవృతం
బగుచు నొప్పారునూరుయుగళంబును, నాభికమలకందళితంబు లగుచు నెలంచె
డు మొలకలపొలుపునం గటితటఘటితరత్నశృంఖలోపలంబులముందటిదెసఁ దోఁచు
తఱుచు మెఱుంగులును, గల్పారంభకాలంబున నభ్యంతరంగితభువనప్రపంచంబు
వెలువరించుటవలనం గృశతనొంది సుక్కిఁ గాక యనందగువృత్తసుందరం బై
లలితవళికలితంబు నగుమధ్యంబును, నేప్రొద్దునుం జేరువ యగుకౌస్తుభరత్నంబునం
దెలయ తననీడఁ జూచి యొక్కొక్కమాటుమఱపున నితరసుందరి యనుసందేహంబు
నొంది యాందోళించు డెందంబున నొక్కింతవడి యసూయాసౌందర్యంబునం
దిలకించు నిందిరకుం బ్రియమందిరం బై యనవరతసురభి సురుచిరతరుణతుల
సీదళదామంబునఁ బొదలురుచిసముదయంబుల సమధికశ్యామాయమానంబు లగు
భుజాంతరంబులును, సిరినెఱికొఁగిటఁ గఱకుచనుముక్కు నొత్తునం గమలినచోటి
కందుచందంబున లలితాలంకారం బై కనుపట్టు శ్రీవత్సలాంఛనంబును, దేవాదిచతు
ర్విధభూతనిర్మాణంబునకుఁ జతురాగమధర్మప్రతిష్ఠాపనంబునకు లోకపాలచతుష్టై
శ్వర్యప్రదానంబునకుఁ జతుస్సుఖముఖకపోలస్పర్శనోపలాలనంబునకు నొక్కొక
వరుసన చాలి చరితార్థం బొంది మణివలయమండితంబులై యాఖండలీయం బగుమత్త
వేదండంబునకు నఖండదంతదంతంబులుం బోలెఁ ద్రిరేఖాలక్షితంబై తనకు నిఖిల
వ్యాపారంబులయందును ధురీణంబు లగుచుఁ బెనుపొందుచతుర్భుజంబులును, భావి
కాలంబున నసురేంద్రుపేరురంబు చీరునెడం దొరఁగురుధిరధారలచెలువంబు
సూచించుచాడ్పునఁ గెందామరరేకులం దెగడు కరశాఖలం గాంతితరంగితంబు లగునం
గుళీయమాణిక్యమయూఖరేఖానివహంబులును, జతురాననజనకం బగుజలరుహంబు
నకు నిమీలనోన్మీలనంబు లుత్పాదించుచు వినోదించుటకు సవరించినచంద్రసూర్య
బింబంబులపగిదిఁ గమనీయకాంతితేజోవిలసితంబులఁ బచరించుచుఁ గరద్వితయం
బున నమరుపాంచజన్యసుదర్శనంబులును, నపరహస్తయుగళంబున బరిగృహీతం
బులై మూర్తంబులైనసంపద్విజయంబులకరణిఁ బ్రకాశితంబులగు కౌమోదకీనంద
కంబులును, గరకలితకంబురత్నంబు నిర్మించినయచ్చునుంబోలెఁ ద్రిరేఖాలక్షితంబై
లక్ష్మీభుజలతావేష్టనంబునఁ బునరుక్తసన్నివేశం బగురత్నగ్రైవేయకంబువలన విల
సనైకధురంధరయును, శ్రవణప్రవేశసమయంబునకు నవసరంబు వేచి కదిసిపొదిఁగి
యున్న మహామునీంద్రస్తుతిసూక్తంబులో యనుతలంపు లుత్పాదించు నవతంస

మౌక్తికంబులందమయందుఁ బ్రతిబింబితంబులగుటవలన మధురస్మితలతాభిజగర్భం
బులయోజ రాజిల్లు కమ్రకపోలతలంబులును, సుప్రసాదాలాపసమయంబుల నధ
రబింబప్రభాపటలపాటలంబగుటవలన లోకరంజితంబులనర్థంబులనతిసమర్థంబులగు
విమలవాక్యస్వరూపంబులరూపున దీపించుసితిదంతకరకలాపంబులును, గొలందివడని
నిడుదతనంబున నిగుడు వెడఁదకన్నుఁగవను నిరుదెసలకర్ణోపాంతంబులు విశ్రాంతసీమ
లగుటకుం దగి నడుమం దాన నిలిచిన ననాయతంబై సుగంధఘ్రాణపవనపరిమిళితపు
రోభాగం బగుచుఁ దనరారుఘనతరఘ్రాణంబును, చెలిమోముచందురుం గొలువఁ
జేరినకుముదవదనవికాసంబుల మాసరంబులమాడ్కి నలుదిక్కులం బిక్కటిల్ల నుత్ఫు
ల్లలోచనరుచినిచయంబులు సకలసురాసురస్థితివిలయంబులు నిజకటాక్షవిక్షేపవిభ
వంబులకు నధీనంబులుగాఁ బెంపారుతొంగలి ఱెప్పలయొప్పిదంబుమీఁదఁ బ్రతి
బింబించెననఁ బూర్వవిలసితంబు గలిగించు భ్రూయుగంబును, శిరోభూషణపద్మ
రాగరత్నంబునఁ బరఁగురాగంబు గలయఁ బర్వి కెంబట్టు తలసుట్టిన యట్టియిట్టలం
పుఁబొలుపు పుట్టింపఁ బెంపారువిశాలమౌళిసన్నాహంబును నగుచు నఖిలముని
జనధ్యేయాప్రకారం బైనయాకారంబు నిర్వికారసంస్కారంబుల నుదారంబు
లగుచునుండ, నిబిడాంజనశ్యామం బగునిజదేహధామంబున బహులస్తోమంబున
దత్ప్రదేశంబంతయుఁ గోమలతమాలపల్లవోపహారంబుల విస్ఫారంబులైనమాడ్కిం
జూడ్కులకు వేడ్కలు నిండింపఁ, బ్రౌఢపర్యంకభుజంగఫణామణిమరీచులు మేనం
గలయఁ బెరసి జలనిధివీచికాస్ఫాలనలగ్నంబు లగుప్రవాళాంకురంబు లనుశంక నంకు
రింపఁ జేయు మహారత్నరచితంబు లైనసభాస్తంభతోరణకవాటకుట్టిమకుడ్యవేదివి
తానాదులను దేజోమహనీయంబు లగునభ్యంజనశరీరంబులను బ్రతిఫలితయైననిజ
మూర్తి దానఖిలచరాచరాంతర్గతుం డగుటఁ బ్రత్యక్షంబుగాఁ దెలుపంబూనినతెఱం
గునఁ దేజరిల్లుసాగరకన్యకాకరసరోరుహసౌరభసంభావితంబులై మెఱయు మధు
కరంబులు సాకారంబులై కొలుచుసకలశబ్దమంత్రాక్షరజాలంబులకుననుగలంబులై కలసి
మెలఁగ మూర్తంబులై సర్వాగమంబులు నేమేమి యనియుత్తమాంగంబులు మంగళ
చరణపీఠంబులుగా నమర్ప నొగ్గి డగ్గఱికొలువ, సురుచిరప్రతిష్ఠాలాపంబులు గోరి
యశేషధర్మవిశేషంబులు నంగీకృతాకృతులై చేరి కృపాకటాక్షంబు లపేక్షింప,
సర్వలోకశరణ్యుండును, సర్వదేవతావరేణ్యుండును, సర్వయోగార్థగణ్యుండును
నగుచు శ్రీదేవీవిలోచనచకోరంబులు నిజవదనేందుచంద్రికాప్రవాహంబులనోలలా
డుచుండ, నాత్మీయమనోరథమధుపంబులు తదీయలావణ్యమధురసంబులఁ దనివిలేని
యనువునం గ్రోలి క్రాలుచుండ, నమ్మహాదేవి నెమ్మేనుదీఁగ దనబాహుశాఖలం దగిలి
ధన్యవిలాసంబుల భాసిల్లుచుండఁ, బుండరీకాక్షుం డయ్యును నసురక్తావలోకనుం
డును, నీలవర్ణుం డయ్యును దరహాసధవళితకపోలుండును, గమలాకళత్రుం డయ్యును

వివాహకౌతూహలియును, నిరంతరవననాసి యయ్యును ననంతభోగేశ్వరుండును, గుణరహితుం డయ్యును సాధుజనపూజనీయుండును, జన్మవిముఖుం డయ్యును భవప్రియుండును, గోత్రోద్ధరణసమర్థుం డయ్యును సమస్తలోకబాహ్యుండును, విగతబంధుం డయ్యును సతతసన్నిహితపితామహుండును నగుచు పుణ్యంబులకు నాధారంబును, నాపదలకుఁ బ్రతీకారంబును, నధర్మంబునకు నవమానంబును, మంగళంబులకు నాస్థానంబును, సత్వంబునకుఁ బరమమిత్రంబును, నాగమార్థంబులకు నాదిసూత్రంబును, రక్షకు మూలంబును, మోక్షంబునకు నాలవాలంబును, విజ్ఞానంబునకు నిర్దేశంబును, బూజాస్తోత్రంబులకు నభిగమ్యప్రదేశంబును నగుచు నొప్పుచున్న దేవాదిదేవుఁ, బురాణపురుషుఁ, బురుషోత్తముఁ, బ్రకృతిపురుషుఁ, బురుషాధీశ్వరుఁ, బరమేశ్వరు నంత నాలోకించి 14

క. అందంద చాగి మ్రొక్కుచు, బృందారకు లధికభక్తిభీతవికాసా
నందంబులు డెందంబుల, సందడి గొన మస్తకప్రశస్తాంజలులై. 15

క. ఆవిశ్వరూపరూపము, భావించుచుఁ దత్ప్రభావభంగుల మది సం
భావించుచుఁ దత్పరమతు, లై వినుతింపంగఁ దొడఁగి రప్పరమాత్మున్. 16

ఉ. శ్రీవసుధాకళత్ర యతసీసుమనోతిమనోజ్ఞగాత్ర మా
యావిహితత్రిలోకనిగమార్థవివేకవిపాకభవ్యసం
సేవకసౌమ్యమానసవశీకృతరూప భవాంధకారని
ర్ధావనదీపదీప్తనవతామరసేక్షణ విశ్వరక్షణా. 17

చ. భవ దురునాభిరంధ్రభవపద్మరజఃపరిమాణపాకసం
భవుఁడు విధాత తద్విమలభావకటాక్షణమాత్రమై భవో
ద్భవము జగంబు తద్వివిధభంగికసర్గము లోన నొక్కరుం
డివి యని నిశ్చయింపఁగఁ జేవఁడే భవదీయగుణంబు లచ్యుతా. 18

ఉ. ఎందును నిన్నుఁ గన్నజను లెందును గల్గరు వెండి యొద్దెసం
జెందవు నిన్ను నెద్దెసలఁ జెందని క్రించులభక్తి నొక్కటన్
బొందు గొనంగఁ జాలు కృతపుణ్యులు గల్గినఁ జాలువారికిన్
బొందగునీలసత్కరుణ పుణ్యయశోమహనీయ మాధవా. 19

శా. విన్నంజాలు భవన్మహత్త్వము భవద్విజ్ఞానసద్గోష్ఠియం
దున్నంజాలు భవత్పదాంబురుహసేవోత్సాహసంపన్నులం
గన్నంజాలు భవత్సమంచితజగత్కల్యాణనామంబుఁ జే
ర్కొన్నంజాలు నరుండు శాశ్వతశుభారూఢుండు లక్ష్మీశ్వరా. 20

ఉ. అక్షరయోగయుక్తులు సమంచితసత్యదయానురక్తులా
లక్షితసత్యధర్ములు విలంఘితకర్ములు బుద్ధికల్పితా

పాత్షరవాక్యరూపులు నిరాకృతకోపులు సంయమక్షమా
శిక్షితు లక్షయుల్ నినుభజించుమహాత్ములు నీరజోదరా. 21

చ. తమతమపూర్వవాసనలఁ దత్పరులై వివిధాగమోక్తకృ
త్యములు వహించె భవ్యపరతత్త్వము నయ్యయిసంజ్ఞలం బ్రియ
త్నమునఁ దలంచుసంయతమనస్కుల కెల్లను జేరుచోటు శ్రీ
రమణ భవత్పదంబు సుచిరస్థితి నేఱుల కబ్ధిచాడ్పునన్. 22

ఉ. విద్యల కెల్ల నాద్యుఁడును వేద్యుఁడునై తనరారునిన్ను న
భ్యుద్యతకర్మరూపముగ నుల్లమునం దలపోసి యెంతయుం
జోద్యపుభక్తి యజ్ఞపురుషుం డని పూని భజింతు రెందుఁ ద్రై
విద్యులు నాకలోకపదవీపదవిభ్రమ త్రిలోకనాయకా. 23

శా. దృష్టాదృష్టఫలస్పృహావిముఖులై దిక్పూర్వతత్త్వక్రియా
సృష్టిం బ్రస్ఫుటతీవ్రబోధమున నుత్సేకించి యవ్యక్తసం
సృష్టిన్ బాసి నిరస్తవైకృతనిదాసీనాత్మషడ్వింశు వి
స్పష్టైశ్వర్యుని నిన్ను సాంఖ్యు లెలమిన్ భావింతు రాత్మేశ్వరా. 24

చ. యమనియమాభివర్ధితములై మగుడంగ మనశ్శరీరముల్
శమితముగా మరుచ్చయము సంతతజీవపరాత్మతత్త్వరూ
పములు విభేదమై మఱపు పాటిలి కాలము మ్రింగి యోగివ
ర్గము గనుచిత్సుఖానుభవగర్వము సర్వము నీవ కేశవా. 25

చ. పరఁగుపదార్థపంచకము పాశములై తనుఁ జుట్టఁ దూలుచున్
దిరిగెడుజీవుఁడున్ బశువు దేశికపుణ్యకటాక్షవీథిఁ ద
త్పరమతిఁ జేరఁగా నపరబాధవిముక్తి శుభంబు నిచ్చునీ
శ్వరుఁడుగ నిన్నెఱుంగుదురు శైవులు శాశ్వతచిన్మయాత్మకా. 26

ఉ. దాస్య మొకండునుం బరమధర్మముగాఁ గొని యన్యధర్మమా
శాస్యముగా గణింపక యసంశయనిశ్చలభక్తిసంతతో
పాస్య నశేషభవ్యపురుషార్థభవైకవిధాయి నిన్ను నా
లస్యతఁ బంచరాత్రులు దలంచి భజింతురు భక్తవత్సలా. 27

శా. ద్వైతభ్రాంతివికల్పితం బఖిలమున్ స్వప్నేంద్రజాలోపమం
బై తూలన్ స్ఫుటరజ్జుసర్పసదృశవ్యామోహవిచ్ఛేదనం
బై తత్త్వజ్ఞత యావహిల్లి యపరోక్షాభేదవిత్సౌఖ్యవి
ఖ్యాతుం గాంతురు నిన్ను నౌపనిషదుల్ కల్యాణనారాయణా. 28

శా. ధ్వస్తాశేషమతాఖిలాత్మతను చేతశ్శుద్ధు లుక్తాంగవి
న్యస్తప్రస్తుతమంత్రవర్ణులు నిరస్తాలస్యు లంతశ్శమా

భ్యస్తోద్యద్భవదీయమూర్తివిభవుల్ ప్రాజ్ఞుల్ మహామాంత్రికుల్
హస్తోత్ప్రియసురాంఘ్రిపం బయిననిన్నర్థించుదాసుల్ హరీ 29

క. వేదములాదిగఁ గలయ, ష్టాదశవిద్యలకు నీవ స్రష్టవు దత్త
ద్బోధకులును భవదాజ్ఞా, పాదకులు సమస్తధర్మపాలనచతురా 30

సీ. జలములు సృజియించి జలములయందు నీయంచితబీజంబు నావహించి
యది యప్రమేయమహోద్భుతాండస్వరూపంబునఁ బెంపారఁ బద్మభవుఁడు
జనియించె నందుఁ దజ్జాతులు భృగుమరీచ్యాదులచేత సురాసురాది
వివిధభూతోద్భవవిస్తార మేపారి త్రిభువనవ్యాప్తి సుదీప్త మయ్యె

గీ. నింతయును జూప నడుమంగ నెంతయును బ్ర, వీణుఁడై దేవ నీమాయ వినుతి కెక్క
విమలకమలాక్ష సదవనదక్షకటాక్ష, విగతపరితాపహృద్దీప విశ్వరూప. 31

క. కేవలకరుణామూర్తివి, గావున భక్తాభయత్వకరణము పని నీ
కీవిశ్వము గాఁచుటకై, శ్రీవల్లభ యపుడు నవసరింతు నిజేచ్ఛన్. 32

చ. కడఁక దలిర్ప నీవు మధుకైటభదైత్యులఁ జక్రధారచే
మెడలు దెగంగ ద్రేయు నెడ మిక్కుటమైన తదీయరక్తముల్
ఎడిసినయోడికల్ నెరయ వ్రాసినలత్తుకభంగిఁ జోద్యపుం
దొడవుగ నొప్పనీతొడవు తోరపుటొప్పు దలంతు మీశ్వరా. 33

చ. చనువులు గోలుపోయి యొకజాడయుఁ గానక బమ్మరించున
మ్ముగుసలివేల్పు దేర్చి వెస మ్రుచ్చుబడిం బ్రళయాబ్ధి నీట గ్ర
క్కదలఁగ దాడివెట్టిన నఖర్వభవత్తిమిరూప మిప్పుడున్
మదరుని గ్రోలుచుండు మునిమానసపూరములం జగన్నిధీ 34

చ. కమఠతనూవిలాసమున గర్వపుఁగొండ ధరించు రేని నీ
యమృతము దెచ్చి యాశ్రితజనావలి కిచ్చితి నేఁడు నమ్మహా
కమఠతనూవిలాసము దగన్ దలఁపన్ గొనియాడఁ గన్నవా
రమృతముఁ గాంచి నిర్మలసుఖాంబుధిఁ దేలుదు రార్తరక్షకా. 35

చ. గొరిజలత్రొక్కునం బ్రిదిలి కుండలిభర్త యొదుంగ నూర్పులం
జెరలి మహార్ణవోదకము త్రిప్పకొనం బటురోషతాడనన్
జిరిఁగి యజాండకర్పరము చిల్లులువోవఁగ యజ్ఞపోత్రివై
ధర పదిలంబుగా నిడిన తావకలీలఁ దలంతు మవ్యయా. 36

ఉ. ఖేదములేక యజ్ఞమయకేసరముల్ గదలంగ విస్ఫుర
న్మేదురహేషితధ్వను లమేయములై ప్రణవస్వరూపతన్
రోదసి నిండఁగా హయశిరోవపు వొప్ప యుగాంతసంహృతిన్
వేదము లుద్ధరించినపవిత్రయశుండవు నీవు శ్రీనిధీ. 37

మ. స్ఫురదాతామ్రజటాకలాపములతోఁ బూర్ణేందుసౌందర్యసుం
దరవక్త్రంబులతో మహోగ్రఘనకోదండేషువిస్ఫారభా
సురపూర్వాపరభాగవైభవముతో సొంపారునీరూపముల్
నరనారాయణనామధేయములు వర్ణంబుల్ జగన్మంగళా. 38

ఉ. భూతభవద్భవిష్యదురుభూతసమగ్రుల నొప్పునీసము
గ్రాతతదివ్యరూపముల నన్నిఁటి నిట్టిది నా నెఱుంగ సం
ప్రీతి నుతింప శక్తుఁడె విరించియుఁ గేవలభక్తియుక్తులన్
గాతరులన్ గృపాగరిమఁ గావుము మమ్మఖిలాండనాయకా. 39

క. గోవింద కృష్ణ కేశవ, శ్రీవల్లభ పద్మనాభ శ్రీకర సితగా
జీవాత్మ చక్రధర నీ, సేవకుల ననుగ్రహింపు శీతలదృష్టిన్. 40

క. పరమవనమాలికాధర, గరుడధ్వజ శార్ఙ్గధన్వ కాంచనవర్ణాం
బరధర కౌస్తుభరత్నా, భరణ ప్రసన్నుఁడవు గమ్ము పాలింపు దయన్. 41

క. వైకుంఠనాథ దయితక, ధాకుంఠితకరణచతుర ధర్మావన దీ
నాకల్ప భవచ్చరణా, ద్వైకాయనతత్వ మాకు నభయ మొసఁగవే. 42

ఆ. అమృత యభవ యలయ యక్షయ యవికార, యప్రతర్క్య యనఘ యజిత యచల
యప్రమేయ యమల యాద్య యనాద్యంత, యార్తమతుల మమ్ము నవధరింపు. 43

వ. అని యనేకప్రకారంబులఁ బ్రస్తుతించుచు సభక్తికచిత్తులై యున్న యనాకౌకసులఁ
గరుణావలోకనంబునం గైకొని యాలోకేశ్వరుండు మీ దెసఁ బ్రసన్నుండ నైతి
నెయ్యది యిష్టం బేమి కారణంబునం జనుదెంచితి రింతదైన్యం బేలవచ్చె మీ యాపద
యపనయించెద నెఱింగించునది యనిన డెందంబులఁ గొందలంబుఱు డిందుపడ
బృందారకు లందఱు నందంద సాష్టాంగదండప్రణామంబు చేసి యిట్లని విన్న
వించిరి. 44

గీ. దేవ దేవేశ దేవర దివ్యచిత్త, మునకు గమ్యంబు గానిది భువనకోటి
యెందునుం గల్గునే యైన యేము విన్నపంబుచేయుఁగ వినుఁ డభిప్రాయముమెయి.

వ. చిత్తగింపుము దితిసూనుండైనహిరణ్యకశిపునకు హిరణ్యగర్భుండు వరంబిచ్చి యధి
కుం జేసిన నయ్యసురాధముండు క్రోధమాత్సర్యంబులు దన్నుం జుట్టుకొనఁ బెరిఁగి
యదితిసంతతిం బరిభవించి త్రైలోక్యదుర్జయుం డై యున్నవాఁడు. 46

గీ. బలియునింట బానిస నైనఁ బఱప వెఱచు, నొరులు నీయింటిదాసుల నోటలేక
మమ్ము నసుర భంజించుట మాకుఁ జెప్ప, సిగ్గు లయ్యెడు నిందు వచ్చియును దేవ 47

చ. అలఘుసరోషదృష్టదనురాధిపతీవ్రగదాహతిన్ గడున్
గలఁగినమస్తకంబు లివె కల్పితదానవతర్జనంబుల
న్వెలవెలఁబాఱు మోము లివె నిష్ఠురదైత్యనితాంతసేవమై
నలజడిఁబడ్డమోము లివె యయ్య కృపం బరికించి కావవే. 48

ఆ. ఆహిరణ్యకశిపుఁ డడరి సమస్తసంపదలు గొనిన దివ్యపదముఁ బాసి
యిప్పు డున్నవార మిల హిరణ్యకశిపుహీను లైన నరులలోనఁ గలసి. 49

ఉ. దానవుచేతఁ గప్పుబడి దైన్యము నొందుట కోర్వలేక నీ
దైనపదాంబుజంబు లభయంబ బని చేరితి మెవ్విధంబునం
బైనఁ బ్రసన్నమానసుఁడ వై మముఁ జేకొనవయ్య మాకు ది
క్కెవ్వరు గాక యున్న నసురాంతక! నీవ కదయ్య యెయ్యెడన్. 50

వ. అని కృప పుట్టం బలికిన దివిజులపల్కులు మనస్కరించి మధుమథనుండు కొండొక యూహించి యనంతరంబు వారల కి ట్లనియె. 51

చ ఎఱుఁగుదు నేను దైత్యునియుదీర్ణమదోద్ధతచేష్టితంబు మి
మ్ముఱక పరాభవించుటయు నుల్లమునం దలపోసి వానికిన్
గొఱఁతలు నిండునంతకును గ్రూరతఁ గైకొనకున్నవాఁడ ను
క్కఱఁ దిమిరం బడంపఁ దిమిరారియుఁ బూనునె వేగకుండినన్. 52

వ. అమ్మహాసురుండు సరసీరుహసంభవుం బ్రసన్నుఁ గావించినయప్పుడుం దనకుం జావు లేకుండ ననేకప్రకారంబులు యోజించుకొని వేఁడినవాఁడు గావున వాఁ డడిగినచందంబు లెయ్యవియుం గాకుండ నొక్కటి తత్సంహారమనోపాయంబు నిరపాయంబుగాఁ బ్రయోగించుటకు నూహించినవాఁడ నది యెట్లనిన. 53

సీ ఆననభంగి పంచాననసమరేఖ యఖిలాంగములు పురుషానుకారి
తీవ్రనఖంబులు తీవ్రశస్త్రంబులు సంధ్యాముఖము ఘనశౌర్యవేళ
విపులాంకపీఠంబు రిపునకు వధశిల తద్భుజామధ్యభేదనము గదన
మమరభుజంగమర్త్యావాసనిగ్రహానోదన విజయప్రమోదలీల

గీ. యిట్లుఘోరాద్భుతస్ఫూర్తి నెసక మెసఁగ, నతులనరసింహభవ్యదివ్యావతార
మేను ధరియింతుఁ దడవులే దింక నాత్మఁ, గలఁక విడువుఁడు దేవతాగణములార!.

క. వినుఁ డాశ్రితరక్షణ మే, యనువునఁ గావింతునొక్కొ యని యనిశము నే
మనమునఁ దలపోయుదు మఱి,తునె శరణాగతులమిమ్ము దురితరహితులన్. 55

చ. ఒకమతి నన్నుఁ జేర్కొనిన నుల్లమునం దొకమాఱు నన్ సభ
క్తికమతియై తలంచినను చెల్లము భక్తుఁడు వాఁడు నాకు వా
నికిఁ గలనేను వేఱొకటి నేరక నన్నుఁ దలంచుపుణ్యులన్
బ్రకటదయానురక్తిఁ బరిపాలన చేయుట చెప్ప నేటికిన్. 56

ఉ. చెప్పితి సర్వవేదములఁ జెప్పితి శాస్త్రవిచారపద్ధతిన్
జెప్పితి సత్పురాణములఁ జింతితకల్పమహీరుహం బనా
నొప్పుమదీయకీర్తనము యుగ్రతపంబులఁ జెందుపుణ్యమున్
జొప్పడ నస్మదీయగుణశోభనముం గొనియాడ నేర్చినన్. 57

క. ఏవాఁడు నన్నెఱుఁగఁడు, గావునఁ ద్రైలోక్యహితముఁ గావింపంగన్
భావము దెలుపుచు నుండుదు, నీవిశ్వంబునకు నేన యెప్పుడు కరుణన్. 58

తే. సకలభూతజాతములకు సముఁడ నేను, వినరె యట్లయ్యు ధర్మవిద్వేషులైన
తామసాత్ముల సైరింప ధర్మబుద్ధిఁ, బొగడఁ గనినసాత్త్వికతతిఁ బ్రోతుఁ గరుణ. 59

వ. మీరు సాత్త్వికచిత్తులరు గావున నాకు నవశ్యరక్షణీయులు. తామసమర్దనంబు గార్యం
బుగా నాకు మీరెవ్వరుం జెప్పవలదు. మీపదంబులు మీకుసుస్థిరంబులైనవి గాఁదలం
చి నిరాతంకహృదయులరై యుండుఁడు. పొండని యానతిచ్చిన నాజగన్నాథువచనం
బులు మహాప్రసాదం బని యంజలిరచనారమణీయంబు లగు మౌళిభాగంబులన్ బరి
గ్రహించి పురందరాదిబృందారకు లానందంబున నానందకహస్తుచేత నామంత్రితు
లై మఱలి భావినరసింహరూపప్రకారం బూహించి యాశాకుతూహలప్రమోదభక్తి
పరవశమానసులగుచుఁ దత్కార్యోద్యోగప్రవర్తకుం డగు వాచస్పతిఁ బ్రస్తుతించు
చుఁ బరమేశ్వరువాక్యంబుల నానావిధంబులం భావించి సంతసిల్లుచు నిజస్థానంబు
లకుఁ జని రక్కాలంబున నచ్చట. 60

చ. జగములు మూఁడు గెల్చి యొకశంకయుఁ గింకయు లేక దైత్యుఁ డ
త్యగణితవైభవంబున నిరంతరభోగపరంపరారతిన్
దగిలి మనంబుగోరినవిధంబుల వేడ్కలఁ దేలుచుండు సొం
పుగఁ దనధర్మపత్ని యగుపాత్రియుఁ దాను సుదాత్తలీలలన్. 61

చ. ఉదధిపునొద్ద నర్థపతియొద్ద నిలింపకులేంద్రునొద్ద సు
న్మదకలలీలఁ గ్రాలు నెలనాఁగలు నాగరికంపుఁజందముల్
పొదల విలాసహాసము లపూర్వపుగర్వములం దలిర్ప న
య్యదితిసుతాహితుం గొలుతు రమ్ముడువోయినయట్లజస్రమున్. 62

క. విశ్వావసుతుంబురులును, నశ్వముఖులు నరుగుదెంచి యందఱు నా దై
త్యేశ్వరు నారాధింతురు, శశ్వత్సంగీతకప్రసంగప్రౌఢిన్. 63

శా. వీణావేణుమృదంగసంగతకళావిన్యాసమున్ బంధుర
శ్రోణీరమ్యఘనస్తనీనటనచారుప్రేక్షయున్ సంతత
ప్రాణప్రీణనగంధబంధవిలసత్కాదంబరీకేళియున్
ప్రాణంబుల్దల కొం డెఱుంగఁ డతఁ డెబ్భంగిన్ సమస్తక్రియన్. 64

సీ. అమృతశీకరసేకహరితవనావలి సుందరమందిరకందరములు
రత్నపుష్పామోదరమ్యకాంచనలతాకోమలమేరునికుంజములును
గనకాంబుజక్షోదపువరుక్తవాలు కాలలితమందాకినిపులినములును
హంసకుటుంబనిత్యావాసహేమాబ్జచారుమానససరిత్తీరములును

తే. నాదిగాఁగల్గు దివిజవిహారభూము, లన్నియును దానరై వేడ్క లగ్గలింప
ననుదినంబున నచ్చరల్వెనుకఁదిరుగఁ, దానుఁ బ్రియయును విహరించె దైత్యవిభుఁడు.

వ. ఇట్లు సంతతప్రమోదంబు లగు వినోదంబులఁ గాలంబు చనుచుండ నొక్కతఱి
వసంతసమయావసానం బగుటయును. 66

ఉ. ఒయ్యన మాధవీలతల నుండుట లుజ్జనఁ జేసెఁ దుమ్మెదల్
గ్రుయ్యఁగ బాటి పాటలతరుప్రకరంబుల మూఁగె నుక్కునన్
దియ్యనివింటికిన్ స్మరుఁడు దీసిన యమ్ములు గాన మెచ్చెఁ దా
నెయ్యెడ మల్లెక్రొమ్మొగడ లేపునఁ బాంథులవేఁటలాటకున్. 67

చ. మలయజవారిసేకములు మౌక్తికనూతనహారలీలలన్
వలిపపుసన్నకావులను వారిరుహాక్షులనీఁగుఁజన్నులన్
గలిగినచల్మిరిం బ్రదికెఁ గాక జనావలి యిట్టివేసవిన్
గలదె శరణ్య మన్య మనఁగాఁ గడుఁ బేర్చె నిదాఘదాహముల్. 68

తే. అదరిపాటున వేసవి పొదివికొనినఁ, గలఁగి తలఁగి పోనేరక మలయపవనుఁ
డింటఁ దలదూర్చికొనియె నా నింపొనర్చె, నమరుతాలవృంతముల మందానిలంబు.

మ. తమచుట్టం బయిన నూత్నశశికాంతస్ఫారవేదు ల్మహో
ద్యమచంద్రోదయలీల లెల్ల గరఁగం దత్తోయసంసేవనల్
గమియం దన్వొసఁగంగ నొప్పెసఁగె నంగత్కేళికాంతారభూ
జము లొప్పెమియుఁ గోలుపోక కడునిస్సారంపుఁ బెన్వేసవిన్. 70

చ. రమణభుజానిపీడనఁ గరంగిన కాంతల విస్ఫురన్మితం
బముగఁ దలిర్చు సన్నవలిపంబులు వీడియుఁ జాఱవయ్యెఁ జె
న్నమరు బినూతనక్షతనఖాంకము లింపెసలారఁ గ్రమ్ముచుం
జెమటలఁ జాలఁ బచ్చలయి చిక్కఁగ నంటి కొనంగఁ జేసినన్. 71

చ. పరిమెయి మెట్టి తొల్త బహుభంగులఁ గ్రాలెడుమిత్రుఁ జైత్రునిం
బొరిగొన వచ్చె గ్రీష్మ మనుపొచ్చెపుఁ బేరఁ బురారిఫాలభా
సురపటువహ్ని యంచు వెఱఁ జొచ్చిన మన్మథుఁ గాచె నత్తఱిన్
సరసశిరీషకేసరలసన్మహాహామృదులాలకాగ్రముల్. 72

తే. పగళులెలతోఁటనీడలు ప్రాఁతియయ్యెఁ, బగళులును రేలు దను గాలిఁ బ్రాఁతియయ్యె
రేలు వెన్నెలబయళులు ప్రియము లయ్యె, రేలుఁ బగళులు నిద్రలు ప్రియము లయ్యె.

వ. ఇట్టి ఘర్మసమయంబున నసురవల్లభుండు వల్లభాజనసహితంబుగ నొక్కనాఁడు
నిజమందిరాభ్యంతరకేళీకాంతారంబునందు. 74

సీ. ఎండక న్నెన్నఁడు నెఱుఁగని క్రొమ్మావినీడలఁ దనరారు నెలవులందుఁ
గలిగొట్టుఁ బువ్వులందలి తేనియలవానఁ దడిసిన పొదరిండ్ల యొడములందు

విరియనూఁకించు క్రొవ్విదపుమల్లియమొగ్గ లెలదావిఁ జొక్కించు నిక్కలందు
రాయంచరెఱకలరాయిడిఁ దుప్పర చల్లెడు కొలఁకులచలువలందుఁ

ఆ. దిరిగితిరిగి పెక్కుతెఱఁగులయాటల, మెఱసిమెఱసి చెన్నుమిగిలిమిగిలి
క్రాలఁ ద్రొద్దుమాపకడ యయ్యెఁ గలువల, మ్రొక్కుదైవమునకు నెక్కునఁగ. 75

తే. ఇట్టివేసవితఱిఁ బగ లిట్టినిడివి, యైన నయిరించునే దివిజారి యనుచు
వెఱచి తొలఁగెడుతెఱఁగున వేఁడివెలుఁగు, వరుణుఁడేలెడుదెసనొక్కవలననొదిఁగె.

చ ఇను నసమానతేజు దివసేంద్రుఁ గనుంగొనుమాడ్కిఁ జూడఁగాఁ
జన దొరు నల్పతేజు ననుచాడ్పునఁ జంచలభృంగతారకా
ఘనవనజాతలోచనము గ్రక్కున మీలన మొందఁ జేసెఁ బ
ద్మిని పతిభక్తిసత్త్వమున మేలిమికిం గుఱి దాన పొమ్మనన్. 77

చ. సురుచిరతారకాకుసుమశోభినభోంగణభూమిఁ గాలమన్
గరువపుసూత్రధారి జతనంబున దిక్పతికోటిముందటన్
సరసముగా నటింపఁగ నిశాసతి కెత్తినక్రొత్తతోఁపుఁజెం
దెర యన నొప్పుసాంధ్యనవదీధితి పశ్చిమదిక్తటంబునన్. 78

క. నలుదెసలయందుఁ దొలితొలి, తలసూపుఁ దమఃప్రరోహతతులు వియోగా
కులచక్రవాకమిథునం,బులు వగ యనుచిచ్చురాజుపొగల నడఁగియున్. 79

తే. పొదివి యొండొండదివియుభువియు దిశలుఁ, బొదివికొనియుండుచీఁకటిప్రోవువలన
మిక్కుటంబుగఁ గాటుక గ్రుక్కినట్టి, కరపటంబున జగదండఖండ మమరె. 80

ఉ. రాజితతేజుఁడైనదినరాజు తిరోహితుఁడైన పిమ్మటన్
రా జుదయాద్రిపీఠము తిరంబుగ నెక్కుడుసందికట్టునన్
భ్రాజితసత్పదంబునకు బాధయొనర్చుచు జారచోరసం
పూజితమై తమంబు గడుఁ బొంగె నధర్మముతోడిదోటరై. 81

క. పదపడి పూర్వదిశాసతి, వదనంబునఁ దెల్పుమిగిలె వనజాహితుచూ
లుదరంబునధరియించినఁ, గదిరినపాండురకపోలకాంతివిధమునన్. 82

వ అంత. 83

సీ. తిమిరభూతముసోఁకుఁ దెలియ జగత్త్రయీ,లలనదాల్చినరక్తతిలకమనఁగ
సఖ్యంబునకు నిశాసతి యొసంగినఁబ్రాచి ప్రాపించుగురివిందబంతియనఁగఁ
దోయధి వెడగ్రుంకి తోఁచుపురందరకుంభిసింధూరితకుంభమనఁగఁ
గులిశాయుధునిపెద్దకొలువున నెత్తిన దీపించుమాణిక్యదీపమనఁగఁ

తే. గుముదినీరాగరసబద్ధగుళికమనఁగఁ, గామినీరంజనౌషధకబళమనఁగఁ
బొడవుపెంపునబింబంబుపొలుపుమిగుల, జంద్రుడుదయించెఁగాంతినిస్తంద్రుఁడగుచు.

వ. ఇట్లుదయించి. 85

చ. దిసలనుగొమ్మ లొయ్య నతిదీర్ఘములైనకరంబులన్ బ్రియం
బెసఁగఁగ నూది నిక్కి రజనీశ్వరుఁ డున్నతలీలఁ దేర్చునా
కసమనుపేరిభూరుహము కాంతనిరంతరతారకాలస
త్కుసుమచయంబు గోయుటకొ కో యనఁ బ్రాఁకె సముత్సుకాకృతిన్. 86

ఉ. వెన్నెలవెల్లిపాల్కడలి వేఁకదనంబునఁ బేర్చి దిక్కులన్
మిన్నును ముంచి యందు రజనీకరబింబము కుండలీభవ
త్పన్నగతల్పకల్పనముభంగిఁ దనర్చెఁ దదంతరంబునన్
వెన్నునిభంగిఁ జూడ్కులకు వేడ్కయొనర్చెఁ గలంక మత్తఱిన్. 87

చ. వడిగొని యూసలుప్పతిల వాలినకేసరమున్ దలిర్పఁ బు
ప్పొడిదలమెక్కి తేనియలు పొంగి తరంగలుఁగాఁ జెలంగి పైఁ
బడునెలదేఁటిదాఁటులకుఁ బండువలై నవసౌరభంబు లు
గ్గడువుగ నుల్లసిల్లె ఘనకైరవషండము నిండువెన్నెలన్. 88

ఉ. వెన్నెలవెల్లపచ్చడము విచ్చిన యంబరశయ్యమీఁదఁ జే
రన్నన నుండి దిగ్వనిత లాదటఁ జుట్టును గొల్వ రాత్రియన్
కన్నియమూర్తి చిక్కఁ దనకౌఁగిటఁ జేర్చిసుఖించినాఁడనన్
జెన్నువహించెఁ జందురుఁడు శ్రీకమనీయకళంకరేఖతోన్. 89

సీ. కరఁగెడునవచంద్రకాంతోపలంబులఁ దఱచుసోనలఁగడుఁ దలముకొనుచుఁ
జటులచకోరసంచయములయొఱకలగర్వంపుదాటులఁ గడలుకొనుచు
విరియుకైరవములవిపులరంధ్రములపైఁ దీవ్రంబుగాఁ గ్రమ్మి త్రిప్పుకొనుచుఁ
గామినీజనములకమనీయవిభ్రమస్మితకాంతిలహరుల మెండుకొనుచుఁ

ఆ. బొదలి పొదలి చదలఁ బొంగారిపొంగారి, మించిమించి దిశలు ముంచిముంచి
యభినుంతేంద్రుచంద్రికాంభోధి యఖిలంబు, నీటనిట్టలముగ నిట్టఁబొడిచె. 90

వ. ఇట్లతిమనోహరగంభీరధీరంబైనసుధాకరకాంతిపూరంబు రాత్రియనుతలంపుఁదోఁ
పనీక తమం బనునామంబును విననీక యవ్యక్తయనుశంక నంకురింపనీక లోచనం
బులకు నమృతసేచనంబును, శరీరంబునకుఁ జందనాసారంబును, నంతరంగంబునకు
నానందతరంగంబును నగుచు విజృంభించినసమయంబున. 91

క. తనదేవియుఁ దానును న,ద్దనుజవిభుఁడు విపులసౌధతలమునఁ గాంతా
జనపరివృతుఁడై సురతరు,జనితములగు మధురమధురసంబులు వేడ్కన్. 92

క. తెప్పించి సహజసౌరభ, మొప్పారఁగ దివ్యరుచిసమున్నతసములై
యుప్పొంగువానిఁ గనకపుఁ,జిప్పల నిండించి మదము చిప్పిలుచుండన్. 9

ఉ. అందఱుఁ గైకొనం బనిచి యాదటఁ గాంతయుఁ దాను నొక్క కో
రం దనుపార దివ్యమదిరామధురామృతపానకేలి యం
దంద యొనర్పఁగాఁ దొడఁగె నంబురుహాక్షులవిభ్రమక్రియా
కందళితంబులైన సవికారవిహారము లింపుఁ బెంపుగన్. 94

క. ఆరమణులమదిరారస,పూరితచషకములఁ దోఁచు పూర్ణేందుఁడు పొ
ల్పారెను వాసనకై క,ర్పూరంపుంబల్కులిడినపోలిక యమరన్. 95

చ. నెలఁత యొకర్తు చేతిహరినీలశిలామయపాత్రిఁ బూర్ణసం
చలితతరంగయై పొదలు వారుణిఁ దోఁచుసుధాంశుమండలం
బలము కరాళరాహువదనాహతి స్రుక్కి కరంబుఁ బిష్టటం
గలఁగి పోరింబోరిన్ వడఁకుకై వడిఁ గానఁగనయ్యె నయ్యెడన్. 96

చ. సుచిరపానపాత్రమున సుందరి యొక్కతె కేల నిందుచం
దురుఁడు ప్రకంపితాంగములతోఁ దిలకించెఁ దదాననాంబుజ
స్ఫురితవికాసవైభవము సొంపు లడంకువ ముచ్చిలించి చె
చ్చెరఁ జనుదెంచి పట్టుపడి చేష్పడి భీతి నడంకుచాడ్పునన్. 97

చ. పొలఁతుక యోర్తె యొప్పుమధుపూరితపాత్రికఁ గానవచ్చు ను
జ్జ్వలహిమధాముచేతఁ దనవక్త్రముకాంతికిఁ గాంతిపూరముల్
గలయఁగఁ దేర్చి త్రచ్చి యొడికంబుగఁ బుచ్చిన వెన్నకల్లుతోఁ
గలపి కరంచి క్రోలుటకుఁగా నిడికొన్న తెఱంగునం దగన్. 98

ఉ. ఈరమణీలలామవదనేందునిఁ జెంది పవిత్రయైన యి
వ్వారుణిఁ గాని పాయదు ధ్రువంబుగ నాత్మకలంక మంచు నిం
పార మునింగెఁ గాక యమృతాంశుఁడనన్ బ్రతిబింబచంద్రుఁ డొ
ప్పార నొకర్తు చేతిసముదంచితకాంచనపానపాత్రికన్. [ప్పె

తే. చషకమునఁ గామినీముఖచంద్రుఁడును సు, ధాంశుఁడును బింబితాంగులై యలరుటొ
నర్థిఁ దమలోనఁ జెలిమి చేయంగ శపథ,మునకు వరుణతనూజలోఁ మునిఁగినట్లు. 100

వ. ఆసమయంబున. 101

చ. ఎనసినరోగబీజమున నీరికలెత్తిన దర్పహాసముల్
ఘనతరశాఖలై యలమొగంబులఁ గెంపులు పల్లవచ్ఛవిన్
బనుపడ వాలుకన్గొనలఁ బర్వ మెఱుంగులు పుష్పలీలఁగాఁ
దనరె నితంబినీజనమదద్రుమరూఢిసురాంబుసేచనన్. 102

వ. ఇట్లు మదిరాపానమత్తలైనమత్తకాశినులయుద్వృత్తవిహారంబులు నుత్తమలావణ్య
సంస్కారంబులు నృత్తగీతవాద్యకళావిలాసంబులు గారవించుచు సాంద్రానందహృ
దయుండై పెద్దయుం బ్రొద్దు వినోదించి యందఱం బోవం బనిచి. 103

క. లలితోత్తరచ్ఛదంబగు, తలిమంబునఁ దాను హృదయదయితయు రాగా
కలసు ప్తిఁ బొందె గంగా,పులినగతాభ్రము మహేంద్రపురదంతి క్రియన్. 104

వ. అంత. 105

క. కలఁగాంచి యసురవల్లభు,కులభామిని మేలుకాంచి కుతుకాద్భుతసం
చలతాపరవశయై యా,కులభావము నొందె వెండికొండొకపడికిన్. 106

తే. పూర్వదేవవిభుండు ప్రబోధుఁడయ్యె, సతి నిజస్వప్నవృత్తంబు పతికిఁ జెప్ప
వెఱచి మతి నున్చికొనియుండె విచలమధుప,కేలిసుప్తపంకజముగునలినిపోలె. 107

ఉ. రాతిరియెల్ల జాతి ననురాగముతోడఁ గుముద్వతీరతిన్
బ్రీతి భజించి ఖేదమునఁ బ్రేయసియుక్ సొగియంగ దాన ను
ద్భూతపరిశ్రమార్తుఁడగుపోలికఁ జంద్రుఁడు పశ్చిమాబ్ధిక
ర్యాతలసుప్తికై డిగి యనల్పవిభావిరళాంగరాగుఁడై. 108

ఉ. చల్లనివాఁడు గావున నిశాకరు ప్రాపునదీప్తిలీలమై
నెల్లజగంబులు న్మిగిలి యిమ్ముల నుండితి మింతసెంతయుక్
జెల్లము తీవ్రమూర్తి యొరుతేజము సైఁపడు భానుఁ గూడి వ
ర్తిల్లఁగవచ్చునే యనుగతిన్ దివిచుక్కలడంగెఁ దోడుతోన్. 109

తే. అంచితోద్యానవాటిలనంనునవలి,భాతి విదళితకుసుమవిభాతి యమరె
నప్పుడరయంగఁ జంద్రునరాబ్ధివెల్లి, గొంకి చనఁ దోఁచునురువుతెట్టువలనంగ

సీ. వెడవెడమూతులువిచ్చుతామరలపై సుడిసి సెత్తావులుసూఱలాడి
యనుఁగుఁదోఁటలు చొచ్చియలరుతేనియఁజేసి యొలదేఁటిపదుపులఁజెలఁగి నడచి
రాయంచకవలనిద్రలు దెల్పి కొలఁకులఁ దరఁగయుయ్యాలయాట దగులుపతిచి
స్వోర్ణగండులు చొచ్చి సురతఖేదము నంటుఁజెలువలఁజెలువుర సేదదేర్చి

తే. యపరిగృహపతాకికలకు నాటగఱపి, ప్రోదినెమళులయొఅకలపొదులు విచ్చి
మందసంచారముగ సుకుమారమగుచు, మెఱసెఁ బ్రత్యూషసమయసమీరణంబు. 111

క. రవిరాఁకకుఁ బూర్వదిశా,యువతిగృహాంగణము కుంకుమోదకసేక
ప్రవిభాతమయ్యె ననఁగా, నవారుణోదయవిజృంభణము విలసిల్లెన్. 112

మ. సరసస్నేహఘనంబు లా యతదిశాసంసక్తముల్ కజ్జల
స్ఫురితోపాంతము లిష్టభూరివిషయంబుల్ కామినీనేత్రభా
సురరోచుల్ దమ నేఁడు ద్రెంచుకరణిన్ సుస్నిగ్ధరాగంబుతో
పరఁగంగా వెల వెల్లనయ్యె గృహదీపవ్రాతముల్ వేకువన్. 113

మ. అనిమంజులగీతులం బలుతరం గాలోలనాదంబులుం
విలసత్కీరలతాదికీర్ణ సుమనోవృష్టిప్రచారంబులుం

గలహంసీహసితానులాపములు నై గంభీరపద్మాకరం
బులు శోకద్వయసంగమోత్సవములం బొల్పారెఁ గాల్యంబులై. 114

వ. అంత. 115

మ. అనితరకాంతిఁ బద్మినిఁ బ్రియాతిలకంబు మొఱంగిపోయి రే
యొనసివ వేడ్కఁ నొందు దనయిచ్చమెయి న్విహరించి మేనజం
టినవరాగలీల జిగిదేరఁగ నోడి యొదింగి యొయ్యనో
య్యనఁ బొడచూపెనా నుదయమయ్యెఁ బతంగుఁడు ప్రాఙ్ముఖంబునన్. 116

సీ. కమనీయదిగ్వధూకర్ణపల్లవము లాకాశకింశుకకోరకప్రతతులు
వాసరవారణవదనసింధూరముల్ వనరుహకులమోద్వర్తనములు
కుముదినీనవతపఃక్రమవల్కలంబులు తిమిరాపహరణప్రదీపశిఖలు
త్రైలోక్యమందిరరత్నతోరణములు ప్రత్యూషనటరక్తపత్రకంబు

ఆ. లనఁగ నూతనంబులై కెంపులై సొంపు, లలర మణిమరీచు లతిశయిల్ల
నఖిలభువనమంజులాంజలిపుటపూజ్య, మానుఁడగుచు బాలభానుఁ డొప్పె. 117

వ. ఆసమయంబున నసురేశ్వరుండు విహితదినముఖవ్యాపారుండై యంతఃపురంబు వెలు
వడి యాస్థానభవనంబునకు వచ్చి సకలసురరిపుప్రకరంబులు పరివేష్టింప నభీష్టచేష్టి
తంబులఁ బ్రవర్తిల్లుచున్నయెడ భృగువంశవరుండును, దైత్యవంశగురుండును, నిజమం
త్రమహిమావధీరితశక్రుండును నగు శుక్రుండును జనుదెంచి హిరణ్యకశిపుం గాంచి
యతనిచేత నభినందితుండై వివిధాశీర్వాదంబుల నమ్మహావీరు నభినందితుం జేసి తదను
మతిం దదీయజీవితేశ్వరిని దీవింప నభ్యంతరమందిరంబునకుం జనిన 118

మ. గురురాకప్పుడు గాంచి సంభ్రమముఁ జక్కఁగ ప్రీతియుం భక్తిత
త్పరభావంబును నొప్ప నప్పుడు వెసం బద్మాక్షి ప్రత్యుద్గతా
దరసంసక్తి నమస్కరించె మహితోద్యత్పీఠవిన్యాసను
స్థిరసంపూజలొనర్చి తత్కృతశుభాశీరుక్తకల్యాణియై. 119

వ. తత్సమీపంబున సముచితాసనంబున నుండఁ గరకమలంబులు మొగిడ్చి యమ్మహాత్మున
కిట్లనియె 120

క. రే యొకకలఁ గాంచితి ముని,నాయక యే నది మదీయనాయకుమది యొ
ట్లై యుండఁ జేయునోయని, యాయనకెఱిఁగింపనైతి నాత్మ నుడిచితిన్. 121

క. దైవము గురుఁడును,బంధుఁడు, నేవిధమున మాకు మీర లీప్సితశుభస
ద్భావంబులుసతతంబును, గావింపఁగఁ గర్తలౌటఁ గవిజనవినుతా!. 122

సీ. అవధరింపుము జలదాసితవర్ణుఁడు ఘనశంఖచక్రలాంఛనభుజుండు
మహితకోమలవనమాలాసలక్షణవక్షుఁడు వికసితవారిజాక్షుఁ

డభినవపీతాంబరావృతదేహుండు భూదేవుఁ డొక్కఁ డపూర్వలీలఁ
జనుదెంచి ననుఁ జూచి సస్మితవదనుఁడై తనచేత నొప్పుసంతానఫలము

ఆ. నాకు నిచ్చి మున్ను నా మెడనున్నహా,రంబు నిజనఖాంకురములఁ దిగిచి
కొనుచు వేగ చనియె నని రాత్రి నేఁ గల,గంటి నపుడు మేలుకొంటి ననఘ. 123

వ. ఈనిఫలం బెయ్యది యానతీయవలయు ననినఁ గావ్యుఁడు కొండొక దలపోసి నిశ్చయించి యద్దైత్యరాజమహిషి కిట్లనియె. 124

ఉ. ఆధరణీసురోత్తముఁ డనాది యనంతుఁ డనంగ నొప్పుల
క్ష్మీధవుఁ డచ్యుతుం డతఁడు మేకొని నీకును బుత్త్రు నిచ్చె స
ద్బోధసమగ్రుఁడై పరఁగుపుణ్యుని నింతట సంతసిల్లు మే
లాధృతిదూలఁ బో మదిఁ దలంపఁగ మీఁదిశుభాశుభస్థితుల్. 125

ఉ. చీరికిఁ గైకొనం డసురసింహుఁడు దుర్వహగర్వబుద్ధి నె
వ్వారిని వారిజోదరు నవార్యభుజా న్మధుకైటభారిజం
భారిపురస్సరామరగణైకశరణ్యు వరేణ్యనక్తిని
స్తారకుఁ బేరుకొన్న మది నైపఁడు మేలిట యెట్లు గల్గెడున్. 126

క. నీమగని తేజమున ను,ద్దామశమసమగ్రుఁ డనఁగఁ దగి కుంపటిలోఁ
దామరమొలచినక్రియఁ ద,న్స్వమునివిభుఁ డైనసుతుఁడు నీ కుదయించున్. 127

క. నీవైనను మనమున జగ,దావాసుని వాసుదేవు నవ్యయు నెపుడున్
భావింపుము దుర్గతులం, బోవరు తద్భక్తజనులు పుణ్యవిచారా. 128

వ. అట్లైనఁ బురంధ్రరత్నంబవైన నీకతంబున నసురవంశంబు విధ్వంసంబు నొందక నిర్వహణంబు వడయునని భార్గవుఁడు చెప్పి యహ్లాదంతి వీడ్కొని నిజగృహంబు నకుం జనియె నంత. 129

క. కలఁగన్నయది యిత వనఁగ, నెలఁతకు నెల మసలె జగము నిఖిలంబును వే
రెలమిం బొందఁగఁ దగియెడు, నెల మసలం దెలవమూలు నెఱకొని బెలసెన్. 130

సీ. ఉదరస్థుఁ డగుబాలునుజ్వలకాంతినా వెలిఁ బేర్చె నన మేను వెలరువాఱెఁ
గడుపులో నొప్పారు కొడుకునిర్మలబుద్ధి తెలుప నఁ గనుఁగవ తెలుపువాఱె
గర్భశోభితుఁ డగునర్భకుసహజవిరక్తి నాఁ జవులయాసక్తి దొరఁగె
లోనున్నసుతునివిలోకవిజ్ఞానంబు క్రమము నా నాభి వికాసమొందెఁ

గీ. కుక్షిసంగతుఁ డగుపుత్త్రకునిగుణాలి, వొదలు తెఱఁగున మధ్యంబు పూర్ణమయ్యె
బూర్వజన్మసంచితతపఃపుణ్యఫలమ,హోదయంబునఁ జారుపయోజముఖికి. 131

క. చాలఁగ నమృతము బాలుఁడు, గ్రోలుటకై నినిచి కనకకుంభంబులపై
నీలపుఁగుప్పెను నిలిపిన, పోలికఁ జనుమొనలకప్పు పొలఁతికి నొప్పెన్. 132

గీ. అఖిలగుణరత్నములకు నాయతన మనఁగ, భువనభూషణంబన నొప్పు పుత్త్రుఁ దాల్చి
యున్న నాకేల తొడవులొండన్న కరణి, నబల గైసేయుపనులయం దలసయయ్యె. 133

చ. అనుపమయోగలీల నమృతాంబుధియందు శయించుదేవు నె
మ్మనమున నావహించి యసమానసమంచితయోగపుష్టిమై
నెనసినబాలుఁ జూలున వహించిన సంతతసద్గుణైకవా
సననా నిరంతరంబు గడుఁ జాపుకు జాడ్యము దోఁచుఁ జెయ్వులన్. 134

సీ. హరినామకీర్తనపరమోత్సవంబులఁ గావింప ననిశంబు గాంక్ష సేయు
విష్ణుదాసులఁ గని వేడ్క నంజలిచేసి కొనియాడి భక్తిమైఁ గొలువఁ గోరుఁ
బరమాత్మమహిమలు భావించి భావించి యానందజలధి నోలాడఁ దివురు
నారాయణునియవతారకథాసుధాలీలలు వీనులఁ గ్రోలఁ దలఁచుఁ

గీ. దనువు ప్రాణంబు నచ్యుతార్థంబుగా న, మర్పఁగా నెంచు జగములు మహితకరుణ
నెప్పుడు రక్షింపఁగా నుత్సహించుచెలువ, బుద్ధి యంతర్గతుం డగుపుత్త్రువలన. 135

వ. ఇట్లు ప్రతిదినప్రవర్ధమానగర్భలావణ్యలలితయైన హృదయేశ్వరిం గనుంగొని యసురేశ్వరుండు హర్షవికాసవిలసితాంతరంగుం డగుచుఁ బరమోత్సవంబున భార్గవనిరూపితప్రకారంబున గారవంబు మిగులఁ బుంసవనసీమంతాదికలాపంబులు నిర్వర్తించి యనంతరంబ సముచితసమయంబునందు. 136

సీ. అమృతాంబునిధిసముదంచితవీచిక నుదయించుతుహినమయూఖుఁ డనఁగఁ
జారుపురందరాశానితంబిని నుద్భవించుసరోజినీవిభుఁ డనంగ
విలసితరోహణాచలఖనిభూమికిఁ బ్రభవించుమహనీయరత్న మనఁగ
సుందరనూతనమందారలతికకు జనియించుసురుచిరస్తబక మనఁగఁ

గీ. గాంతియును తేజమును మహోన్నతయు సౌకు, మార్యమును నభిరామసామగ్రిఁ బొదలఁ
బుత్త్రుఁ డుదయించెఁ ద్రైలోక్యభూతికరుఁడు, రాజబింబాస్య యగుదైత్యరాజసతికి.

క. పుత్త్రోదయమున నిర్జర, జైత్రుఁడు మునుకొన్న యధికసమ్మదమున లో
కత్రయరాజ్యము మును నిర, మిత్త్రముగా గనినకంటె మిక్కిలి పొంగెన్. 138

సీ. పుష్పోపహారము ల్పొలుపారఁ బురమునఁ గావింపుఁ డనుమాటకంటె మొదల
మంగళవాదిత్రసాంగత్యభంగులు గలిగింపుఁ డనుమాటకంటె మొదల
భాసురవైజయంతీసహస్రంబులు గలిగింపుఁ డనుమాటకంటె మొదల
నిపుణవిలాసినీనివహసంచారంబు ఘటియింపుఁ డనుమాటకంటె మొదల

గీ. దివ్యకుసుమవర్షంబులు దేవదుందు, భిస్వనంబును నప్సరోభినయగతులు
కల్పభూరుహాంబరపతాకలు దనర్చె, భువనహితజన్ముఁ డగుఁబోలు భూరిమహిమ.

క. అవి యెల్లఁ గని సురద్విషుఁ, డవివేకమనస్కుఁ డగుచు నౌర మదీయో
త్సవమునకుఁ దగ నొనర్చిరి, దివిజులు పను లనుచుఁ దనమదిన్ బ్రియ మందెన్.

మ. ధరణీమండలి నెందునుం బరఁగి పాతాళంబునం బర్వి ని
ర్జరనాథప్రముఖామరాఖిలనివాసశ్రేణులం దోలి మై
నెరసెన్ బంకజసంభవాలయమునన్ నిండారె నవ్వేళ శ్రీ
కరదైతేయసుతనూభవోద్భవకథాకల్యాణ ముద్ఘోషమై. 141

క. శ్రీకాంతునగరులోనను, వైకుంఠపురంబు నిత్యవైభవములతో
నేకోత్సవ మయ్యె శుభ, శ్లోకుం డగుదైత్యరాజసుతుజన్మమునన్. 142

మ. స్వరసౌందర్య మెలర్ప మెల్లన శ్రుతుల్ సారించి యొయ్యొయ్య సు
స్థిరహర్షంబున యక్షకోటి తిలకించెన్ బూజ్యధర్మార్థమో
క్షరహస్యావలి యల్లనల్ల మెలఁగంగా నుత్సహించె న్నిరం
తరదైతేయభయం బొకించుక ప్రశాంతం బై నణంకెన్ దగన్. 143

చ. దినకరుఁ డుల్లసిల్లెఁ బటుదీప్తిఁ బ్రదక్షిణభాసురార్చులై
యనలము దేజరిల్లె మహిమాంచితసౌరభరమ్యలీలతో
ననిలుఁడు సంచరించె విపులాకృతి నంతయు నొప్పె దిక్కు లెం
దును భువనైకమంగళము దోఁచువిధంబు దలిర్ప నత్తఱిన్. 144

వ. దైత్యపతియును బుత్రోత్సవప్రమోదమానసుండగుచుఁ గవిప్రముఖభూసురలోకంబు నతిలోకఘననికహదానంబుల నానందహృదయులై యానందంబు నొందించి బంధుజనంబులు ప్రమోదంబు నొందం గుమారునకు జాతకర్మాదిసంస్కారంబులు గురునిర్దిష్టప్రకారంబున నిర్వర్తించిన నిజజన్మంబున నఖిలలోకప్రహ్లాదం బొనరించుటం జేసి బాలునకుఁ బ్రహ్లాదుం డనునామధేయం బొనరించె నంత. 145

గీ. అంబగర్భంబు వెడలినయది మొదలుగ, విష్ణుపదకమలధ్యానవివశుఁ డగుచు
నసురరాజతనూభవుఁ డమృతవృష్టిఁ, దనుపఁబడువాఁడ పోలె వర్ధనము నొందె.

సీ. పసిపాపఁడై తాను బవళించుకాలంబు వటపత్రశయనుభావంబు దెలుపుఁ
జెలువొందఁగా బోరగిల శయ్యఁ దడవెడుతఱి కూర్మమూర్తిఁ జిత్తమున నిలుపు
రెండుమూఁడడుగు లొండొంక తట్టాడునప్పుడు త్రివిక్రమలీలఁ బట్టిచూచు
లోలత వెన్నలు బాలు గ్రోలెడునాఁడు గోపాలసంస్మృతిఁ గూర్చు నాత్మఁ

ఆ. బరమపురుషభూతభావికథావ్యాప్తి, తారబోధమహిమఁ దగ నెఱింగి
యొం డెఱుంగఁ డంబుజోదరధ్యానత, త్పరత యొకటి కాని బాలకుండు. 147

చ. తొలితొలి ముల్లపాపములు దొక్కుచుఁ బల్కెడునట్టితియ్యపుం
బలుకుల నచ్యుతాహ్వయముఁ బల్కుఁ బేర్కొను వెండి పల్కు నిం
పెలయఁగ నంబ లక్ష్మి జగదేకజనేత ముకుంద యంచు న
త్యలఘుతరప్రబోధమనునాత్మగవాక్యవివేకదక్షుఁడై. 148

ఉ. ఆడఁగఁ బోయినప్పు డసురాత్మజుఁ డంబుజనాభు నవ్యయుం
బాడుద మాదిదేవుపదపంకజపూజలు సేసి భక్తిమై
నాడుద మచ్యుతైకశరణాగతులం గని కర్మబంధమున్
వీడుద మంచుఁ బల్కుఁ గడు విస్మయ మందఁగ దోడిబాలకుల్. 149

ఆ. కుడిచినపుడు నిద్రగూరినయప్పుడు, మేలుకొనినయపుడు మెలఁగినపుడు
విష్ణుకీర్తనంబు విష్ణుచింతయు కాని, పలుకఁ డొండు బుద్ధిఁ దలఁపఁ డొండు. 150

గీ. తొలుత మూఁడేండ్లలేని సద్బుద్ధి ముప్ప, దేండ్లతే దను నానుడి యిట్టిదనఁగఁ
దనరెఁ బ్రహ్లాదునకుఁ బ్రౌఢగుణములుగోరు, హితవివేకపాకంబు మూఁడేండ్లనాఁడె.

వ. అని యిట్లు ప్రహ్లాదుజన్మప్రకారంబు దేవశ్రవుచేత గాలవుం డెఱింగిన తెఱంగున
చతురమధురోపన్యాసంబుగాఁ బ్రకటించి వెండియు. 152

## ఆశ్వాసాంతము.

క. ప్రకృతిపురుషాపవర్తీ, వికృతికరణహరణనిపుణవిశదస్ఫూర్తీ
సుకృతసదయానుపూర్తీ, నికృతివిరథరామనిత్యనిరుపమమూర్తీ. 153

పృథ్వి. సమస్తమహిమాశ్రయా జనితసారలోకత్రయా
రమాకుచపరిష్క్రియా ప్రణతదాననిత్యోదయా
సమాహితమహోదయా సకలకల్మషవ్యత్యయా
సమగ్రవిసరద్దయా జనసుసేవ్యరాగప్రియా. 154

మాలిని. చరణజనితగంగా సత్యనిత్యప్రసంగా
జలదవిలసదంగా సౌమ్యచిత్తాబ్జభృంగా
విరచితభవభంగా వేదవేదాంతరంగా
పరమగరిమశృంగా బ్రహ్మనాడీతురంగా. 155

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్యధుర్య
శ్రీసూర్యకవిమిత్రసంభవశంభుదాసలక్షణాభిధేయ ఎఱ్ఱయనామధేయప్రణీతం
బైన శ్రీలక్ష్మీనృసింహావతారం బనుపురాణకథయందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# చ తు ర్థా శ్వా స ము.



కాంతాపరిరంభా

లోకాతిక్రమవివేకలోలుపలభ్యా

శ్రీకరనామస్మరణో

త్సేకదళితవినమదంహా శ్రీనరసింహా. 1

వ. దేవా రోమహర్షణుండు మహర్షుల కిట్లనియె నివ్విధంబున నాశ్చర్యభావుం డైన యమ్మహానుభావు చరిత్రంబులు భాషితంబులు నంత యెఱుంగని రాజసంబున నా దైత్యరాజు కేవలవాత్సల్యపరవశుం డై యబ్బాలు బాలోచితంబు లైన యుపలాలనంబుల గారవింపుచుండె. తల్లియుం గొడుకుచందంబులు డెందంబున కానందంబు నొందింప నిజస్వప్నదర్శనంబు తెఱంగును గురువాక్యప్రకారంబు తెఱంగును దలంచి వెక్కసంబందుచు నెయ్యది గానున్నదో యని వెఱ దలంచుచు పంకజోదరచరణస్మరణాలాలసంబగుమానసంబుతోడం బ్రవర్తిల్లెఁ దదనంతరంబ. 2

సీ. చౌలమౌంజీబంధసంస్కారములు యథాకాలకల్పితములుగా నొనర్చు
తేజోవిశేషసందీప్తుఁ డై యొప్పి యప్పాపఁడు జనకునిపంపునలన
విద్యాపరిగ్రహవినయదీక్షులకు నై పూజితగురుగృహంబున వసించి
దైత్యదానవకులోత్తంసంబు లగుతనయీడుబాలురతోడఁ గూడి చదువుఁ

ఆ. జదువుచుండఁ గొంత చనియె కాలం బంత, నొక్కనాఁడు దండ్రి యుల్లమలరఁ
గొడుకుచదువు వినఁగఁ గోరి కుమారునొ, జ్జలను గారవమునఁ బిలువఁ బంచె. 3

వ. ఇట్లు రావించిన నం జనుదెంచి మదిరాపానగోష్ఠీసమయంబున ననేకవిలాసినీపరివృతుండై యున్న జనకునింగని నమస్కరించి యుపాధ్యాయసహితంబుగా నంతంత నాసీనుండై యున్న పుత్రునకు నసురేశ్వరుం డిట్లనియె. 4

ఉ. పాపఁడ యింతకాలమును బాయక యొజ్జలయొద్దనుండి నీ
వేఁ గిదిఁ జఠించి తది యేర్పడఁ బ్రస్ఫురితార్థసార మై

తీపులు వీనులం గురియ దివ్యసుభాషితరత్న మొక్క టు
ద్దీపితధీవిజృంభణవిధేయతయొప్ప నుపన్యసింపుమా. 5

క. అనుటయుఁ బ్రహ్లాదుం డి, ట్లనియెను నీయానతిచ్చినట్టిద యయ్యా
వినిపించెద నాయది మె,చ్చినయర్థం బవధరింపు చిత్తప్రీతిన్. 6

సీ. ఆదియు మధ్యంబు నంత్యంబు నెవ్వాని కరయ లే దని చెప్పు నాగమములు
పొడమటయును లేక పొదలుటయును లేక తఱుఁగుటయును లేక తనరు నెవ్వఁ
డెవ్వనివలనన యొంతయు సంభవస్థానసమాహారదశలుఁ జెందుఁ
గారణంబులకెల్లకారణం బై యెవ్వఁ డపగతకారణుం డై వెలుంగు

ఆ. నమ్మహానుభావు నచ్యుతు నవికారు, నమితతేజు విష్ణు నాదిదేవు
నాశ్రయించినాఁడ నధిప యింతయు నిక, యితరమైన యర్థ మెఱుఁగ నేను. 7

చ. అన విని గుబ్బునం బొడమునల్కకు నెచ్చెలులై జనుంగవం
గనలెడుదంటకెంపున మొగంబునఁ బొడ్మెడుఘర్మజాలకం
బును నిటలంబునం దనరు భ్రూకుటియుం భయానకుం దనర్ప ని
ట్లను నతఁ డొజ్జఁ గన్గొని నిరంతరవిస్ఫురితాధరోష్ఠుఁ డై. 8

ఉ. అక్కట బ్రహ్మబంధువ దురాత్మక నాపగవానికీర్తనం
బెక్కడనుండి యీశిశువు నెప్పగిదిం జదివించి తిజ్జగం
బెక్కటి యేలు నామహిమ యేమియుఁ గైకొన కివ్విధంబునం
దక్కవపాటొనర్చితి వృథాపరిజల్పనకల్పనంబునన్. 9

వ. అనిన సురేశ్వరునకు నుపాధ్యాయుం డిట్లనియె. 10

చ. కినియకు దైత్యనాథ యొకకీడును నాదెస లేదు చెప్ప నీ
తనయుఁడు వక్రశీలుఁడు నితాంతనయోక్తుల యేను నెప్పఁగా
వినక నిజేచ్ఛమైఁ గడఁగి వేదుఱు నిట్లని యుగ్గడించు నీ
యనువున నిట్టికోరడపుటాటరి శిక్షల కేల చేపడున్. 11

వ. అనవుడు నతండు కుమారుం గనుంగొని. 12

క. ఓవత్స నీవుచెప్పిన, యీవిధ మేఁ జెప్ప ననియె నివె యొజ్జలు నీ
కేవాఁడు గఱపె నేర్పడఁ, గా వెఱవక చెప్పు మట్టిఖలు దండింతున్. 13

ఉ. నావుడు దైత్యరాజకులనందనుఁ డిట్లను సర్వభూతస
ద్భావములందు నుండి పనుపం గఱపంగఁ బ్రభుం డొకండు మా
దేవుఁడు వాసుదేవుఁడు సుధీసువిధేయుఁడు చిత్సుఖోదయ
శ్రీవరుఁ డింతకంటె మఱి చెప్పఁగలండె ప్రశాస్త్రి యొవ్వఁడున్. 14

ఆ. అనిన మండిపడి సురారి దురాత్మక, యేను జగములెల్ల నేలువాఁడ
విష్ణుఁడనఁగఁ గలఁడు వేఱొకం డనియెద, వేల చెడితి రోరి యెవ్వఁ డతఁడు. 15

చ. అనుటయు నల్ల నవ్వి కొడు కయ్యకు నిట్లను నెవ్వఁ డన్న నే
మని తెలుపంగవచ్చుఁ బరమాత్ముని నాతఁడ యీసమస్తమున్
వినుము తదేకహేతుకము విశ్వము శాశ్వత మైనతత్పదం
బనిశము పుణ్యశీలురు నిజానుభవంబునఁ గాంతు రేర్పడన్. 16

వ. అప్పరమేశ్వరుండు శబ్దగోచరుండు గాఁ డనిన నతండే సకలలోకపరమేశ్వరుండై యుండ నారయెదురం బరమేశ్వరుండు పరమేశ్వరుఁ డని పరుని పలుమారు నుదాహరించెద వోరి చావం దలంచితి వేల యనవుడు ప్రహ్లాదుండు 17

గీ. నాకకాదు లోకములకు నీకుఁ బ్రభుఁడు, వినుము పరమేశ్వరుం డనువిష్ణుఁ డొకఁడ
ధాతయును విధాతయును నతండ యండు, వలుకవిడుము శాంతుఁడవగుమయ్య తండ్రి.

క. నావుడు హిరణ్యకశిపుం, డీవెడగుదనంబుభూత మెయ్యదిరా యి
ట్లావేశించెం గా కితఁ, డీవిధమున నేల యఱచు నిటు ప్రల్లదముల్. 19

వ. అనినఁ బ్రహ్లాదుం డి ట్లనియె. 20

ఉ. నామన మొక్కఁడేల దితినందన సర్వము నావహింపఁ దే
జోమహిమన్ వెలుంగు హరి చోద్యపుభూత మతండు లీలనై
వేమఱు నిన్ను నన్నుఁ బెఱ విశ్వచరాచరభూతజాతమున్
భ్రామకుఁ డై నిజోచితవిభావితచేష్టలఁ గూర్చు నెప్పుడున్. 21

వ. ఇది తదావేశవిశేషంబుగాని వికారకార్యంబుగా దనిన దనుజేశ్వరుండు పరిచరవర్తులం జూచి వీనిం గొనిపోయి గురుగృహంబున ద్రోచి రండు విపక్షసంస్తరాకారంబయిన చేతోవికారంబు చక్కనగునంతదాఁకనుం దగినయుపాయంబుల శాసింపవలయు ననిన నయ్యసుర లయ్యసురరాజకుమారుం గొనిపోయి యుపాధ్యాయసదనంబున నునిచిరుపాధ్యాయుండును బ్రభుశాసనంబున నతని శిక్షించుచుండె నంతఁ గొంతకాలంబుసనినఁ గొడుకుం బిలిపించి తండ్రి యొప్పటియట్ల యొక్క సుభాషితంబుఁ జదువు మని పంచిన నతండు. 22

క. ప్రకృతిపురుషాత్మకంబును, సకలచరాచరవిశేషసర్గము నెవ్వా
నికిఁ గార్యం బవ్విష్ణుని, వికారవిరహితు సమస్తవిభుఁ బ్రణుతింతున్. 23

క. అనినఁ గడుఁ గడిఁదియై మదిఁ, గనలు నిగుడఁ బుత్రభావకలితస్నేహం
బును గృపయుఁ బాయ సురరిపుఁ, డనుచరులం జూచి యిట్టు లను రభసమునన్.

క. కులమునకు గొప్పగుద్దలి, ఖలుఁడు కులాంగారకంబు కష్టుఁడు వీనిం
బొలియింపుఁడు ఘనశస్త్రం, బుల వెస నొక గుడ్డమునికి బోయేమి యగున్. 25

ఆ. కొడుకు తండ్రిమాటఁ గొనక యీరసమున, నపచునేని వాఁడు కడిఁదిదాయ
గాన పగతుఁ జంపఁ గాఁ దగుఁ బగవాని, పక్షమైనవారు పగఱె కారె. 26

వ. కావున నేను చూచుచుండ వీని నిప్పుడ యలుఁగులపాలు సేయుం డని పంచిన శతస హస్రసంఖ్యు లంతకాకారు లగు క్రూరు లక్కుమారుం బొదివి కొదమసింగంబుఁ గను భంగంబుగాఁ గూడినసారమేయంబులచందంబునఁ బ్రచండశస్త్రంబుల నుగ్రకర్మంబులకు సముకట్టుసమయంబున. 27

సీ. ఏలయొద్దారించె నీపాపఁ డిటుపాప మడసెఁ గటా యని యడలువారు
తల్లియైనను నాకుఁ దనయుతోడిద యని పూని యాడద యని పొక్కువారు
కావ్యుఁ డైనను వచ్చి కాదు కూడ దనంగ వలదె యిత్తఱి నని వనరువారు
హరియైనఁ బొడసూపి కరుణమై బాలకు కిలుకు మాన్పఁడ యని మొఱలువారు
ఆ. నగుచు సాధుజనము లంతంతఁ జేష్టలు, దక్కి మ్రగ్గి కలఁగి తలఁగి యొదుగ
నమరవైరిబంధు లాదిదేవునిబంటుఁ, గదిసి పొదువ నడుమఁ గడఁగి రపుడు. 28

గీ. అక్కుమారుఁడు మహితసమాధినిష్ఠుఁ, డై మహోగ్రశస్త్రావలియందు నసుర
లంపఁ దనయందు వెలుఁగుసర్వాత్ము విష్ణుఁ, గనుచు నుండె నిశ్చలనిర్వికారలీల. 29

వ. అంత. 30

చ. అనుపమమేరుభూధరతటాదికనిష్ఠురవత్తు వజ్రసం
హననుఁ గుమారుఁ జెంది యసురాధమకింకరనిర్విశంకపా
తనరకదస్త్రశస్త్రములు వందడిఁ దుత్తుమురై మహీతలం
బున దొరఁగెన్ మహోత్పలసముజ్జ్వలనూత్నదళంబులో యనన్. 31

క. అది యట్లు కాదె నిప్పునఁ, జెదలంటునె దేవదేవు శ్రీరమణీశున్
మది నునిచినయుత్తమునిఁ, బొదవునె యాపదలు సూర్యుఁ బొందునె తమముల్.

వ. ఇట్లు నిరపాయనిత్యోద్దీప్తప్రకాయుండును నతర్క్యతోపాయుండును సహజసముజ్జ్వలోల్లాసుండును నగువిష్ణుదాసుం జూచి యాచపలుండు క్రోధనిరోధంబుఁ బాపికొననేరక యిట్లనియె. 33

ఆ. ఓరి పగఱఁ బొగడుపోరామి యేమిరా, యీతలంపు విడువు మింకనైనఁ
బ్రాణభయమువలనఁ బాపి ప్రోచెద నాదు, బుద్ధి వినర యనధిఁ బోవ నేల. 34

వ. అనినఁ బ్రహ్లాదుండు మహాహ్లాదమధురోపన్యాసంబున నహ్వాసవారి కిట్లనియె. 35

చ. భయముల నెల్లఁ బాపుటకుఁ బాల్పడినాఁడు పయోరుహాక్షుఁ డ
క్షయుఁ డచలుం డనంతుఁ డనిశంబును నామదిలోన నుండఁగా
భయ మొక యెందునుం గలదె పంకరుహోదరపాదపంకజా
శ్రయులకుఁ దండ్రి పుట్టువు జరామరణాదిభయంబు లేమియున్. 36

ఆ. అనిన నొడుగలచి యసురద్విషుం డోరి, పడుచ నాకుఁ బుట్టి చెడుగవైతి
పేర్చి నోరుమూయు పెడతలవాపోయె, దట్టి వదర గలఁడె యెచట నైన. 37

క. సర్వంబును విష్ణుం డగు, సర్వము సృజియించి పెట్టి జగ మావిష్ణుం
డోర్వఁగ వచ్చును విష్ణుఁడ, సర్వేశ్వరుఁ డంటి యీ యసత్యోక్తులకున్. 38

క. నోరెత్తి తేని యింకను, సైరింపఁ జుమీ దురాత్మ! చలమున నిదె నా
గోరంపుటుక్కు గదఁ గొని, బోయవఁ దల ప్రయ్య నడచి పోరిగొని విడుతున్.

వ. అనిపలికి తత్క్షణంబ తక్షకప్రభృతు లగుభీషణభుజంగంబులం బిలిచి విషతుల్యభాషణుండును విషమాచరుండును నగునక్కులదూషకుని దుర్విషానలజ్వాలాజాలంబులం బ్రేలిపడఁ బొదువుం డని పనిచిన. 40

సీ. కన్నులఁ జాఱజాఱ గ్రమ్ముమంటలతోడ మండెడుఘనఫణామణులతోడఁ
బొరల దేహమున నిబ్బరపుగ్రొంపులతోడ లోలత గ్రాలునాలుకలతోడఁ
బొదలెడు నాభీలఫూత్కారములతోడ నొదవునిక్కలబెక్కు నొడలితోడ
మెఱయునోళ్లను వెలికుఱుకుదౌడలతోడ భుగులనుగ్రంపుఁ బొడలతోడఁ

ఆ. పాపపగుపఁ బడరి పట్టి పాలకుఁ జుట్టి, నెఱకులెల్ల బిట్టు గఱచి కఱచి
విసము చల్లి చల్లి మిసిమింతుఁడును గాక, యున్న యతనిఁ జూచి యుక్కు దక్కి.

వ. దైత్యేశ్వరున కిట్లనిరి. 42

చ. కఱచితి మెయ్యెడన్ విసముఁ గ్రక్కితి మీతనియందు నెట్టిమా
కఱచినకాట్లకున్ శిశువుకాయము తోలుచు ప్రుక్కదయ్యె మా
కటిమటి నూడిపోయె మణులాదఁటలుం దుముర య్యె దంష్ట్రికల్
పటపటయయ్యె నోరు లధిపా నవియంగఁ దొణంగె నంగముల్. 43

క. హరిహరి యంచు నితం డిదె, గిరివోలెం దెరలఁ డితనికిని బరిపీడా
కరు లగునన్యులు గలిగిన, నరసి పనుపు దేవ! యరిగె నస్మద్బలమున్. 44

వ. అనుచున్న పన్నగనివహంబులవివశత్వం బుపలక్షించి యక్షతుం డైనయమ్మహాత్ముశీలు నీక్షించి సంక్షుభితహృదయుం డగుచు నయ్యదయుండు బృందారకద్వారబృందంబులం బిలిచి వీఁడు మదీయపక్షంబువాఁడై మాకులంబునకు నపకారంబుఁ గావింపం గడంగె. నాపుత్త్రుండని విచారింపవలదు. తరువునం దోఁచికాడె దహనుండు తరుసముదయంబులం బొడ వణంచుం గావున వీని మీరు తీవ్రదంతాభిఘాతంబులం జించి వెంబడి నాకుం బ్రియంబు సేయుం డని నియోగించిన 45

సీ. తఱఁగలై తొరఁగెడుదానధారలచేత నురునిర్ఝరస్ఫారగిరులు వోలె
దారుణోత్కటశాతదంతకాండములచే ఘనదండధరుచెలికాండ్రు వోలె
నెఱమంటలుమియుచు నెసఁగుచూడ్కులచేతఁ బ్రళయాగ్నిమూర్త్యంతరములు వోలె
వలఁతులై నిగిడెడివలుదతుండములచే నొదరి చేచాచుమృత్యువులు వోలె

ఆ. కింక లంకరింప జంకెలు నర్తింప, బింకె బొసఁగ నిర్విశంకసరణి
నడరి దిగ్గజంబు లమ్మహాభాగునిఁ, బొదివి పొడువ నడుమ నదుమఁ దొడఁగె. 46

వ. ఇవ్విధంబున నవ్వేదండంబు లొండొండ చండక్రీడఁ గోడాడుచుండం బుండరీకాక్షుసాక్షాత్కారంబున సొంపారుడెందంబున నానందనిశ్చలుం డై యచలంబునుం బోలెఁ బోలుచు బాలునిదృఢదేహంబు సోఁకె. 47

క. సురకుంజరములకొమ్ములు, మురిసెన్ దొండములు విరిసె మోములు విరిసెన్
బోరఁబోరి నఖిలాంగంబులు, నెరసెన్ జిత్తంబు లురిసె నిరిసె జగంబుల్. 48

వ. అప్పుడు ప్రహ్లాదుండు తండ్రిం జూచి యయ్యా! యిది మదీయహృదయస్థుండైన యచ్యుతుమాహాత్మ్యంబు గాని నాలావు గాదు కాని నాకుఁ గులిశకఠోరంబులగు దిగ్వారణదంతప్రహారంబులు సైరించుశరీరంబు లెక్కఁడివి యని యూరకుండె నంత. 49

ఉ. ఆవిధ మంతయుం గని సురాహితుఁ డంతట నైనఁ దెల్విఁ గిం
దా నలమానరోషమునఁ దద్దయు మేను వడంక నింక నొం
డేవియుఁ గావు తీవ్రబహుళేంధనదీప్తకృశానుకీలలన్
ద్రోవుడు వీని నంచుఁ గడుదుష్టమనస్కులఁ బంచెఁ బల్వురన్. 50

వ. పనుచుటయు వారు వారితరభసంబున భూరితరదారుసంచయం బొనరించి యనలంబు దరికొల్పుటయు ననిలుం డసురపతిపనుపున నయ్యగ్నిఁ బ్రజ్వరిల్లం జేసె నప్పాపనిం బాపాత్ములు దీపితదహనంబునం ద్రోచినం బడి ప్రహ్లాదుండు మేచకజ్వలనజ్వాలాకలాపదందహ్యమానుండగుచు నుండియు నఖండజలధరధారాసిచ్యమానాంగుండు గావున వేఁడిమిం గందక మందస్మితాననుం డై దానవేశ్వరున కిట్లనియె. 51

ఉ. శౌరిపదాంబుజస్మృతిరసంబునఁ దేలెడు నామనంబు తం
డ్రీ రుచియింప దన్యముఁ గడిందిగ నీ వొనరించినట్టియి
ద్దారుణవహ్నియున్ వినుము తామరసాకర మయ్యె నాకుఁ బ్ర
స్ఫారితవీచు లీశిఖలు చల్లనితుప్పర విస్ఫులింగముల్. 52

వ. అనియె నప్పుడు సంభృతరోషమాత్సర్యవిహ్వలుం డగుచున్న యాహిరణ్యకశిపుం గదిసి భార్గవనందనులు కొందఱు తదీయపురోహితులు గావున హితంబుఁ జెప్పవలయువారై సామవచనంబుల నతని కిట్లనిరి. 53

చ. మును మునఁ బుట్టినీ కకట ముద్దులపట్టి గదయ్య వీఁడు మె
త్తనియొడలింత యోర్చెనె కృతంబుల సైఁచునె మాను మింతతోఁ
గినుకలు నీవు గట్టలుక కీడొనరింపఁగఁ బొందఁజాలువా
రనిమిషసిద్ధయక్షఖచరాదులు గాక తనూజుఁడే నృపా!. 54

క. బాలత్వ మెల్ల కీళ్లను, నాలయ మట్లగుట వినియు నజ్ఞానము గ
న్పైపై లొచ్చునవఁగఁ గోపం, బేలా నీ యంతవారి కిప్పుడుచుపయిన్. 55

గీ. అవధరింపుము మాపంత మధిప యేము, పదల కీబాలు శిక్షించువార మింక
నొమ్మ నొయ్యనఁ దెలివికి నోజపఱచి, వెఱ్ఱి దెప్పుము మాటలు వేయునేల. 56

క. ఈతనికి విష్ణుదెసఁగల, ప్రీతి విడువఁ దెలుపు మెంత పెద్ద యధికరో
సాతురుఁడై యితఁ డతనివి, ఘాతింపను గడఁగు బుద్ధి గఱపెద మోలిన్. 57

ఉ. మావచనంబుల న్వినక మాధవుపైఁ గలపక్షపాతమున్
ప్రోవఁగఁ ద్రోన కిట్లయయి పోయిన నీ వటుచూచి మెచ్చఁ గ్రో
ధావలి యైనకృత్యఁ గడు నద్భుతభంగి సృజించి పంతు మీ
కావలమంతతోడగనుఁ గష్టపుఁబాట్లను దైత్యపుంగవా. 58

వ. అనిన నట్లు చేయుం డనుదైత్యపతిపనుపున నతనిబంట్లు మంటలోనున్న పిన్నాతనివెడ లందిగిచి భార్గవాత్మజుల కొప్పించిన వారునుం గొనిపోయి తమయింటం బెట్టుకొని బాలురం గొందఱ సంగడంబు గూర్చి చదివించుచు బుద్ధులు సెప్పుచుం దెలుపుచు బుజ్జగించుచుం దట్టించుచు ననేక ప్రకారంబుల శిక్షించుచుండ నక్షోభ్యస్వభావుం డగునప్పుణ్యభావుం డొక్కొక్కతఱి నెడగాని తనతోడం జదువుదానవదైత్యకు మారుల కిట్లని యుపదేశించు. 59

క. వినరయ్య యేను జెప్పెద, ననుపమతత్త్వార్థ మైన యాత్మహితంబున్
మనమున మాకొక్కొయి, ట్లని చెప్పెఁడు నిప్పు డీతఁ డని చూడకుఁడీ. 60

ఆ. పుట్టుఁ బెరుఁగుఁ బ్రాయములఁ జాలఁ జెన్నొందు, ముదిమిచేతఁ జిక్కుఁ బిదపఁ జచ్చుఁ
బురుషుఁ డట్టిదెసలఁ బొందు టదృష్టంబ, యిందు లేదు గాదె సందియంబు. 61

క. చచ్చినజీవుఁడు గ్రమ్మఱ, వచ్చున్ బుట్టువున కను టుపాయము గాదీ
యచ్చుమునులు శ్రుతిజలములఁ, దచ్చికనిన తెలివి గాన తప్పన దదియున్. 62

ఆ. కారణంబు లేక గలుగదు జన్మంబు, కారణం బపూర్వకర్మఫలము
కాన యుక్తియుక్త మైనది యిదియుఁ బ్ర, త్యక్ష మెట్ల యట్ల యనఘులార. 63

క. తలపోయఁ దల్లికడుపున, నొలసి చనరు గొంతకాల మునికియు లోకం
బుల కెల్ల దృష్టమ త్తెఱిఁ, గలుగు నిరోధంబు శాంతిఁ గైకొన బోసఁగున్. 64

వ. అది యెట్టిదనిన. 65

గీ. ఆఁకలియు నీరువట్టు నయ్యె వెరవుల, నడఁచు దాఁక సౌఖ్యముఁ జాతురత్వబుద్ధు
లెప్పుడు నాఱనిచిచ్చుతో నిడుమఁబడుట, గరము దుఃఖంబు గాక సుఖంబె చెప్పుఁడ.

క. పెల్లగు నాఁకట నన్నము, చల్లని నీ రగ్నివెన్క సౌఖ్యదములు నాఁ
జెల్లునవి కాకయుండిన, నెల్లపగిది నివియ దుఃఖహేతువులు దగన్. 67

క. మదురవుగొని యొడ లెఱుఁగక, మదాకులమనస్కుఁ డయిన మానవునను విం
పొదవినఁ బిడికిళ్లం గొని, చదియఁ బొడుచు నేని యదియు సౌఖ్యం బగు నే. 68

క. కావునఁ గేవలసుఖదం, బేవస్తువు లేమ వినరె యిది సంసృతి నై
యేవిధ సుఖదము దుఃఖద, మై వెస దుఃఖమును సుఖద మై తిరుగఁబడున్. 69

చ. మృగమదచందనాద్యుపమేయసుఖోచితసారవస్తువుల్
దగఁ గఫవాతపైత్యకలితం బగుకీడులప్రోక రైన యా
యగుణశరీరముం గదిసినంతన దుష్టతఁ బొందుఁ మేలుఁ గీ
డుగ నొనరించు నీమతికిఁ డొక్కఁ మనంబున నమ్మఁ బాడియే. 70

క. ఎంత ప్రియవస్తువులపై, నంతఃకరణంబు గలుగు నది మీఁదట న
త్యంతం బగుసంతాపం, బంతయుఁ గూర్పఁగ నిమిత్తమగుఁ బురుషునకున్. 71

ఆ. ఆలు బిడ్డ లిండ్లు నర్థంబుఁ జెలులును, బ్రోపు గూడఁ బెట్టి పొదలుకుమతి
యవియు పిదపఁ జెడఁగ నన్నింటిఁ దగిలిన, మనసు నుడుపలేక మడిసిపోవు. 72

ఉ. ఏపున నెమ్మియుం బొదలు నీభవవారిధి నిస్తరింపఁగాఁ
దేపరయంగ వేఱొకటి దెల్లము చెప్పఁగ లేఁడు చెప్పెదన్
నాపలు కాత్మ నిక్కముగ నమ్ముఁడు విష్ణు ననంతు నాద్యుల
క్ష్మీపతిఁ గొల్వుఁ డవ్విభుఁడు చేకొని కాచు నిజైకచిత్తులన్. 73

క. చెడిపోవఁడు సంసారముఁ, గడతేర్పఁడు శౌరిచరణకమలము నెడఁదన్
ఇడికొనుఁ డూరక కాలము, కడపకుఁడి వివేకవీథిఁ గనుఁగుఁడు నడపన్. 74

సీ. బాలుఁడ నేనిప్డు బాలోచితక్రీడ లనుభవించెద మఱి యౌవనమున
నెఱవాది నై ధర్మ మెఱిఁగి చేసెదఁ గాక యని పోవు నటపోయి యౌవనమున
సుఖములచవిచొక్కఁ జొక్కి యున్నది గదా ముదిమి ధర్మము నెల్లనొదునఁ జేయ
నని చనుఁ జని వృద్ధుఁ డై యౌవనమునంద జెన్నొందు ధర్మంబు చేయనైతి
గీ. నేమిసేయుదుఁ గాలుచేయించుకయును, వశము గాదు చిత్తంబు తామసము గప్పె
ననుచు నట తాను బొలియు నట్లాత్మహితము, సేయునబ్బదెప్పుడుమూఢచేతసునకు.

ఉ. కావున శైశవంబునన కష్టతరం బగు మోహ మింతయున్
బోవఁగ ద్రోచి విష్ణుమయపుణ్యసమానతతత్త్వచింతకున్
డేవలయున్ మనంబు సుగతిప్రద మివ్వెర విట్లు సేయుఁడా
భావన నన్య ముల్లమునఁ బట్టఁగ నీకుఁడు భక్తియుక్తులై. 76

చ. అలజడి లేమ చిత్తమున కంగములందుఁ బ్రయత్న మేమియున్
వలవదు నిశ్చలత్వము నవారితబోధము లోనుగా శుభం
బులు సమకూరఁ జేయఁ లఁతి పుణ్యపదంబు ముకుందసంస్మృతిన్
గలది యొకింత యేనియును గానితెఱం గటు సూచుఁడా మదిన్. 77

వ. మఱియు నొక్కటి చెప్పెద. 73

చ. జలరుహలోచనుం డకయ సర్వశరీరములందు నాత్మయై
యొలసినవాఁడు గావునఁ దదూర్జితభక్తి రమించువారి క

గ్గలముగ సర్వభూతదయ గాదిలి గావలయుఁ జూడ్కి విని
ర్మలసమబుద్ధి యి ట్లొదవ సర్వవిపద్విళనంబు దా నగున్. 79

గీ. అరయఁ దాపత్రయాహితం బఖిలజగము, నిట్టిపుట్టినఁ గొదవల నెరియుచున్న
జీవులకు నొక్కకీడును సేయఁదగునె, చనదె దుఃఖశీలురదెసఁ గనికరంబు. 80

చ. తన కరయంగ వేఱొకటి తక్కుజంతువు గల్గ నేనిఁ ద
త్తనువున కెగ్గు సేయమి గదా తగు నన్యశరీర మెక్కుడై
యనయము దానహీనుఁ డగునట్టిద యైనను మేలె వైర మే
యనువున భూతమైత్రియ యపాయము లేనియుపాయ మాత్మకున్. 81

క. వైరంబున భూతంబులఁ, గారించుదురాత్ము మాఱు గావించుఁ గడున్
వైరంబున భూతంబులు, ధీరుల కిది తెలియుఁ గుమతి తెలియం డెపుడున్. 82

గీ. మనమునను దుస్స్వభావసంజనిత యైన, భేదబుద్ధి దొఱంగి యఖిన్నుఁ డైన
విష్ణు నఖిలభావములందు వెదకి కాంచి, యనఘులార పొందుడ మనయముసుఖంబు.

సీ. అనలునిచేఁ గాల దక్కనిచేఁ గ్రాఁగద మృతాంశుచేత శైత్యమునఁ బడదు
పవనుచే నివురదు పర్జన్యవరుణులచే వృద్ధి పొందదు సిద్ధయక్ష
గరుడోరగామరగంధర్వకిన్నరవరపన్నగాదులచేత నాశవృద్ధు
లొందదు గుల్మమహోదరాదికరోగతతిచేత నుడియదు దంభలోభ

గీ. మత్సరాదుల నలయదు మహిమమహిత, మేపదంబు మహాయోగిహృదయగమ్య
మట్టియానందతత్త్వంబు ననుభవించు, హరిసమర్పితమానసుం డగుబుధుండు 84

వ. అని యనేకప్రకారంబుల వివరింపుచుండ విని తమమనంబులం దలంచి దైత్యబా
లురు దైత్యపాలికిం జని యవ్విధం బంతయుఁ జెప్పిన నలిగి యతండు. 85

ఆ. తాను చెడుట గాక తక్కినవారిని, జెఱుపఁ జూచె నౌర గొఱకుఁ బడుచు
వీని నెట్లయైన విసునక పాలింప, వలయు నేమి వెరవు గలదొ యింక. 86

వ. అని తలంచి వంటలవారిం బిలిచి దుర్మార్గదర్శనుండును దురాత్ముండును నగుప్రహ్లాదుం
డు మత్పుత్రుం డని యనుమానింపక మీరు రహస్యయత్నంబున వీనికి భక్ష్యభో
జ్యాదులయందు హాలాహలాభిధానం బగుమహావిషంబుఁ బ్రయోగింపుఁ డని పనిచి
నం జని వారును బ్రభుశాసనంబుఁ జేసిన 87

చ. అమృతు ననంతు నచ్యుతుని నాత్మఁ దిరంబుగ నున్చి నిత్యబో
ధమునఁ గరంగునప్పరమధార్మికుఁ డింపుగ నారగించున
య్యమితహాలాహలాద్భుతవిషానలసంచయభక్షణంబునం
దమృతముకంటెఁ బ్రీతికర మయ్యెఁ దదంతరబాహ్యచేష్టలన్. 88

క. విషమచరితుండు బాలుఁడు, విషాహరణమునను జాల వెలుఁ గొందె మహా
విషనిధిజనితవిశృంఖల, విషానలము మ్రింగి పొంగువిభుమాత్మక్రియన్. 89

వ. ఇట్లు విషాన్నంబుఁ బ్రయోగించి నిర్వికారుం డైయున్న యక్కుమారునిం జూచి సూపకారులు లోకాపకారియగుదివిజవైరిపాలికిం బోయి తమచేసినపనియు నమ్మగుటయునుం జెప్పినయప్పుడమ్మొఱకుండు పురోహితులం బిలిపించి మీరు మునుప్రతిజ్ఞ చేసినవారు కారె? ఈ ప్రహ్లాదుం డనుదురాత్ముం బొరిగొనుకృత్యను త్పాదించునది యనినని య్యకొని పోయి వారు ప్రహ్లాదునకుం దొలుత సామపూర్వకంబుగా నిట్లనిరి.

ఉ. అన్న! త్రిలోకపూజ్యుఁ డగునంబుజగర్భునియన్వయంబునం
దున్నతిఁ బుట్టి తా గొలఁదియో యిట యెక్కుడు చూడు తండ్రి పెం
పెన్ని తెఱంగులం జలము నేటికిఁ బెద్దలపంపుఁ జేయుమా
నిన్ను నుతించు లోకములు నీకు నపాయము లేక యుండినన్. 91

క. హరి గోవిందుఁ డనంతుఁడు, పురుషోత్తముఁ డనుచు నేల పొగడెదు చెపుమా
యరుల నుతించిన సైఁతురె, నరపతు లిది మానవే జనస్తుత! యింకన్. 92

గీ. ఇట్టితండ్రికడుపునను బుట్టి నీకు, నొరులఁ జేరి నేల యితనియుల్లమునకు
వచ్చుతెఱఁగున మెలఁగెడువాఁడ వైన, నితనిరాజ్యంబు నీదకా కెవ్వరి దగు. 93

క. గురుఁ డనఁగఁ దండ్రి కంటెను, నరసి యొకనిఁ జదివి చెప్పుమా శ్రుతిధర్మం
బురులక్ ద్రోవఁగ నగు విన, గురుశాసన ముజ్జగించి కుటిలపుఁదెలివిన్. 94

క. దేవుండు వాసుదేవుఁడు, దేవోత్తముఁ డంచు నేల దేవవ సెడితో
దేవుఁడు గీవుఁడు దక్కన, దేవతలును నెంతవారు దితిసూనునకున్. 95

వ. ఇంతకు మిక్కిలి చెప్పనేర మిటమీఁద నీన యెఱుంగుదు వనినఁ బ్రహ్లాదుం డప్పురోహితుల కిట్లనియె. 96

సీ. మీరు చెప్పినయట్లు మేదినీసురకులంబునఁ బుట్టెఁ దండ్రిపంపున ఘనంబు
జనకుఁ డెక్కుడు గురుజనముల కెల్లను నతనిశాసనము సేయంగవలయు
నీతగ వింతయు నెఱుఁగనివాఁడఁ గా నదియు నట్లుండె మీ రరయ మాను
నాచార్యులరు మిమ్ము నతకరించుట దోస మైనను నొకమాట యాడవలసె

గీ. వాసుదేవసంస్తుతి సేయ వలవ దనిన, శక్తితో క్తి మీకిట్లు వాక్రువ్వఁ దగునె
చదువరే యెఱుఁగరే మీరు చదివి యెఱిఁగి, వినినయాథ్యులనడపడి వినరెతలఁగి.

వ. ఇట్టిమాటలు మీకే యొప్పునని చిఱునవ్వునవ్వి యశ్బాలుం డావృద్ధులంగనుఁగొని వెండియు. 98

క. కినగినబడి యించుక మీ, తనయునివిన్నపము వినఁగఁ దగ దని బాల్యం
బునఁ గదిరినచాపలమున, మనమునఁ దోఁచినటు లాడుమాటలు సుండీ. 99

సీ. మనకంటెఁ బెద్దలు ఘనబోధనీయులు దక్షాదులును వసిష్ఠాదు లవల
నత్రిపులస్త్యాదు లట మఱి వ్యాసులు వెట్టలై కొలిచిరె విష్ణుదేవుఁ

కొందఱు ధర్మంబుఁ గోరి భజింపంగఁ గొంద ఱర్థము మఱిఁ గోరి కొలువఁ
కొందఱు కామంబుఁ గోరి సేవింపంగఁ గొందఱు మోక్షంబుఁ గోరి తెలుప
ఆ నిందఱును సేవ్యుఁ డేవేలు పొక్కఁ డవ్వఁ, డాత్ముఁ డజుఁ డనంతుఁ డప్రమేయుఁ
డచ్యుతుఁడు పురాణుఁ డనునొక్కరుఁడు గాక, వెండి దైవమునఁగ నొండుగలఁడె.

క జ్ఞానము సిరి యున్నతి సం, తానం బైశ్వర్య మధికధనము మఱియు నే
మేనియు నిలసిన బెఱవెల, నైనఁ గలదె హరిపదాంబుజార్చనదక్కన్. 101

ఉ. మాటలు వేయునేమిటికి మాధవుఁ డొక్కఁడె దైవమేను ము
మ్మాటికిఁ జాటితిన్ కుటిలమత్సరభావము లుజ్జగించి యా
మ్మేటిభజింపుఁ డీతెరువు మేలుగఁ గైకొనుఁ డాత్మలోన మో
మోట యొకింతలేదు హరినొల్లమి యొప్పదు చెప్పితిం జుఁడీ. 102

గీ. హరియొకండ జగత్కర్త యఖిలభర్త, విశ్వసంహర్త భోక్త వివేకయోక్త
తలఁపుబలుపునుగొలుపును దెలుపునతని, దెసన కావింపనగు నొండుదిక్కు వోక.

వ అని చెప్పి ప్రహ్లాదుండు. 104

క. ఇది యగునో కాదో చెప్పుఁడా, తుదిఁ బడుచులమాట లంత దూష్యంగలదే
మది సైఁపవలదు మిక్కిలి, చదివినయెఱుకలను సరియె చదువనియెఱుకల్. 105

వ అనినఁ గోపించి భార్గవాత్మజు లతని కిట్లనిరి. 106

ఉ. పట్టికరంబు కిన్క పటుపావకకీలలఁ దోఁచి యెంతయుం
గట్టిఁడి తండ్రి నిన్ను నిటుగాల్పఁగ నడ్డము సొచ్చి వానితోఁ
బెట్టిద మాడ నిన్నొడలఁ బెట్టినమట్టులతోడిసాగతం
బిట్టిద యయ్యెనోధ ఖలుఁ డేమియెఱుంగు మహోపకారముల్. 107

క. ఇంక నిటమీఁద మాతో, వంకలపదురులును నాడువాఁడవ యగుమీ
జంకెలపనిలే దిదె నిను, గొంకర నొనడుచుకృత్యఁ గొల్పెదము వెసన్. 108

క. రక్షించువారిపలుకు ల, పేక్షించినవానిపక్ష మేటికి నిన్నున్
భక్షించుకృత్య నీప,ద్మాక్షుఁడు రక్షించుఁగాక యప్పుడ కడఁకన్. 109

వ. అనిన నమ్మహానుభావుండు. 110

గీ ఒకఁడువధియించువాఁడగునొకఁడవధ్యుఁ, డొకఁడురక్షించువాఁడగునొకఁడురక్ష్యుఁ
డనఁగనిది యంతయునుభ్రాంతియాత్మరూపు, లన్ని తెలియఁగులవాఁడు సర్వేశ్వరుండు.

వ. అని యిట్లుపలికినవినియధికరోషదందహ్యమానమానసు లగుచసురపతిపురోహితులు
సులక్షణంబయ్యజ్ఞముఖంబుఁజేసి క్రేల్బికృత్య నుత్పాదించి ప్రహ్లాదుపయిం బనిచిన.

ఉ ఆఁకయొకింతలేక వివృతాస్యరటత్స్ఫుటవహ్నికీలముల్
దాఁక దిగంతముల్ గమియ దౌడలుదీటుచు వాఁడికిన్కఁ జే

రాఁకలినీజగత్త్రయము నాహుతిచేయఁ దలంచెనో యనన్
వీఁకఁ గడంగి కృత్య యొక వ్రేఁకనిశూలముఁ గేలఁ దాల్చుచున్. 113

చ కడఁగి కుమారుపేరురము గబ్బున నుబ్బను దొంగలింపఁగాఁ
బొరిచె నభేద్య మాద్య మనఁ బూహము మోహము విష్ణుతత్త్వముం
డెడు గెస నమ్మహాపురుషు డెందము గావున నం దొకింతయున్
దొడరను నొప్పిగంటియును దోపదు తోలును బ్రగ్గదేమియున్. 114

చ. ఘనశలిశోల్లసత్కఠినగాఢశరీరుఁ గుమారుఁ జెంది యా
బినుఁగుపిశాచికైదు వొకబెండునుబోలె నిమేషమాత్రలోఁ
గునిసి తొలంగి నేలఁబడి తుత్తుమురై పెను భృంగి బ్రుంగ బ్రుం
గినఁ గని భీతిమై మఱలెఁ గృత్య యకృత్యనికృంతగర్వయై. 115

క. నిక్కము హరిదాసులకును, మొక్కలమునఁ గీడుచేయ మొనసినయేనిన్
ప్రుక్కడి వాసవుఁబట్టిన, చొక్కపుఁబలుకైనఁ బెద్దహాలం బైనన్. 116

వ అని యివ్విధంబున మరలి యాకృత్య దైత్యపతి పురోహితుల నాదవి ఘోరానల జ్వాలారూపంబువం దాపం బొనరించి ప్రాణంబులు పెఱుకదొడంగిన నమ్మహాసురు లాక్రోశింప ననుకంపానుకంపమానసుం డగుచు నమ్మహానుభావుం డసమానధ్యానము కుళితలోచనుండై. 117

గీ. కృష్ణకృష్ణ యనంతి యే కీడులేదు, వీరిదెస వెఱ్ఱులై వీరు తారు తమకుఁ
దీర్పరానియీపెనుచిచ్చుఁ దెచ్చుకొనిరి, కరుణ నీవిప్రవర్యులఁ గావవలయు. 118

వ. అని యాత్మస్థితుఁ డైనపరమేశ్వరుఁ బ్రార్థించి. 119

చ. సకలజగన్నియామకుఁడు సర్వచరాచరకర్త విశ్వవ
ర్తనుఁ డఖిలేశ్వరుండు నవతామరసాక్షుఁ డనంతుఁ డాద్యుఁ డీ
ప్రకటితభూతజాతమునఁ బ్రబ్బి యొకండ వెలుంగుచున్కి యే
నొకలన మోసపోక కని యుండుదు నొం డెఱుఁగం దలంపునన్. 120

సీ. క్రొవ్వాఁడియులుఁగులఁ గొని తూఁటఁబొడుచుచో ఘనవిషదంష్ట్రులఁ గఱచుచోటఁ
దోరంపుఁగొమ్ములఁ గోరిచెండాడుచోఁ గడిఁడిచిచ్చునఁ ద్రోచి కాల్చుచోట
నక్కజం బైనవిషాన్నంబు పెట్టుచోఁ బటుకృత్య జముదూతఁ బనుచుచోట
నట్టి క్రూరమునకు నట్టిఘోరమునకు నట్టియుక్కివమున కట్టితెగువ

ఆ. కట్టిబెట్టిదమున కట్టిశంకలమది, నే ననూయసేయ నింత నింక
నీనిజంబువలన నీవిప్రులడిచోట, వహ్నిఁ బడక బ్రతుకువారుగాత. 121

వ. అనిపలికి నిరంతరనిజకారుణ్యసుధాసారసేకంబున నమ్మహాద్విజుల నుజ్జ్వలితులఁ జేసిన వారును నిరామయదేహులును విగతసమ్మోహులును నై యమ్మహానుభావుఁ జేరం జను

దేంచి వేనవేలు దీవన లిచ్చి చని హిరణ్యకశిపునకుఁ దద్వృత్తాంతం బంతయుఁ
నెఱింగించిన వెఱగుపడి కొడుకు రావించి యతం డతని కిట్లనియె. 122

క. మంత్రబలమొ మాయయొ యీ, తంత్రము సహజంబొ నీకుఁ దనయా! వినవే
జంత్రమునకు విస్మయపర, తంత్రంబై నది మనంబు తథ్యము చెప్పుమా. 123

క. అని యడిగినఁ బ్రహ్లాదుఁడు, జనకుని చరణద్వయంబు సంప్రీతిమెయిన్
దనశిరము సోఁక నెఱఁగి స, వినయంబుగ నిట్టు లనియె విహితాంజలి యై. 124

గీ. అయ్య! యిదిమంత్రబలముగా దరయ మాయ, గాదు నాదగు సైజంబు గాదు వినవె
యెవ్వరికి నైనఁ జొప్పడు నిట్టిపేర్మి, యుల్లమున విష్ణుఁ దిరముగా నునిచి రేని. 125

వ. విష్ణుపరాయణత్వం బెట్టిదనిన. 126

క. ఒరులకుఁ గీడు తలంపమి, హరిభక్తికి రూప మొరుల నాత్మసమముగాఁ
బరికించువారి నాపద, బొరయునె కారణము లేక పొందునె భయముల్. 127

గీ. మనసుఁ బలుకును జేఁతయు నవఁగ నిట్టి. మూఁడు దెఱఁగులపాపంబు ముదిరెనేని
నదియ సంసారవారిధి నదిమియుండు, మనుజుఁ డెన్నఁడుఁ దలయెత్తికొనఁగలేఁడు.

ఉ. ఇంతయుఁ జూచి నిక్కముగ నేను నచింత్యు ననంతు నచ్యుతుం
జింతన సేయుదున్ సకలజీవులయందును గాంతు నవ్విభున్
భ్రాంతి యొకింత లేదు మదిఁ బండినభక్తియు నొందు దిక్కవో
దెంతటిపేర్మి యైన నగు నిట్టితెఱంగున దైత్యపుంగవా!. 129

గీ. అనినఁ బులిఁగోల వ్రేసినయట్లు రేఁగి, కాఁగి హుమ్మని యసురయంగంబు వడఁకఁ
బేర్చు కినుకఁ గింకరకోటిఁ బిల్చిపిల్చి, నెలుఁగు నింగిఁ బొంగారంగ నిట్టు లనియె.

చ. ఇది శతయోజనోన్నతము హేమగిరిప్రతిమంబు హర్మ్య మీ
తుది నిలువెక్కి వీని దిగఁ ద్రోయుఁడు క్రిందట నున్నచట్టుపైఁ
జదియఁగఁ గూలి మేనఁ గలచర్మము నెమ్ములుఁ గండలున్ వెసన్
జిదురుపలై చనం బొలియుఁ జింతయు వంతయు మాను నంతలోన్. 131

వ. అనినం గ్రందుకొన నమ్ముకుందదాసుం బ్రాసాదశిఖరంబునకుం గొనిపోయి పట్టి
దిగఁద్రోచిన. 132

చ. కుడువఁగ నొల్ల కెంతయును గ్రొవ్వునఁ గూలఁగఁ ద్రోచుఁడున్ దిగం
బడియెడు దానవప్రభునిపాలిటిభాగ్యమువోలె మేడమీఁ
దెడలెడుబాలు విష్ణుమయహృత్కు ధరించె ధరిత్రి దూదిప్రో
వి డె మునుమున్న యాతనికి నింపుగఁ జేసిన సెజ్జయో యనన్. 133

మ. కని దైత్యేంద్రుఁడు గాఢమోహబలపద్ధాగ్రహంబు పెన్వాతఁ జి
క్కినచేతోగతిఁ ద్రిప్పలేక మఱియున్ గిన్కెక్కఁగా శంబరుం

పసునేరుంగలదానవుఁ బిలిచి మాయల్ పెక్కు గావించుఁ జీ
కొల్కవరింపంగలవిద్య నీపొలుపు నేఁ డుల్లాసముం జూపుమా. 134

చ. కఱతలు పెద్ద వీని కిటుకాఱియఁ బెట్టెడుమానకేమిటన్
నెఱఁకులు మీటుచుండుఁ దననీచపుమాటలు వీనిఁబట్టి క్రొ
వ్వఱఁ బరిమార్పఁజేసినయుపాయము లన్నియు గొడ్డువోయె నీ
వుఱక సధింపఁగావలయు నుగ్రపుమాయల నిద్దురాత్మునిన్. 135

వ. అనినఁ బొంగి యఖర్వగర్వాపంబునం దగుచు శంబరుం డతని కిట్లనియె. 136

గీ. కలవు నూఱులు వేలులక్షలును గోటు, లప్రమేయలు ఘనమాయ లధిప నాకు
వానిఁ దగులకపోరాదు వనజభవున, కైన నభవునకైనను నన్య లెంత. 137

వ. అనిన దుర్బుద్ధి యగునయ్యసంబంధుండు బంధమత్సరుండై కడంగిన. 138

క. కులశైలంబులు వడఁకెను, గలఁగెఁ బయోధులు పయోజగర్భుఁడు సురలున్
దలఁకిరి మునులమనంబులు, గళవళ మయ్యెన్ దదీయగర్వోద్ధతికిన్. 139

వ. అంత. 140

ఉ. మాయలు డాయనీక యసమానత నత్యుపమానమై ముని
ధ్యేయతభక్తితత్పరవిధేయ మనందగువిష్ణుతత్త్వమున్
బాయనిచూడ్కి సర్వసమభావనఁ గ్రాలెడుబాలు బాలిశుం
జేయ నతండు సూపెఁ దన చెన్నఁటిమాయలదొంతు లన్నియున్. 141

గీ. వీఁడు మాయలఁ దను నేచువాఁడు డాయ, వీఁడు నాకు నెగ్గొనరించువాఁడనుమతి
యనఁ గశంబరునందును నమ్మహాత్ముఁ, డప్పుడనసూయుఁడై యుండెనల్లనగుచు. 142

వ. అట్టిసమయంబున భక్తపరాధీనుండును బరాపరేశ్వరుండును నగుపరమపురుషుం డప్పుణ్యపురుషునకుఁ బరిరక్షణార్థంబుగ సకలదురితాపకర్షణం బగుసుదర్శ
నంబు నాజ్ఞాపించిన. 143

ఉ. ఘోరయుగాంతకాలకృతకోపఖరాంశుకఠోరదారుణా
కారముతోడఁ జక్ర మతిఖండితచండసమిద్ధమండల
స్ఫారత నేగుదెర సురశత్రుఁ డొనర్చినమాయ వోయి నీ
హారముపోలె మాయమయి యచ్చట నచ్చటఁ గ్రాఁగె వ్రేల్మిడిన్. 144

వ. తదనంతరంబ యమ్మహాస్త్రంబంతర్హితం బయ్యె నట్లు శంబరనిర్మితమాయాసహస్రం
బులు సమసిన తమిస్రంబులం బాసినసహస్రకరుండునుంబోలె వెలుంగుబాలు నా
లోకించి వెండియు. 145

క. తన్నుఁ బొలియింపఁబుట్టిన, చెన్నఁటిచల మపుడు వెట్టిచేయు నలుకతో
నన్నిచుఁ దడటఁ జేరువ, నున్నపవనుఁ జూచి పలికె నుగ్రాకృతియై. 146

ఉ. ఓయి సమీర! యీఖలు దురుక్తిధురంధరు శత్రుపక్షసం
ధాయకు మాయలాని సముదగ్రజవంబునఁ దాఁకి వీనిదు
ష్కాయముఁ జొచ్చి ధాతువులఁ గ్రాఁచి వెసం బెనుపట్టుకట్టఁగాఁ
జేయుము నీదుశోషణవిశేషణనైపుణికల్మి యేర్పడన్. 147

వ. అని పనిచినం బనిపూని సంశోషణాభిధానుండగు నప్పవమానుం డాదైత్యరాజసూను శరీరంబుఁ బ్రవేశించి నిజవ్యాపారవికారంబులు గావింపం దొడంగిన. 148

ఉ. హానియు వృద్ధియుం బొరయ కస్తసమస్తవికారుఁ డైనల
క్ష్మీనిధి మేదినీధరునిఁ జిత్తమునందు ధరించియున్న మే
ధానిధి యయ్యశోనిధి కృతస్మితచారుముఖారవిందుఁ డై
తా నొకయీసులేక ప్రమదంబున నుండె నకంపితస్థితిన్. 149

ఉ. అంతఁ దదీయహృద్గతుఁ డనంతుఁ డనంతదయాంతరంగుఁ డ
త్యంతవిభూతి నప్పవను నంతయుఁ గ్రోలినఁ గృత్తిము లప్పై
యంతటఁ జే రడంగె నది యాత్మఁ బ్రమోదము పొందె లోక మే
కాంతవివేకులం వికృతులందునె యొందును నెవ్విధంబునన్. 150

వ. అసురేశ్వరుండును నసమానలజ్జాకందళితాంతరంగుఁ డగుచు నభ్యంతరంబునకుం జనియె నంత ప్రహ్లాదుండునుం గురుగృహంబునకుం జని పూర్వప్రకారంబునం జదువుచుండె నాచార్యుం డతనికిం గ్రమంబున భార్గవప్రణీతం బైననీతితంత్రంబు సకలంబును నవగతంబుఁ గావించి యతనిశాస్త్రపారీణత్వంబు దృఢంబుగా నెఱింగి యొక్కనాఁడు హిరణ్యకశిపుపాలికిం జని యిట్లనియె. 151

చ. పవలును రేలు దుఃఖపడి బాలుని నొయ్యన బుజ్జగించి దా
నవకులనాథ! యేను జతనంబునఁ జెప్పితి రాజనీతి నై
భవపరిబోధకారి యగుభార్గవసూక్తమహార్థతంత్రమం
త్రవికలబుద్ధి నీకొడుకు దాఁ దుదముట్టె నుపాత్తవిద్యలన్. 152

వ. అనిన సంతసిల్లి తండ్రి కొడుకు నాప్రాద్దుగావించి చేరువనునుచుకొని యన్నా! నిన్ను మాయొజ్జ నయకళాపారంగతుంగా నుదాహరించినది మాకుం దెల్లంబుగా నెఱుంగవలయు, రాజులకు మిత్రులమిత్రులు నుదాసీనులును మూఁడుదెఱంగులవారలు గలరు, వారలయందు భూపతి యెట్టియెడలఁ బ్రవర్తిల్లు, నభ్యంతరులు బాహ్యులునగు నమాత్యులయెడ నెవ్విధంబుల వాఁడు గాఁదగుఁ, జారసంచారంబును బౌరజానపదజనాను లాపనంబు నేలాగునం జెల్లించు, విశ్వాసుల నవిశ్వాసుల నెట్లు గనుఁగొనుఁ, గార్యం బు నకార్యంబు నే వెరవున నిర్ణయించు, యుద్ధంబు లేమియు యిసవరించు, నన్యాశోధ సులగుదక్షులరాతాఁసుల నేమాడ్కి నెయ్యమించుఁ, గలుషుల నే గంగఫంగించుననిపిన్

మఱియు వలయువిషయంబుల వివరించిచెప్పుమా యనఁ బ్రహ్లాదుండాదైతేయప్రభు
వునకు నభివందనంబుఁజేసిచేతులు మొగిడ్చివినయవినమితమస్తకుండగుచునిట్లనియె.

చ. ఒకటఁ గొఱంతలేదు గురునొద్ద నృపాలనయోపచారముల్
సకలము నభ్యసించితి నిజం బదిమంచివిగావు దేవ యే
నొకగతి విన్నవింతుఁ బులిలోడక యిప్పుడు దాని నీ వొకిం
చుకపడి చిత్తగింపు మనసూయుఁడవై మదిఁ గింక వాయఁగన్. 154

ఉ. సామము తొల్త దాన ముపజాపము దండము వెండియేలుకో
లేమఱునీయుపాయములు విద్విషుఁ డాదిగమువ్వురందు నె
ల్లేమెయి నెట్లుపొందుపడు నెవ్వనియందది యట్లొనర్పఁగా
నేమముగల్గు రాజునకు సిద్ధపదం బెది నీతిపద్ధతిన్. 155

చ. విను మిదియెల్ల నామదివివేకముచొప్పునఁ జెప్ప నప్రయో
జనములు తండ్రి మిత్త్రుఁ డన శత్రుఁ డనంగ సముం డనంగ నీఁ
డనియెఱుఁగం ద్రికాలములయందును సాధ్యము తొల్తఁ గల్గ సా
ధనమటతోఁ దంగాత వితథంబుగ సాధన మూరకేటికిన్. 156

క. మేనుల కెల్లను జీవుఁడు, తానే గోవిందుఁ డొకఁడు తండ్రీ! యున్నాఁ
డా నిక్కము తెలకబ్బెను, గానుపురిపుమిత్త్రమధ్యగణనకుఁ బోలమై. 157

చ. నిఖిలజగన్మయుండు హరి నీకును నాత్ముఁడ యెంచి చూడఁగా
నఖిలశరీరధారులకు నాత్ముఁడు దీని నిజం బెఱుంగు చి
త్ప్రఖరితుండు మాయలకుఁ జొప్పడఁ డప్పని గాన ముక్తికు
న్ముఖత వహింపఁగావలయు మోహముఁ బాయఁగఁ ద్రోచి భక్తిమైన్. 158

క. మిడుఁగు అనితెలచుబాలుఁడు, మిడుగురుఁబుర్వుఁ గని మేనమిడికెడుజనుఁడుఁ
బొడుగునదగుప్రోలింతయు, జడనిధిగాఁ జూచునవలజారని తెలివిన్. 159

వ. అట్లగుటంజేసి. 160

క. పెడవిద్య లెవ్వియును భవ, ముడుపఁగలే వాత్మ బంధ ముడుపునదియ యెు
క్కుడువిద్య యొట్టివిద్యలు, దొడఁగుపనియ మంచిపని విధూతకలంకా. 161

క. ఇదియంతయుఁ దగఁ గనుఁగొని, మదినిస్సారంపువిద్య మఱుఁగకబంధ
చ్ఛిదఁజేయు నాత్మవిద్యకు, నొదవఁ దొడఁగినాఁడ నుడుగ నుద్యమ మెట్లున్.

సీ ఉద్యోగముల కెల్ల నొదవునె ఫలసిద్ధి యెువ్వాఁడు దొలుమేన నెంతఁజేసె
నంతియు వానికి నబ్బునిబ్బామున శ్రీలు విద్యలు నెల్లమేలు నాత్మఁ
గోరనివాఁడును గోరి యొాపినయంత నుత్సహింపనివాఁడు నొకఁడు గలఁడె
శూరత లేక యుదారత లేకయే తెలివియు లేకయే తెఱఁగులేక

గీ. యూరకుండెడునీచులకొదవు గరిమ, వానివెరవున నెయ్యది వచ్చుఁ జెపుమ
యయిన నుద్యోగిగావలె నండ్రు బుధులు, భాగ్యమిట్టిదియని కానఁబడదుగాన.

క. కావున ముక్తికి యత్నము, గావింపఁగవలయు సమత గల్గుటఁ గోరం
గావలయు నెప్పుడును స, ద్భావంబున సమత యవ్విధం బండ్రేనిన్. 164

క. చెప్పినమాటలె పలుమఱుఁ, జెప్పంగా వలసె నీదుచిత్తముచొరమిన్
దప్పకయ విన్నవించెద, నొప్పుగఁ గృప నవధరింపు మూర్జితచరితా!. 165

ఉ. దైవతదైత్యమానుషకదంబములోనుగఁ గల్గుజంగమ
స్థావరభూతసంచయము సర్వము విష్ణుశరీర మిందులో
నేవిధి నేశరీరమున కించుకనొప్పియుఁ జెందకుండఁగాఁ
గేవలసత్కృపానిరతి గీల్కొనియున్నసమత్వ మారయన్. 166

చ. వినుదనుజేంద్ర యిట్టిసమవృత్తిఁ జరించువివేకశాలికిన్
వనరుహలోచనుం డజుఁ డవార్యుఁ డచింత్యుఁ డనంతుఁ డచ్యుతుం
డెనయఁగ మెచ్చునట్టిపరమేశ్వరు మెచ్చొనరించుతీవ్రసం
జననజరానిరాసనవిశారదసారసమగ్రసౌఖ్యముల్. 167

మహాస్రగ్ధర. అనినం గల్పాంతవాత్యాహతివిబుధనగోగ్రాకృతిన్ హేమసింహా
సనభాగోత్తానవేగోజ్జ్వలుఁడు దశనవిస్పష్టదంష్ట్రాధరోష్ఠుం
డును రోషోత్కంపతీవ్రుండును ఘనరభసాటోపదీప్తుండునై య
ద్దనుజుం డాపుణ్యువక్షస్స్థలముఁ గడునడిం దాఁచె నిశ్శృంఖలాంఘ్రిన్. 168

వ. ఇవ్విధంబునం దాఁచి. 169

ఉ. కోలుమసంగి చేచఱచికొంచు మొగంబునఁ గన్నుఁ గోనలన్
రాలఁగ నిప్పులీత్రిభువనంబుల నొక్కట మ్రింగఁ జూచెనో
కాలుఁడో యీతఁ డింతటికిఁ గాలము నిండెనొ కాక యంచు భూ
తాలి దలంక నిల్చి యసురాధిపుఁ డిట్లని పల్కె బంట్లతోన్. 170

ఆ. ఓయి విప్రజిత్త! యోయి రాహువ! యోయి, బలుఁడ! రండు వీనిఁ బట్టిపెట్టి
చటులనాగపాశసంచయంబులఁ గట్టి, యబ్ధినడుమఁ ద్రొక్కుఁ డదటణంగ. 171

క. ఇటుసేయకున్న నిటమీఁ, దట మనయసురాన్వయంబుఁ దక్కినజగమున్
గుటిలుఁ డగువీనిమాటలఁ, దలమటగమనంబు లూని తప్పఁగ నడుచున్. 172

చ. మనదెసఁ గీడు తేదు పలుమాఱును జప్పిడినోరి శత్రుకీ
ర్తన మిటుసేయఁగాఁ దగదు రా యని యిమ్మెయిఁ జాటి చెప్పినన్
వినఁడు దురాత్ముడైనయవివేకులకున్ బ్రతికార మెమ్మెయిన్
మును గలదే వెసం జదియ మోదుట చింపుట దక్క నెక్కడన్. 173

వ. అని యాజ్ఞాపించిన నజ్ఞానదూషితులగు నద్దోషకారు లక్కుమారుఁ గ్రూరకుటిలభుజంగపాశబద్ధుం జేసి కొనిపోయి మున్నీట వైచిన. 174

క. ఘనభుజగశతఫణావృత, తనుఁ డై బాలుఁడు పయోధితరఁగలమీఁదన్
బెనుబాఁపసజ్జఁ బవడిం, చిన వెన్నునిపాటి యగుచుఁ జెన్నొసలారన్. 175

ఉ. అంత నిరంతరోర్ములు దిగంతము లందుచు మ్రోఁత మెఱుంగ జగం
బెంతయు భ్రాంతిఁ బొందఁ దన యెత్తి కుమారుని మీఁద నైఁప క
త్యంతరయంబునం బుడమియంతయు ముంచు ననంగఁ బొంగెఁ గ
ల్పాంతము నాఁడు నిట్ల యనునట్లు సరిత్పతి భీకరాకృతిన్. 176

వ. అట్టియద్భుతప్రకారంబుఁ గనుంగొని యసురేశ్వరుం డసురుల నందఱ రావించి యిట్లనియె. 177

సీ. అలుఁగులఁ బొడిపించి యహికోటిఁ గఱపించి కరులచేఁ ద్రొక్కించి కనలుటగ్నిఁ
ద్రోయించి విసమున దోఁగిన యన్నంబుఁ బెట్టించి కృత్యఁ గొల్పించి పొడవు
నందుండి వెసఁ దలక్రిందుగాఁ గెడయించి క్రూరంపుమాయల కొంకులందుఁ
దవిలించి పవనుచే నివురించి యిప్పుడు నీమహాంభోధిలో నిట్టు వైచి

ఆ. యెట్టుఁ జాల మైతి మీఖలు పుర్దింప, దాయ యింక మనకుఁ దాన చిక్కు
నూఁడుకొనఁగ వైవు డుర్వీధ్రములు నవి, మీఁద మెలఁగ కుండ మిడుగకుండ.

శా. చావం డొండొకవెంట నేమిట మదిన్ జర్చించి యే నెప్పుడుం
భావం బేర్పడఁ గంటి నిట్టు లొనరింపన్ గ్రొవ్వు పెంపారెడిం
బోవం బెద్దయుఁ గాలముండినవియుం బుత్రాకృతిన్ శత్రుఁడై
తా వేషంగుల నన్ను నేఁచుఁ దగ దీదర్పాంధు పైరింపఁగన్. 179

చ. అనవుడు దానవేశ్వరునియానతి నష్టసహస్రసంఖ్యల
ద్దనుజులు పేర్చి యార్చుచు నుదగ్రనగంబులు దెచ్చి తెచ్చి యో
జనములు పెక్కువేలయెడఁ బాలుగఁ బ్రబ్బిన బిట్టు వైచిరా
ఘనతరమూర్తిమీఁదఁ దదకంపితలీలకుఁ జోద్య మందుచున్. 180

ఉ. పేఁపున నబ్ధి నొక్కపృథివీధరముల్ దగఁ దాల్చె నంచు ల
క్ష్మీపతి పేర్మి చాలఁ గడుఁ జిట్టలుగా శ్రుతు లుగ్గడించు నీ
రూపునఁ గోటిసంఖ్యలగరుల్ ధరియించిన విష్ణుదాసు పెం
పేపగిది న్నుతింతునొకొ యింకని పెక్కసమందె లోకముల్. 181

ఉ. పిండలిపండుగాఁ గలఁగెఁ బెల్లుగ నంబుధు లెల్ల మేదినీ
మండలి దిద్దిరందిరిగె ముగ్గె దిశాకరిసంచయంబు మా
ర్తాండుఁడు మాసె విశ్వమును దామరపాకుననీరువోలె నొం
డొండ చరించె నయ్యవసరంబున నున్నతితోంతసరోధకంగికిన్. 182

క. అప్పుడు నెంగును జెందక, చిప్పిలుభక్తిరసలీలఁ జిత్తము దనువుం
దొప్పఁగఁదోఁపఁగ బాలుం, డెప్పటిక్రియ నుండె జగదధీశ్వరచింతన్. 183

వ. ఇట్లు మహితసమాధినిష్ఠుండై యున్న యబ్భాగవతశ్రేష్ఠుండు నిజగరిష్ఠభావనివాసుండై భాసిల్లు వాసుదేవు ననేకప్రకారంబుల వినుతించుచుం దలంపులుం దెలుపులం జేయు మున్నీరుచొచ్చినయేఱులచందంబున గోవిందునందు డిందనానందకాంతు నధిష్ఠించియుండ నొండొండ నయ్యురగరాజరజ్జువులు నజ్జరాలుటఁ గరాళశైలసహస్రంబులరాసులు పృశ్నిపాని వారాశింబడి మునింగిపోవం గసుగందకసుందరశరీరంబుతో సముద్ధితుండై సముద్రతరంగతురంగమారూఢుండై రయంబునం దీరంబున కరుగుదెంచి. 184

ఆ. మనసు గొంతవెలికి గొని వచ్చి తాను ప్రహ్లాదుఁడని జగంబు లనఁగఁ గలుగు
నాత్మభిన్నభావ మౌపచారికదృష్టిఁ, జూచుచుండె వికృతి సోఁకకుండ. 185

క. అని ప్రహ్లాదచరిత్రము, మునివరుఁ డగుగాలవునకు మోదాద్భుతసం
జనకంబుగ నుగ్రశ్రవుఁ, డనుపమతేజుండు చెప్పె నని తగ మఱియున్. 186

క. తల్పితరత్నాకర సం, కల్పితభక్తజనకావ్యకల్పనచూడా
కల్పితశితికంఠచ్ఛద, శిల్పితజగదండచతురచిత్రవినోదా 187

మందాక్రాంతవృత్తము. వేలాక్రాంతత్రిభువనమహద్విద్విషల్లక్షసూక్ష్మా
స్థూలావిశ్వస్ఫురితరచనాదుర్నిరూపాత్మఖేలా
తోత్కూలాకారక్షుభితవారామోత్కూలకల్లోలమాలా
స్థూలాబ్ధింద్రోల్లుఠితవసుధాలోకరక్షాసమక్షా. 188

క. దైతేయభయదప్రథుశర, పీతాంబరకంబుహస్త పీతాంబరప్ర
స్ఫీతాంబురుహాక్షణభవ, భీతాభయదానకరణ పేశలకరుణా. 189

అంబురుహవృత్తము. దేవకులార్చితదేవశిరోమణి దేవదేవజగత్త్రయీ
పావనమూర్తి కృపావనవర్తి విభావనామకచిత్తరా
జీవమధువ్రతజీవదశాపరిచేష్టితాఖిలలోకల
క్ష్మీవదనాసవశీతల సౌరభసేవనాంచితజీవనా. 190

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిమిత్రసంభవ శంభుదాసలక్షణాభిధేయ యెఱ్ఱయనామధేయప్రణీతంబైన శ్రీలక్ష్మీనృసింహావతారంబను పురాణకథయందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీ రస్తు.

# పంచమాశ్వాసము.



కరకటాక్షనిగమ
శ్లోకితవివిధావధాన సురశరణభుజ
ప్రాకారకృపానిత్య
స్వీకార యహోబలేశ శ్రీనరసింహా. 1

వ. దేవా రోమహర్షణుండు మహర్షుల కిట్లనియె నివ్విధంబునం బటుశస్త్రపాతంబు మొదలుగా దైత్యనాయకుండు చేయునపాయంబు లనేకంబుల నెందును దగులుపడక నిగుడు ప్రకటితాహ్లాదుం డగు ప్రహ్లాదుచందంబుఁ గనుచుం దజ్జనని భయవిస్మయానందంబులసందడిం బడిన డెందంబుతోడ భవిష్యత్కాలవిపాకంబునకు నాశంకిత యగుచు నుండు నంత. 2

క. కట్టినకట్టులు దనువున, దెట్టిన పెనుకొండపొదలు దీఱిచికొనుచున్
బిట్టుజలధి వెడలినయా, దిట్టని తెఱఁ గసురవిభుఁడు తెలియన్ వినియెన్. 3

వ. ఇట్లు బహుభంగులఁ దనకావించుకల్మషంబుల మసిముట్టక మెఱయు నాజగజెట్టి చందంబు విని డెందంబున భయంబును నద్భుతంబునుం గోపంబును ముప్పిరిగొన హిరణ్యాక్షపూర్వజుండు గర్వంబు వాఁడిమియుఁ జిత్తంబు వేఁడిమియు మాత్సర్యంబు పోఁడిమియు దరంకి నెఱకుల మెఱుంగుటమ్ములు మెఱమిన తెఱంగున నతనిచరిత్రస్మరణంబులు చిత్తోత్కంపంబు నొనరింపఁ గంపితశరీరుండును భ్రుకుటీవికారుండును గల్పితస్వేదసంచారుండును నగుచుఁ దద్వధోపాయంబున కుపాయంబూహించి యొద్దియుం గానక కలుచపడి పెలుచ నంతిపురంబు వెలువడి కొలువుకూటంబునకు వచ్చి సింహాసనాసీనుండై పెద్దలునుం బ్రెగ్గడలును దొరలునుం బరివేష్టింపఁ గొలువుండి కొడుకుం బిలిపించిన. 4

క. బహుమేఘపటలపరివృత, సహస్రకిరణుండపోలెఁ జనుదెంచె జగ
న్మహితుఁడు ప్రహ్లాదుఁడు దు, స్సహతేజుఁడు ఘోరదనుజసంవేష్టితుఁడై. 5

మ. హరినామాంకము లుగ్గడించుచు ముకుందానేకచారిత్రముల్
వరుసం గీర్తనసేయుచున్ బరము తత్త్వవ్యాప్తిఁ జింతించుచున్

బరమానందనిరూఢి నొండొకటియున్ భావింపకేతెంచున
ప్పురుషశ్రేష్ఠునిఁ జూచి దైత్యవిభుఁ డుద్భూతాధికోద్వేగుఁడై. 6

చ. కవిదెసఁ జూచి నీఁడు కడుకష్టుఁడు వీనిమనోగతంబునం
దవిలినదైవ మెవ్విధులఁ దక్కఁద యుక్కటయింకఁ జేయునే
మినడువు గల్గనీశిశుని మేనడితోడన చెప్పి చెప్పి యీ
యవినయబుద్ధి మాన్పఁగలయంతయు నింకను నాడి చూతమే. 7

క. కానితెఱఁగై చనునకును, వీనిదెసం గార్యమేమి వెడలవడత మె
చ్చోనైన నుండుఁగాకను, దానవపతి మాటలఁ గవి దగుఁ దగు ననియెన్. 8

వ. ప్రహ్లాదుండును తదాస్థానంబుఁ దఱియంజొచ్చి తండ్రికి నాచార్యునకు నమస్క
రించినం గావ్యుం డతని నాసీనుండ వగుమని పనిచిన నట్లచేసె నాసమయంబున 9

ఆ. ఆతనిఁజూచి యసురలందఱుఁ బెలుచ డెం,దములు కలఁగి కరము దైన్యమంద
బాలభానుఁగనిన బహుళనీలోత్పల, షండ మనఁగఁబోలుచుండెఁ గొలువు. 10

క. దితివంశవల్లభుఁడు భృగు, సుతువదనమునందుఁ దనదుచూడ్కి నిలిపి కు
త్సితుఁ డగువీనికిఁ జెప్పుడు, మతిగానని దుష్పథంబు మానుతెఱంగున్. 11

ఉ. వేఁదుఱు గొన్నమానవుని వేమఱుగంటియు బిట్టుగాల్చియున్
మోఁదియు నీటఁద్రొక్కియును మున్కని తీర్పఁగడంగునెజ్జున
ట్లేఁ దగ నిన్నిచందముల నీతని దీర్చుటకై పెనంగితిన్
బేదఱికంబు గట్టుకొని బెట్టుగఁ జిక్కితి నేమిసేయుదున్. 12

వ. అన శుక్రుఁడు ప్రహ్లాదు నాలోకించి. 13

శా. అన్నా! బాధలఁ బొందనేల జనకాజ్ఞాయత్తచిత్తుండవై
యున్నన్ నేమముగాదె? తండ్రులప్రియం బొందించుటం బోలఁగా
నెన్నన్ ధర్మముగల్గునే? గురుహితం బెబ్భంగి సత్కర్మమై
యున్నన్ బుణ్యపదంబు గా బుధజనం బూహించు ధర్మస్థితిన్. 14

క. జననీజనకుల కప్రియ, మనజనసద్ధర్మమైననది దురితముకా
మును బుగ్గడింతు రది నీ, మనమునఁ దలపోయవలదె మహితవిచారా. 15

ఆ. అనినఁ గేలు మోడ్చి యద్దానవాన్వయా, చార్యుఁ జూచి వినయసంప్రయోగ
కలితచిత్తుఁ డగుచు గంభీరరవమున, నిట్లు ననియె బాలుఁ డెల్లవినఁగ. 16

క. మీ రరయనిధర్మంబుల, మేరలు సెఱుకలును గలవె మీకుం దగవే
నారాయణభక్తిపరత, వారించెద ననుట యిట్లు వైదికవర్యా!. 17

ఆ. మీరు గురులుగారె మీమాట యతనికి, వినఁగవలదె కలుషవృత్తి విడిచి
వాసుదేవుమీఁది వైరంబుదక్కి న, త్తల్లగుసువుగాఁగఁ దెలుపవలదె?. 18

క. తామసుఁ డితండు విష్ణుమ,హామహిమలకోర్వఁడి యెఱుఁగఁ దద్దేవుదెసన్

క్షేమంబు నలుగనంతయు, నోమించిన నుడినిబ్రదుకు సులభంబగునే. 19

గీ. తల్లిదండ్రులకును వెసఁ దగుహితంబు, చెప్పఁగురుగాక యిప్పుడు నిషిద్ధమైన
యుభయలోకవిరుద్ధమహోగ్రవృత్తి, కార్యముగఁ జెప్పనెందునుగలదె యనఘ!

వ. అవధరింపుము. 21

సీ. వాసుదేవునిపాదవనరుహంబులభక్తి తగదనుతండ్రియుఁ దండ్రిగాఁడు
వేదచోదితమైనవిష్ణుధర్మము నకుఁ గోపించుగురుఁడును గురుఁడుగాఁడు
భవదుఃఖములుమాన్పఁ బ్రభువైనహరిసేవ నెడలించుహితుఁడును హితుఁడుగాఁడు
పరయోగమత మగువైష్ణవజ్ఞానంబు వదలినచదువును జదువుగాదు
గీ. కేశవాకారలీలలు గీలుకొని ము, దంబుఁ బొందనితలఁపును దలఁపుగాదు
మాధవస్తోత్రఘనసుధామధురరుచులఁ, జిలుకకుండెడుజిహ్వయు జిహ్వగాదు. 22

చ పురుషగుణంబు మేనఁగలపోణిమి నొందినవాఁడు మేలుకీ
డరయఁగఁ జాలుబుద్ధి బొలుపారినవాఁడు సుఖంబు నాయువున్
జిరముగఁ గోరువాఁడు సరసీరుహనాభు ముకుందు నిందిరా
వరు భజియింప నొల్లఁడఁటె వానికి నెక్కడి వేశుభంబులున్. 23

ఉ. ఊషరబీజముల్ భసితయోజ్యఘృతంబులు షండకన్యకా
న్వేషణముల్ పయోధిగతవృష్టితతుల్ మృగతృష్ణికాంబుగం
డూషలు దుర్గకాననకరోరితచంద్రిక వేదమూకస
ద్భాషలు విష్ణుమంగళకథావిముఖాత్ములదుష్టజన్మముల్. 24

క. మోహాంధుఁడు దుర్గతిపద, సాహసికుఁడు బహుళదురిత సాగరవీచీ
గాహనశీలుం డాత్మ, ద్రోహి గదా విష్ణుభజనదూరుఁడు ధరణిన్. 25

వ. అనిపలికి హిరణ్యకశిపు నాలోకించి. 26

క. నిన్నింతవానిఁజేసిన, యన్నాలుగుమోములతఁడు హరిపొక్కిటియం
దున్నవెలిదమ్మియీనిన, కున్నయగుట తెలిసి విడువు కోపము తండ్రీ. 27

క. హరికంటెఁ బరము లేదిది, పరమార్థము నీవుదీనిఁ బాటింపుము సు
స్థిరముఁగఁ దలఁపు మతనిను, హృదయమునఁ గన్నయది తలఁతె చలమో ఫలమో. 28

వ. నావుడు నేయిపోసిన మండునగ్నియుంబోలె నగ్గలంబైన కోపంబు దీపింప నిలింప
వైరి నిజసేవాగతుఁడై యున్నదండధరుఁ జూచి నీవు సకలప్రాణి సంహరణాధికారధు
రీణుండవు కావున నిప్పాపాత్మునిపాపంబున కనురూపంబుగా నాగ్రహింప యాత
నలం బనుపుమని యనుశాసించినఁ బ్రసాదంబని యయ్యంతకుం డనంతధ్యానపర
వశుం దనవశంబుచేయ సమకట్టి. 29

ఉ. కింకరకోటిఁ బిల్చి మదిఁ గింక మొగంబున నంకురింపఁగా
జంకెలు మిక్కుటంబుగఁ బ్రచండపుదండముఁ గేలఁ బూని ని

శ్యంకతఁ గాలపాశములఁ గేల నమర్చి మహోగ్రమూర్తియై
బింక మెలర్ప డాసెఁ బటుభీషణమృత్యుపురస్సరంబుగాన్. 30

వ. ఆసమయంబున నార్తశరణ్యుండగు గరుడధ్వజుండు పనుపఁ దదీయసేనాధిపతి విష్వక్సేనుండు కింకరకోటియుక్తుఁడై తానును దివ్యాయుధఘట్టంబులతో దాడివెట్టి యొప్పఱఁగృతాంతకింకరుల ముట్టి కనుపుగొట్టఁ బొడంగినం గని దైత్యపతి తానును భయభ్రాంతుఁడై డిగ్గి తొలంగి యభ్యంతరగృహంబున కుంబఱచి వెఱచఱచి సందులు బ్రిందులు గొందులు దూఱియుండె నాలోన. 31

మ. ఖరఘోటాగ్రఖురాభిపాతనిహతిన్ ఖండంబులై యాశ్విక
స్ఫురదుద్దామకృపాణకుంతముఖవిస్ఫోటంబులన్ భ్రష్టభీ
కరసేనాపతిచక్రధారఁ దుమురై గర్వోల్లసత్కాలకిం
కర సైన్యంబులు వ్రేల్మిడిన్ బొలిసె నుత్కంపింపఁ ద్రైలోక్యముల్. 32

క. అంతఁ బరమాత్మకింకరు, లంతం బట్టుకొని యోరి హరి దాసుల ని
ర్జింతునని పూనఁగా నీ, వెంతటివాఁడ విటఁ గుడువు మీఫలమనుచున్. 33

క. మొగమును ముక్కును జదియఁగ, బిగువగు పిడికిళ్లఁ బొడువ బెగడి జముండున్
సుగుణాకర ప్రహ్లాదుఁడు, విగతభయుఁడ నన్నుఁ గావవే కృపననఁగన్. 34

ఆ. అమ్మహానుభావుఁ డమ్మహావీరుల, ననునయించి వీఁడు ననపరాధుఁ
డీకృతాంతు విడువుఁ డితఁ డపరాధియె, డేమి చేయు సుజనుఁ డీసు లేదు. 35

వ. అనిన నట్లకాక యని యంతకు విడిచి యసురాంతకభృత్యులు దైత్యపతి మున్నుతల యుంజీరయు విడనాడి వాలుటఁ జూచినవారు గావున వాఁడు నరసింహనఖంబుల కెరగాఁగలవాఁడని నిశ్చయించినవారై యేమియుంజేయనొల్లక యాదితిసూనుపురంబుఁ గాల్చి దైత్యులఁ గొందఱఁ బారిసమరి సమదగమనంబునం జనిరి ప్రహ్లాదుండును దండ్రికడకుఁ జని యిట్లనియె. 36

మ. సకలేశుం డగు విష్ణుసైన్యపతి విష్వక్సేనుఁ డీవిధఁ దే
న్నికకున్ బెక్కుబలంబు లీతనికి నిర్జింపంగ శక్యంబె యి
ట్లోకఁ డేతెంచిన బాల్లరాఁ బొలసె నీయుద్దామదర్పంబు దా
న కదంకన్ హరివచ్చినం జెపుమ విన్ గావంగ నింకొక్కనిన్. 37

వ. ఇది దృష్టంబుగాఁ గన్గొని. 38

ఉ. చెన్నఁటి యింకనుం జెడక శ్రీరమణీకుచకుంకుమచ్ఛటా
చ్ఛన్నశరీరునుద్యదసి శంఖసుదర్శనహస్తుఁ గౌస్తుభో
ద్భిన్నగభస్తివిస్తరణదీప్తభుజాంతరు నంతరంగసం
పన్నదయాంతరంగు హరి భక్తివిధేయు భజింపు మింపునన్ 39

క. ముదంబుల భేదంబుల, వాదంబులఁ బ్రొపులేదు ...

త్రోవ్వదయము నిండుఁ దెలివికి, గాదలిర్చి చేరు దీనఁ గనుఁగొను మనఘా. 40

వ. అనిచెప్పి ప్రహ్లాదుం డూరకుండె నయ్యసురేశ్వరుండును నట్లు బెండుపడినవాఁడై తనలో నిట్లని వితర్కించు. 41

సీ. హరినాకుఁ బగగదా యతనిపక్షంబుదా వీఁ డెంతచేసిన విడువఁ డింక
వీనికిసై తాను వేమాఱుఁ దనలావుఁ జూపుచున్నాఁడు విష్ణుఁడు గడంగి
యయిన నేమగుఁ జూత మాతనిబలిమియుఁ గలిమియుఁ జెలువును నిలుకడయును
ఎఱుఁగు వీఁ డిదియెల్ల నిప్పుడు వీనివాక్యంబులచొప్పున నరసిచూచి

గీ. యామకుందునిపై దాడి యరిగి యతని, మొల్లమంతయు వెసఁగొని ముట్టిపట్టి
కట్టుకొనివచ్చి చెఱఁబెట్టి కష్టపఱుతుఁ, బూని మున్నున్నదివిజులలోనఁ గలపి. 42

వ. అనితలపోసి క్రమ్మఱ నంతఃపురంబు నిర్గమించి సముంచితకాంచనరత్నరచితమహాస్తంభశతసంభారమండితం బగుసభామంటపంబుఁ బ్రవేశించి యెప్పటియట్లయనుజీవలోకంబు గొలువం బెద్దగద్దియపైనుండి ప్రహ్లాదురావించి యి ట్లనియె. 43

ఆ. పయికి వెఱవకిట్లు పగవారివాఁడవై, మమ్ము నేఁచె దింక మాటలేల
యీవిధమున నీకు లావిచ్చి పెనఁగించు, నతనికాక నిన్ను ననఁగ నేల. 44

క. నీవ కనుంగొనుచుండుము, మీవిష్ణునిఁ బట్టితెచ్చి మెదిపెద మును నా
లావున కగపడి యడఁగిన, నీవిబుధులకంటె నాతఁ డెక్కుడుగొలమే. 45

వ. అనిన నగుచుం బ్రహ్లాదుం డిట్లనియె. 46

గీ. అయ్య! నీవేమిసేయుదు వఖిలజగము, వెఱ్ఱిచేయంగఁ బుట్టినవిష్ణుమాయ
నిన్నుఁ దెలియంగ నీకు దుర్నీతిఁ దెలుపు, చుండె నీప్రల్లదంబుల సొంపు మెఱసి. 47

సీ. నీ వెంతవాఁడవు దేవతలైనను మునులైన ఘనులైన మోసపోరు
రమ్మహామాయచే నారిభక్తిసీమకు నడ్డమై త్రోవంగ నలవిగాక
విలసిల్లునమ్మాయ విశ్వాత్ముఁ డగువిష్ణు తలఁపులోనన తాను గలిగియుండుఁ
ద్రిభువనవ్యాప్తిని ద్రిపురుషాధీశ్వరి త్రిగుణస్వరూప యాదివ్యశక్తి

గీ. యజ్ఞలోచనుకరుణాకటాక్షదీప్తి, వ్రాలు నెవ్వారిపై వారచాలువారు
మాయకపలనిబడమి కమ్మహితశక్తి, కలితహృదయులై తెఱచుగాఁగలరె ధరణి. 48

ఉ. తామసజీవులై భవనిధానము నాఁ జనుమాయచేయను
ద్దామవికారముల్ గదిరి ధర్మవిదూరులు కొంద అచ్యుతుఁ
దామరసాక్షుఁ గైకొనక దర్పము మచ్చరముల్ దలిర్పఁగా
వేమఱుఁ బుట్టుచుఁ జెడుచు వేగుదు రుత్కటనారకాగ్నులన్. 49

ఉ. తపము లొనర్చి దానముల ధర్మములన్ దుదిముట్టి నిష్ఠతో
జపములు నిర్వహించి రమాసంయమసౌఖ్యసమాధిఁ బండి ధ

న్యపుదెసఁ జెందఁగా బహుసహస్రభవంబులపిమ్మటం గదా
విపులముకుందభక్తిపదవీథిఁ బ్రపన్నతనొందఁ గాంచుటల్. 50

సీ. ఎసఁగువానయు సీతు నెండయు సైరించి తనువులింకఁగఁ జేయుతపము కాలి
యిడుములఁబడి కిన్నయొడలు నంచించి నిర్ణయమున నడుపుజన్మములపంట
లాసతో నమ్మిక యాధారముగఁ జేయు వివిధదానంబులఁ బెల్లుచొప్ప
కాలిచిపడ నెల్లకడ భూమిఁ గ్రుమ్మతీ యాడుతీర్థములయాయాసఫలము
గీ. దివిజకాంతలయుఱిచన్నుఁగవలమీఁద వ్రాలికలఁ గన్న తెఱఁగున సోలనొకఁడు
సత్య మత్యంత మనఘ మక్షయ మనంత, మచ్యుతార్చనాసంభృతోదాత్తఫలము.

చ. జడధులు నింకఁ గూలుఁ గులశైలచయంబును ధాత్రియుఁ డిగం
బడుఁ బెడబాయు భానుశశిభవ్యపదంబులు నబ్జసూతియుఁ
సుడివడు నెన్నఁడుఁ జెడనిచోటు ముకుందపదప్రపన్నులం
జెడునెడ యొట్టివారలకు జెందములందనిగొంది యోష్మయిన్. 52

శా. అక్రూరాత్ములు సత్యసంగతులు మాయాదూరు లత్యంతని
ర్వక్రాచారులు ధీయుతుల్ త్రిసుకృపావ్యాపారు లుద్యద్యశో
విక్రాంతాఖిలలోకు లార్జితసమావేశప్రకాశోన్నతుల్
శక్రాద్యామరపూజ్యు లచ్యుతకథాసక్తుల్ మహాత్ముల్ మదిన్. 53

సీ. ఎలసినఁ జారుగీర్వాణతరుశ్రేణు లాదవిపెందోఁటలై యుల్లసిల్లు
ఎలసినఁ గామధుగ్వరధేనువులు పెనుగదుప్పలై మందఁ జగడపుఁబరఁగు
ఎలసినఁ బ్రస్ఫురదనఘచింతామణివ్రాతముల్ క్రీడాద్రులై తనర్చు
ఎలసిన సుద్గతోజ్జ్వలసిద్ధరసములు గరువంపుఁబేరులై తరఁగలొత్తు
గీ. నమరగరుడనిశాచరయక్షఖచర, వితతి యెలసినఁ గింకరస్థితిఁ జరించు
నయినహరిభక్తివర్యులయనుపమాన, నిత్యసుమానీయమహిమ వర్ణింపవశమె. 54

చ. అమరపదంబు మెచ్చ రమరాధిపులీల గణింప రేమియుఁ
గమలభవత్వముఁ జనముగాఁ గొన రాకులితార్థధర్మమో
క్షములతెఱంగుఁ జీరికిని గైకొన రచ్యుతదాస్యవృత్తిమై
నమితసుఖానుభూతి నమృతాంబుధిఁ దేలుచునుండు సాత్త్వికుల్. 55

క. తారకరులమాటలచవిఁ, గోరరు హరినామసుధయ క్రోలుచు వేడ్కన్
గోరరు సంతతసౌమ్యులు, శ్రీరమ్యులు విష్ణుచరణసేవాసక్తుల్. 56

క. నారాయణనామము సం, సారసరోషనము దురితసముదయభూభృ
ద్దారుణభిదురము మంగళ, కారణమని ఖలులకెల్ల గఱపఁగవచ్చున్. 57

క. దాతవ్యుఁ డొకఁడు విష్ణుఁడు, శ్రోతవ్యం బొకఁడు దనుజసూదనుఁడు సమ
ప్రాప్తవ్యము హరినామము, చేతవ్యము విష్ణుభక్తిచే నఖిలంబున్. 58

క. విష్ణుమయము వేదంబులు, విష్ణుమయము సర్గ మఖిలవిజ్ఞానములున్
విష్ణుమయము జగమంతయు, విష్ణుమయము విష్ణుఁ డొకఁడె వేద్యుఁడు బుద్ధిన్. 59

సీ. త్రిభువనవ్యాపకదీప్తినిర్గుణమూర్తి వాసుదేవాఖ్య నుజ్జ్వలతనొంది
జగదేకసంహారసమదతామసమూర్తి నతులసంకర్షణాహ్వయతఁ బేర్చి
విశ్వరక్షాకరవినుతసాత్త్వికమూర్తిఁ బ్రద్యుమ్ననామవిభూతఁ బరఁగి
భువనసంభవహేతుభూతిరాజసమూర్తి ననిరుద్ధనామధేయాప్తి నొంది

గీ. శ్రుతిపదంబులుఁ దనుఁ జతుర్మూర్తి యనఁగ, నఖిలకథలును దనుఁ జతురాత్ముఁ డనఁగ
నాగమంబులు దను జతుష్కుఁ డనఁగ, నొక్కఁడుండె యాతఁ డచ్యుతుఁ డుల్లసిల్లు.

క. మఖనేతయు మఖధాతయు, మఖదాతయు మఖనిధానమాతయు మఖదు
ర్ముఖజేతయుఁ బీతాంబరుఁ, డఖిలమునకుఁ దానకాక యన్యుఁడు గలఁడే. 61

క. జీవుని బ్రకృతిం దొలితొలి, గావించెను బుద్ధిమొదలుగాఁ గల్గినత
త్త్వావలి నోలిసృజించెను, గోవిందుఁడు దాన యింతకును మూలంబై. 62

సీ. బొడ్డునఁ దామరఁ బుట్టించి యందజుఁ గలిగించి లోకాధికారమిచ్చె
నాగమంబులు నాలుగంగంబు లాఱును మఱిపురాణములు మీమాంసయునఁగ
న్యాయంబు ధర్మశాస్త్రావలి యనఁబడు నాలుగువిద్యలు నోలిసలిపె
బ్రహ్మాండములును సబ్రహ్మమును దొంతులు పేర్చి యందులో భువనంబు లరసి దీర్చె

గీ. నబ్ధులను గిరులను దీవులనఁగ సేతు, లనఁగ వనములనఁగ నూములనఁగ నరుస
నచ్చుకట్టి యిన్నింటికి నధికరులఁ, బనిచెఁ బరమేశుఁ డబ్జలోచనుఁడు దాన. 63

క. మనువులు మన్వంతరములు, మునులును దివిజులును దివిజముఖ్యులు మనునం
దనులును దత్కులజనితులు, వనజోదరునాజ్ఞ నుద్భవస్థితికారుల్. 64

క. తారగ్రహనక్షత్ర, స్ఫారవ్యాపారములును భవనస్కంధా
ధారనిబంధస్థితులును, నారాయణ శాసనప్రణయకీలితముల్. 65

క. వసురుద్రాదిత్యాది, శ్వసనగణంబులును సిద్ధసాధ్యోరగరా
క్షసయక్షభూతవైతే, యసమూహంబులును విష్ణునాజ్ఞాకారుల్. 66

[illegible] క్షత్రము నిర్వికల్పముగా [illegible]ఁడు త్రివిష్టపు
స్థితిక్రమవిక్రమైకసమృద్ధిమై లయవిక్రమా
వేళ నింతయు సంహరించుఁ బ్రవృద్ధయోగపరోల్లస
త్కాలరూపము దాల్చి దుర్వహసర్వనిర్వహబుద్ధియై. 67

గీ. అతఁడు కనుదెర్వ బ్రహ్మాండవితతి యొదవు, నతఁడు కనుమూయ నన్నియు నడఁగిపోవు
భువనసంభవసంహారభూరిమహిమ, తోయజాక్షున కరయ లీలాయితంబు. 68

క. తానిట్టింతటివాఁ డను, నైనట్టులయుంపు నిక్క మారసి చూడం
గా నేమిటివాఁ డనుఁగాఁ, డానందచిదైకమూర్తి యచ్యుతుఁ డెంచన్. 69

మ. జననం బొందునవంగరా దజుఁడు నా శక్యంబుగా దబ్ధియం
దనిశంబుం బవళించునా నిజముగా నత్యంతబద్ధుండునాఁ
జన దేకాంతతపస్వినాఁ జనదు శశ్వత్క్రోధినాఁ బోలదే
మనివర్ణింతును వారిజోదరుని యత్యాశ్చర్యచారిత్రముల్. 70

క. ఆలించునా ర్తరవ ము, న్లాలించును ఖలుఁ సతతముఁ సజ్జనులం
బాలించును గృపనెంతయు, శీలించును మత్ప్రభుండు శ్రీవిభుఁ డాత్మన్. 71

మ. ఒకకేలన్ విలసత్సుదర్శనము వేఱొంటం బరిస్ఫారనం
దకమున్ బ్రస్ఫురితాన్యహస్తమున నుద్యత్పాంచజన్యంబు నొం
డొకటన్ శార్ఙ్గము దాల్చి ధర్మరిపుల న్ఘోరాజిమర్దింపుచున్
సకలైకాశ్రయమూర్తితోడ నెపుడున్ వర్తించునా ముందటన్. 72

వ. అనుచు ననేకవిధంబులఁ బ్రహ్లాదుండు విజ్ఞానపరవశుండై పలుకుచున్న పలుకు లప
హసించి యసురేశ్వరుండు. 73

క. తొలిమేనికర్మవశమున, బలవంతపువెఱ్ఱిబిట్టుఁ బట్టిన నేభం
గులనోరు మూయ నేరక, పలుదెఱఁగులఁ బ్రేలెదీవు ప్రాజ్ఞులు దెగడన్. 74

వ. ఇంక నున్మత్తుతోడిమాటలఁ బ్రయోజనంబు గలదె యనిన నమ్మహానుభావుం డమ్మో
హాంధున కిట్లనియె 75

ఉ. ఆదికి నాదియైన పరమాత్ముని విష్ణునిమూర్తిఁ గాన బ్ర
హ్మాదులచాల రవ్విభుశుభాకృతి యస్ఖలితైకభక్తిసం
చోదితుఁడై కృపం బొడవుచూపుఁ బ్రపన్నులకిచ్చలైనన
వ్వేదమయుండు పొందుపడువేఱొకటొల్లక తన్నుఁ జెందినన్. 76

క. ఎఱిఁగిన వారికి నెందును, గుఱుకొని తోనుండుఁ దన్నుఁ గానకుండెడువా
రెఱుకలకుఁ జేరువయ్యును, బొఱయందగఁ డతఁడు నిఖిలభువనములందున్. 77

సీ. కలఁడు మేదిని యిందుఁ గలఁ డుదకంబులఁ గలఁడు వాయువునందుఁ గలఁడు వహ్నిఁ
గలఁడు భానునియందుఁ గలఁడు సోమునియందుఁ గలఁ డంబరంబునఁ గలఁడు దిశలఁ
గలఁడు చరంబులఁ గలఁ డచరంబులఁ గలఁడు బాహ్యంబునఁ గలఁడు లోనఁ
గలఁడు సారంబులఁ గలఁడు కాలంబులఁ గలఁడు ధర్మంబులఁ గలఁడు క్రియలఁ

గీ. గలఁడు కలవానియందును గలఁడు లేని, వానియందును గలఁ డెల్లవాని యందు
నింక వేయును నేల సర్వేశ్వరుండు, కలఁడు నీయందు నాయందుఁ గలఁడు కలఁడు.

చ. అనవుడు రోషహాసవివృతాననుఁడై దివిజారి యోరి నీ
వనయత మెందుఁ గల్గునని వర్ణనఁ జేసినయాతఁ డిందుఁ గ
ల్గునె యనుచున్ జగద్వలయఘోరకరాహతి వ్రేసెఁ గంబ ము
త్యనుపమతత్ప్రభాభవన మల్లల నాడఁ గలంక లోకముల్. 79

వ. ఇట్లు వ్రేసిన. 80

సీ. బడబానలాహతి జడనిధిలోనున్న పటుశైలతతి వ్రీలి పెటిలె నొక్కొ
ఘనతరోత్పాతనిర్ఘాతసహస్రంబు గడఁగి యొక్కట వ్రాసి పడియె నొక్కొ
పెక్కుజీవులలోన బిక్కట్టువడఁగ నా బ్రహ్మాండభాండంబు పగిలె నొక్కొ
తఱి గాక యున్నయుద్ధతిఁ బేర్చురుద్రుండు విలయోగ్రపటలంబు వ్రేసె నొక్కొ

గీ. యనఁగ నాకాశసకలదేశావకాశ, భరితమై విశ్వమును మూర్ఛ పాలుపడఁగ
మొనసి పెఢిలు పెఢిల్లను మ్రోఁత వెడలఁ, బగిలెఁ గంబంబు భువనకంబంబు గదుర.

స్తంభోద్భవ వచనము.

ఆమహాస్తంభంబున విజృంభమాణజిహ్వావిస్తృతవదనగహ్వరస్ఫురదసహ్యకహకహో
త్తర్జనగర్జాస్ఫూర్జితంబును వికటకఠోరఘోరదంష్ట్రాదండదారుణదహనదందహ్యమా
నదశదిశాభాగంబును విపులకపిలక్రూరతరలతాంకాతరంగితోద్వృత్తనృత్తాయత్తేక్ష
ణాక్షరదనస్ఫులింగపూరితభువనరంధ్రంబును నభంగభ్రూభంగభయదఫాలభాగప్రాం
తభంగురభ్రమరకదురసలోకంబును విశ్వధురంధరస్కంధపరిణాహపరిణతోదగ్రకిం
జల్కపుంజపింజరితభాసురకేసరప్రసరవిప్రక్షలితాంతరిక్షంబును హేమకమనీయతంతు
కాంతి కోమలరోమవల్లరీగహనకరాళకర్ణకోటీరఘటితకుండలమణిమరీచిమంజరీరం
జిత గండస్థలోద్భాసితంబును గల్పాంతపవనకల్పనాసాదరోల్లసితసమీరసంపాది
తకంపాకులిత కులధరనికరంబును సముత్కటోత్తాలకోటికుట్టనకుంఠితకుటిలకుంత
లాయమాన శ్యామజీమూతసకలనభోమూర్ధభాగంబును శ్రీవత్సకౌస్తుభవైజయం
తీప్రముఖనిఖిలలక్షణోల్లక్ష్యమాణవక్షస్స్థలప్రస్థూలప్రారంభ నిర్విలంబలక్ష్మీసమారో
హణోత్సవంబును భక్తజనవచనరక్తనచింతనానురోధనిరవగాహనకరుణాసుధాపూర
పూరితపుణ్య హృదయప్రదేశంబును దితిసుతవ్యపదేశపశుబంధనోపయుక్తయూ
పస్తంభాయితోరుయుగళంబును గనత్కనకమణీమేఖలాకలాపకలితకటితటికాం
చన వసనాంచనాందోళనధగద్ధగితధామచ్ఛటాస్ఫురితజగదండఖండంబును బహు
ళమాణిక్యహంసకావతంస సితనఖాభిరామశ్రీమచ్చరణసరోరుహప్రసభాగ్రహిత
ఘట్టనాగ్రహోగ్రాటోపరభస క్షుభితక్షోణివలయంబును హిరణ్యకశిపుప్రహ్లాదవిష
య నిగ్రహానుగ్రహావేశవ్యతికర విషమసంరంభ దుర్వారగర్వారంభభీషణాభిరూప
సంస్థానంబును శృంగారవీరకరుణాద్భుతానేకరసనికరసంకరసంకులప్రకారదుర్నిరూ
పోపస్థానంబును సహస్రకిరణకృశానుశశాంకసహస్రకోటితేజఃప్రతాపకాంతిసమ్మే
ళనమహితోత్సాహతీవ్రసౌమ్యస్వభావభావితంబును రుద్రద్రుహిణపురుహూతాది
సకలదేవతాశక్తిసభాసంభావనీయంబును సర్వాశ్చర్యసంజననంబును సర్వలోకాతి
రిక్తంబును సర్వజగదుద్భవకరణకారంబును సర్వైశ్వర్యధుర్యంబును సకలవిభవాను

భావగంభీరంబును సకలశ్రుతిస్మృతిపురాణసిద్ధాంతసిద్ధదర్శనంబును సకలమంత్రతం
త్రయోగవినియోజ్యంబును సమస్తసమాశ్రితజనాభయప్రధానపరమప్రత్యైకపారం
గతంబును సమస్తమనోరథఫలైకసాధనంబును సమస్తసాధుజనహృదయవ్యాపార
పరానందనిష్యందంబును సమస్తనిగమప్రదీపంబునునగు శ్రీనరసింహరూపం బావిర్భ
వించిన. 82

ఉ. అక్కజమైన యీనరమృగాకృతి తేజము లోకమంతటన్
బిక్కటిలంగఁ దీవ్రగతిఁ బేర్చి తలిర్చినఁ జేరిచూడలే
కెక్కడయుం జనంగఁ దెలియింపు నెఱుంగక దైత్యుఁ డెంతయున్
జొక్కి మనంబునన్ దిగులు చొచ్చెను జేష్టలుదక్కె నత్తఱిన్. 83

గీ. కురిసె నందనమందారకుసుమవృష్టి, మొరసె గంధర్వకరహతమురజరవము
బెరసె నారదముఖమునిబృందనుతులు, బలసె నింద్రాదినిర్జరపరికరంబు 84

వ. ఇట్లు విజృంభించిన దేవదేవుదివ్యావతారం బాలోకించి ప్రహ్లాదుండును భయసంభ్ర
మాద్భుతభక్తియుక్తం బగుచిత్తంబుతోడ నుదాత్తధ్యానాతివందనస్తోత్రపరవశుం
డగుచు నెదుర్కొని నిశ్చేష్టితుం డగుతండ్రిఁ జేర్కొని యమ్మహామూర్తిని నతనికిఁ
జూపి యిట్లనియె. 85

చ. అతులతపస్సమాధినియతాత్ములకైనను గానరానియ
ద్భుతపరమాత్మమూర్తియిదె తోఁచెఁ గృతార్థుల మైతి మింకనీ
కతలును మాని యివ్విభు నగణ్యకృపానిధి నాశ్రయింపుదు
ష్కృతములకెల్ల శుద్ధియగుఁ జేకుఱు నీకు ననంతసౌఖ్యముల్. 86

క. నీకడుపునఁ బుట్టినబుణ, మేకరణిం బాతునొక్కొ యేననిపడితిన్
గైకొనవే నాపలుకీ, పాకము దప్పుటయు భయము వాటిల్లుఁ జుమీ. 87

గీ. అనినవప్పుడు దనుఁ గాల్పఁ గొనినచలము, విడువఁజాలక దైతేయవిభుఁడు రేఁగి
బేలయేలమాటల వెఱపింప నన్నుఁ, జూచి యెవ్వఁడు నవ తిటుచూడు మింక. 88

క. ఈవికృతరూప మిట్లై, చావఁ దలఁచి తోఁచె దీని సమయించెద నా
లావున కెదురై పెనఁగఁగ, నీవిశ్వమునందుఁ గలఁడె యెవ్వాఁడైనన్. 89

వ. అని పలికి యుత్సాహంబు మెఱయ బాహుబలంబు చూపుటకు నాటోపంబునం జాప
కృపాణాదిసాధనంబులు ధరియించి యానరసింహమూర్తికి నెదురు నడచి కదనం
బునకుం జొచ్చె నసురులు నిజేశ్వరు తెగుటఁ జూచి యేచి సహస్రసంఖ్యలు గూడఁబడి యా
ర్చుచు నర్చిష్మంతుమీఁదఁ బ్రచురశస్త్రాస్త్రపాతంబుఁ జేయం దొండగిరి తదనంతరంబ.

ఉ. వారల యేపుఁ గోపము నవారితశస్త్రఘనాస్త్రలీలలున్
వారిధిఁ జెంది డిందెడుస్రవంతికలట్లు నృసింహు తేజమున్
జేరి యడంగిపోయె విలసిల్లె జగన్నివహంబు లప్పుడున్
గోరి సుతుండు తండ్రి యతికోపము దీర్పఁగడంగె నత్తఱిన్. 91

ఉ. శ్రీనరసింహరూపమునఁ జెన్నుగఁ దోఁచె సహస్రకోటిసం
ఖ్యానము లైనబాహువులయం దొడఁగూడినచక్రముల్ విల
ఖ్యానుపమానశత్రునివహంబులచే నొకమాత్రలోన న
ద్దానవసేనయంతయును ద్రగ్గఁ దదీశుఁడు బెగ్గడిల్లఁగన్. 92

వ. ఇట్లు తనచుట్టు శూన్యంబైనదైన్యంబు మొగంబున నెగయ వెడబిగువుగ బిగియించు
కొనుచుఁ జలంబు మిగుల నసురపతి యప్రతిహతానేకదివ్యాస్త్రప్రయోగంబొనరిం
చిన నదియంతయు ననంత తేజోరాశియందు నిరాసంబునొందె నాసమయంబున.

సీ. ఈదైత్యుమాత్రకు నిట్టిరౌద్రపమూర్తి శ్రీనాథుఁ డేటికిఁ జెందె నొక్కొ
మడిసిరి దైత్యులు మడిసినవాఁడ తత్పతి దేవుఁ డిటమీఁదఁ దలఁగు నొక్కొ
యీరోఁపు చూడఁగ నీశుఁ డీశంతన కల్పాంతమునుజేయఁ గడఁగు నొక్కొ
తక్కువయును లేని ధర్మచిత్తులఁ గర్త కాలంబు నిండక కాచు నొక్కొ

గీ. మనము వేఁడినఁ బ్రహ్లాదుఁ డనునయింప, నాదిదేవుండు శాంతత నందు నొక్కొ
యనుచు నింద్రాదిదివిజులు నఖిలమునులు, నద్భుతోద్వేగనిర్మగ్ను లగుచునుండ.

ఉ. కోఱలుఁగీటుచున్ నయనకోణములం దహనస్ఫులింగముల్
రాలఁగఁ గర్ణముల్ బిగియఁగా ఘనకేసరముల్ విదుర్చుచున్
మీఁజినయుబ్బునన్ బొదలి మీఁదికి మూరెడు పేర్చి కింక దై
వాఱఁగఁ బట్టె బిట్టు దితిపట్టి నృసింహుఁ డసహ్యతీవ్రతన్. 95

వ. అంత. 96

సీ. పటుమృగాధిపుబారిపారిమదంబేది వడఁకుబంధురమదావళముభంగి
నుద్దామవిహగేంద్రునురువడికగపడి యదలుచు నొడలుమహాహిపోల్కి
మెదలికోల్పులిబిట్టుపొదివిన నణఁగుచు వెగడొందుసారంగవిభునిమాడ్కిఁ
గడఁగి సాగరచరగ్రాహంబు నొడపున జడిసి చిక్కినతీవ్రఝషములీల

ఆ. రౌద్రవేగరోషరభసనిరంతర, స్ఫూర్తియగు నృసింహమూర్తి కప్పు
డగ్గమై సురారి యపగతతేజుఁడై, యడఁగి యుండె మెదల మిడుకలేక. 97

వ. ఇవ్విధంబున నాగ్రహంబునకు ననువుపడినయాకడిందియసురం బొదివిపట్టి నెట్టన
నల్పవిహగంబు నొడసినబలుడేగయుంబోలె గగనంబునకెగసి యయ్యాదిమవీరుండు
దుర్నిక్ష్యప్రకారుం డగుచుఁ బ్రహ్లాదముఖభక్తజనంబులును మునిదేవగంధర్వాదులు
ను జయజయశబ్దముఖసహితులగుచు నుండం గొండొకసేపు చటులనటనాటోపంబు
న దీపించి యనంతరంబ సముత్తుంగశృంగసంఘటితవియత్తలంబగుమహాశైలంబున
కు నవతరించి యం దాసీనుండై. 98

చ. దివిజులు హేనృసింహ! భవదీయమిదంనమ యంచు నంచిత
స్తవము లొనర్ప సన్మునులు సత్య మహోబలరుద్రరూప మా

ధన భవతే నమో యన నుదగ్రనిజాంకతలంబునందు దై
త్యవిభుని నుంచి విశ్వజనతాభయతారణఘోరవీరతన్. 99

చ. అలఘుతరాట్టహాసము లజాండకటాహము వ్రయ్య భీషణో
జ్జ్వలవికటస్ఫురత్కులిశశాతనఖాంకురతీవ్రపాతనం
బుల నసురేంద్రు పేరురముఁ బొల్పఱఁ జించి కలంచి శోణితం
బులు దొరఁగించెఁ ద్రుంచెఁ బెనుబ్రోవులుగా బలుబ్రేవు లుక్కునన్. 100

చ. తొలితొలిఁ గ్రమ్ము దైత్యపతి తోరపు నెత్తురు నీటిధారలం
గలియ నుదగ్రమైననిజకాయముఁ దొప్పఁగఁ దోఁచితోఁచి యం
దలపడ నాత్రిలోకమయుఁ డారిపుదేహముఁ బాసి రాగరు
ర్విలసితమూర్తి నప్పుడటు వెల్వడినిల్చినయాత్ముఁడో యనన్. 101

ఉ. పెల్లుగ దోయిలించుకొని భీషణదానవదేహరక్తముల్
వెల్లిగొనంగ సానువులవెంట మఱి న్నరసింహదేవుఁడున్
జల్లఁగ నిండుఁగాలువలు సాగి కరంపె భయంకరంబుగా
నెల్లెడఁ గ్రొత్తకావి సెలయేఱుల చెన్నొడఁగూడె నగ్గిరిన్. 102

క. దనుజేంద్రమృత్యుకారణ, ఘనసంధ్యాసమయదీప్తిఁ గడునొప్పిన య
వ్వినువీథితోడఁ బురుణిం, చిన క్రియ మహిదైత్యరక్తసిక్తత నొప్పెన్. 103

క. నరహరి చల్లినయసురే, శ్వరుశోణితశీకరములు వనపుష్పాలపైఁ
దొరిఁగి నిరంతరపల్లవ, విరచితనూతనవసంతవిభ్రమ మొసఁగెన్. 104

క. వగయింతగాని పోదని, తగ దానవు మేనిశోణితపు వెల్లువ నిం
పుగ దోఁగి రనఁగ నమరులుఁ, బ్రగుణితరక్తాంగులైరి ప్రమదముపేర్మిన్. 105

గీ. వీరనరసింహదేవుఁ డుద్వృత్తిఁ బెఱికి, పాఱవైచినఁ బడియొప్పి పగతుప్రేవు
లసురసంపద యనుకాంత యఱుతనుండి, త్రెళ్లి దొఁగినహారంపుఁ దీవెలనఁగ. 106

క. శితనారసింహనఖరా, హతదైత్యమహీపసూపహారంబునఁ ద
ర్పితయయ్యె ననఁగఁ బరిశాం, తతనొందె త్రిలోకపీడ తత్క్షణమాత్రన్. 107

వ. ఆసమయంబున. 108

సీ. ఒండొండ వీడ్వడ నునిచినఁ బొలుపారుపదములఁ బర్యంకబంధ మమరఁ
దొడలపై నున్న దైత్యునిప్రేవు లిగుడెసఁ దివిచియెత్తిన కరద్వితయ మమరఁ
గమనీయ శంఖచక్రప్రభాభాసురం బై పెరహస్తద్వయంబు నమర
దంష్ట్రాకరాళంబు దరళజిహ్వాయునగు వదనంబులింతె యొప్పిదము చూపఁ

గీ. దీప్రలోచనత్రయదీప్తి దీటుకొనఁగ, నిభృతకర్ణకేసరకాంతి నివ్వటిల్ల
దివిజసురమునిధ్యానవిధేయలీలఁ, దేజరిల్లె శ్రీనరసింహదేవమూర్తి. 109

వ. అమ్మహామూర్తిఁ గనుంగొనుచు నాదిత్యులు నాదిమునులు ప్రహ్లాదపురస్సరంబుగా నభి
వందనములొనరించుచు నంజలిపుటంబులు నిటలంబుల ఘటియించి యిట్లని వినుతించిరి.

దండకము:—

శ్రీనాథనాథా జగన్నాథ నమ్రైకరక్షాసమక్షా సరోజాక్ష సర్వాభివంద్యా మహానంద గో
విందనీవెందు నీ విశ్వదృశ్యప్రపంచంబునన్ నిండి యుండొండ యంతర్బహిర్వ్యాప్తి
శోభిల్లు నండంబు చిందమ్ములై మ్రోసి తేల్పన్ బరానందకందమ్ము లామ్నాయబృందంబు
లిట్లున్న నీయున్నరూ పాత్మ రూపించు దీపించు నిక్కంబులే యింకఁ జొక్కంబులై
చిక్కు నీ చిక్కు వాపంగ నేలా గురూక్త ప్రసన్నత్వ నిష్ఠానుసంధానసంధూతసందేహు
లై యున్న నీ యున్నతస్థాన మెట్లైనఁ జేయందు నాయందు నెందున్ సురారాతిధా
మంబులున్ నాక కేరాకలందేక యేపాపమున్ గాక లోకాతిరేకామలాలోకమై
యొప్పు లోకంబు నీలోక మాలోకనీయంబె నీలోకసామాన్యధర్మావబోధానురోధంబు
లన్ గ్రోధకామాదులన్ దాఁకి యేచింతలన్ జెంతలన్ జేరఁగా నీక యేకాంతిక
స్వాంతులై యుండువా రుండువారందు నీ దాఁకరాలేక లోలోర్మి డోలావలీకేలి
లోలా జగన్మూల మూలాలవాలోల్లసత్సంవిదానంద నిష్యంద సీమా సమారామరమ్యా స్ఫు
రద్ధామ సత్యప్రకాశావకాశా గుణావేశ దేవేశ నీవిశ్రుతైశ్వర్య మో విశ్వధుర్యం బ
వార్యంబహార్యంబ నార్యున్ సమాత్సర్యులై పూని దుర్బోధబోధాపగాధీశులో గ్రుంగి
పొంగారు మాయాతరంగోరుసంఘాతసంఘట్టనం దూలి యేత్రోవలం దావులం బొందకు
ద్దామదృష్యద్భవద్దారిహానిగ్రాహ్యులై పోదు రవ్యక్తసువ్యక్తదివ్యాకృతీకృష్ణతృ
ష్ణామయోద్వృత్తివేలాయితాఖర్వయోగాపయోగా మహాయోగినిర్ణేత నీతత్త్వ
మాద్యంబు నాద్యంతమత్యంత మక్షోభమక్షీబ మక్షీణమక్లీబ మక్లేశమవ్యాజ మాజే
య నిర్వాణసర్వస్వమూలంబు మూలంబు నన్మూల మామూల మానస్వతంత్రీభవ
ల్లోకశోకం బవేలంబ కాలంబ కర్మంబు నిస్సీమశర్మంబు నిర్మాయధర్మంబు నిష్పంకతే
శంబు నిశ్శంకరూపంబు నిష్క్రియక ప్రత్యయోద్భూతిహేతుత్వసిద్ధంబు సిద్ధాంత
సిద్ధార్థసంపాద మిట్లుండఁగా నేని నానానుమానాదిబంధాత్ములున్ బుద్ధినైర్మల్య
కల్యాణముం బొందకున్నారు దుశ్శాస్త్రశస్త్రక్షతక్షాము లుద్యుక్తశక్తిన్ మహాభక్తి
సంయుక్తులై సత్యసంవిత్సుధాసిక్తసూక్తుల్ భవత్పాదపంకేరుహాభ్యర్చకై కూర్చు నీకూ
ర్చువారై నిరాతంక కైంకర్యసామ్రాజ్యసంపూజ్యతం బొల్చువారౌదురే యెల్లవా
రున్ ముకుందా సముద్రాంతరానందనందాత్మజానందకక్రీడ నాభ్యస్తహస్తాహతో
ద్వృత్తి నిర్వృత్తి నిర్వక్రచక్రానలజ్వాలికాహూతిదైతేయసామ్రాట్ప్రతంగాప
తంగాగ్నికోటిప్రభాఖర్వసర్వంకషోత్తేజ తేజోమయాకార కారుణ్యగాఢోత్తరంగా
విహంగాధినాథా పరోక్షక్రియాదక్షరక్షాపరత్వంబు మీపాలు మాపాలు నీపాలన
ప్రౌఢిభావంబు భావించి సేవించుభావంబు భవ్యాగమవ్రాతచార్యంబు కార్యంబుగా

గొన్న యన్నిచుమున్నిటఁ బెన్నిటఁ బాతాళమూలంబులన్ గిట్టి వేపట్టి చెండాడి క్రీ
డారసోత్సేకపాకంబుఁ గైకొన్న యన్నిర్భరోత్సాహమీనావతారక్రియావిభ్రమం
బున్ బరిభ్రామ్యమాణస్ఫుటోత్తుంగశృంగక్షతాకాశకూటంబు శైలంబు కవ్వంబు
గరోల్లసత్కాలకాకోలకాలానలాభీలభోగంబు నాగంబు వేత్రంబు చిత్రంబు పెం
పొందఁ బొంగారు నుజ్జృంభితాంభోధిమంథంబు నైనట్టి పెన్మోపుదీపెక్క నింపెక్క
సంపద్యమానాత్మసంపత్కళానందతంద్రాళువై బొల్చునక్కూర్మమూర్తిత్వశిల్పంబు
కల్పక్షయోద్వృత్తతోయంబులం జెంది పొందేది యందేదియున్ దిక్కు దాఁగాన
మింగ్రాఁగు పెన్మన్నె నన్నేలు వాఁడిప్పుడిప్పాటు లీలం గటాక్షించునో యంచుఁ బేరాస
గూరంగ నారంపుఁ బేర్మిన్ నడుంగేద నాబాల క్రోవ్యాలుగోరం గడుంబ్రేమనాలిం
గితుం జేసి వేతెంచి యుచ్చాభరూపస్థితిన్ మిన్నుమున్నంద మన్నించి నిష్పంకతా
చిత్రవిద్వన్నగపల్వలక్రోడపంక్రీడశీలించు నుత్తాలకోలస్వరూపావతేపంబు నై పేర్చి
యున్ స్వర్చిదాకారఘోరాసురాధీశవక్షస్స్థలోద్వేలకీలార్కబాలార్కచే లీలఁ
త్రైలోక్యచేతస్స్వఘధ్వాంతముం ద్రోచిరోచిష్ణువై యున్న యాభవ్యదివ్యావతారో
దయస్ఫూర్తి నాపూర్తమై యొప్పనీయొప్పుమమ్మెప్పు రక్షించు లక్ష్మీశయీశా నృసిం
హా నమస్తే నమస్తే నమస్తే నమః. 111

చ. అని బహుభంగుల న్మునిసురావలి తన్నినుతించు వాఙ్మయ
ధ్వనులు నభోదిగంతమిళితంబులుగా మదవేగవిస్ఫుర
ద్ఘనదితిసూనకుంజరవిదారణదారుణఖేలనంబునం
దనరసింహలీల వినుతస్థితి సార్థకమై తనర్చఁగన్. 112

గీ. వీరరౌద్రభయానకవిస్మయాఖ్య, రసములను బోధ్యభంగుల నెసక మెసఁగ
నఖిలభువనహృద్యంబుగ నవ్విభుండు, నిపుణవక్రతానటనంబు నిర్వహించు. 113

క తదనంతరంబ యయ్యు, న్మదఘోరవిజృంభణంబు మానవికాసం
బొదవఁగఁ బ్రహ్లాదసాము, ఖ్యదయాసౌందర్యనూతనాకారుండై 114

క. సితకమలదళంబునకున్, బ్రతియగు లోచనములందు బ్రబలుప్రసాద
స్మితరుచిజాలములు దిశా, ప్రతతిన్ బూర్ణేందురుచులభంగి వెలింగెన్. 115

వ. అయ్యాదిదేవుండు ప్రహ్లాదునాలోకించి నిజజనకునిజననంబు భక్తివిరహితంబయ్యె
మమ్ముఁ గలయుటకు లెమ్మని యంతరంగంబుతోడనున్న యతనియాకారంబు పలక్షిం
చి నగుచు నిట్లనియె. 116

గీ. తండ్రియ యకతేమికి విషాదంబు వలదు, కాలగతితోడ నతనికి మేలు గలుగుఁ
బుత్రకృత్యంబు లెల్లను బూనవడపు, జనకునకుఁ దద్విభూతియు సంభవించు. 117

క. మెచ్చితి నిను నీకీపాటి, వచ్చెపుఁబలు కేల యింక బుధపూజిత! నీ
సచ్చరిత వింటనచ్చుపు, టచ్చు మదీయప్రపత్తి కఖిలమునందున్. 118

క. దైతేయరాజ్యవిభవ, ఖ్యాతి యొసఁగ నీవు పెద్దకాలము భవభో
గాతిశయము నాసక్తుఁడ, వై తగ భుజియించి పొందు మస్మత్పదమున్. 119

క. నాయెడ ననూయ చేసె, న్నీయయ్యక్రియనంగ వలదు నిజ మతఁడును వో
పాయత్తుఁడు గాఁడు తుదిన్, జేయుదు నతనికిని బరమసిద్ధి కుమారా!. 120

ఉ. ఈనవరాసు లీకులమహీధరసప్తక మీరవీందుతా
రావిభవంబు లీగగన మీదిశ లుండెడునంతకాలమున్
గోవిదకీర్తనోల్లసితఘోషణమై భవదాత్మభక్తిస
ద్భావవివేకపాకజనితం బగుపేర్మి ప్రసిద్ధి నొందెడున్. 121

వ. అని ప్రహ్లాదుం డాహ్లాదంబునొందుకృపామధురవచనంబు లుపచరించుచున్న య
ప్పరమాత్ముపరమవాత్సల్యవైభవంబునకుం బొంగి మహామునులును ననిమిషులునుజయ
జయశబ్దంబుల నద్దేవునభినందించిరి. తదనంతరంబ యయ్యండజుఁ బ్రసాదదృష్టి
నాలోకించి యజ్జగదీశ్వరుం డిట్లనియె. ఈమహనీయస్థానంబు పరమమంగళంబై
నన్నుం దనయందు ననుపంగోరుచున్నయది నాహృదయంబునం జూడ్కులు నిం
డం బ్రియంబు నొందెం గావున నిమ్మహాశైలంబునంద యుండంగలవాఁడ మీరు మదీ
యబలం బహోబలశబ్దపూర్వకంబుగాఁ బ్రశంసించితిరి గావున నీతీర్థం బహోబల
నామధేయంబునఁ ద్రిభువనపావనంబై వెలయుంగాత నాచేత నధిరూఢంబైనయి
గ్గిరియును గరుడాద్రియనం బ్రఖ్యాతివహించునని యానతిచ్చె నప్పు డగ్రభా
గంబున. 122

ఉ. శ్రీకమనీయమూర్తినరసింహపదాంబుజసేవ గోరి మం
దాకిని ధాత్రిమీఁది కవతార మొనర్చి నిజాంగకేళి న
స్తోకతరంగసంగములతో సమదాళిమనోజ్ఞపంకజో
త్సేకముతో లసచ్ఛిశిరసేకమనోజ్ఞమహోత్సవంబుతోన్. 123

వ. అమ్మహానది కొలువు గైకొనియె నాదేవుండు భవనాశినీసమాహ్వయం బని యభినం
దించె,నింద్రాదిసురలును ప్రహ్లాదప్రముఖులును గొనియాడిరి తదనంతరంబ తత్ప్రదే
శంబున బున్నాగ నాగకేసర సరళ రసాలతాల హింతాల తమాల నారికేళ నారంగ
మాతులుంగ లవంగ లికుచ క్రముక కుటజ నిచుల చందన చంపక వకుళ కురవకా
శోక శమ్యాక శమీక మధూక మాధవీతిలక తింత్రిణీ నింబ జంబూ జంబీర పనస
హారిభద్ర భద్రదారు దాడిమీ సుమనోమల్లికా మరువక తులసీప్రముఖవివిధతరుల
తాలంకృతంబును నిరంతరవసంతవాసభవనంబును నగువనంబునం దుండి. 124

సీ. నిండారుచందురు నెరసుఁ గొండొకజేసి మిగులఁ జెన్నొందిననగుమొగంబు
వెలిదమ్మిరేకులచెలువుమాయించు యొగ్గడువుగ బెలసినకన్నుఁగవయుఁ
గనకసురభిములఁ జాల్కలుచేసి యొంతియుఁ గ్రొవ్వాడిప్రేఁగైనకుచయుగంబుఁ
గొందలిరాకులయందంబు వెసఁ జించి రంజిల్లమెఱయుకరద్వయంబుఁ

గీ. గలిగి సర్వలక్షణశుభాకారలీల, విమలభూషాంబరోజ్జ్వలవేష మమర
నాదిలక్ష్మియు సకలలోకైకమాత, యమ్మహామూర్తిఁ జేరంగ నరుగుదెంచె. 125

ఉ. శాంతియు దృష్టియున్ ధృతియు సన్మతియున్ మొదలైన నెచ్చెలుల్
సంతతభక్తి దన్గొలువ సంయమిదేవగణంబు లద్భుతా
క్రాంతకుతూహలస్ఫురణఁ గన్గొనుచుండఁగ నట్లువచ్చి శ్రీ
కాంత ముకుందునంకతటిఁ గైకొనియెన్ సవిలాసఖేలతన్. 126

ఉ. కోరిక లంకురింపఁ దనమూర్తి నితంబిని యూరుపీఠమున్
జేరినమేన నెల్లెడలఁ జెన్నలరన్ బులకంబు లొక్కమై
నీరికలెత్తఁ గన్నులకు నెక్కుడుచాయలు నెంచ నవ్వునిం
డార మొగంబునం దెలియ నప్పరమేశ్వరుఁ డొప్పె నంతయున్. 127

క. ఆలక్ష్మీపతియాకృతి, యాలోకంబులను నంతరాలోకములన్
గ్రోలుచు నానందాంబుధిఁ, దేలుచు నుండిరి మునీంద్రదివిజప్రవరుల్. 128

వ. అమ్మహాలక్ష్మీనివాసంబైన యారమణీయోద్యానంబు లక్ష్మీవనం బను పేరనమరుటచేతన్ గీర్తితంబయ్యె నాక్షణంబ వేదంబులు నాల్గును సాకారంబులై తత్సమీపశైలంబున నవతరించి సంచరించి చనుదెంచి లక్ష్మీనరసింహు ననేకప్రకారంబులం బ్రస్తుతించె నదికారణంబుగా మునులాశైలంబునకు వేదాద్రి యనునభిధానం బొనరించి కొనియాడిరిట్లు లక్ష్మీసమేతుండై యానృసింహదేవుండు తేజఃప్రసాదోల్లాసదేదీప్యమానదేహుం డగుచున్న యవసరంబున. 129

మ. నుతలక్ష్మీవనపుష్పసౌరభముల న్సొంపారి లోలోర్మిసం
గతరంగద్భవనాశినీసలిలసేకస్వైరశీతాత్ముఁడై
యతులోద్యన్మృదులీల మందపవనుం డబ్జాక్షుసేవాసమా
గతదేవద్విజకోటిచిత్తములకుం గావించె నాహ్లాదమున్. 130

సీ. కిన్నరగంధర్వగీతనాదంబులు వింతచందంబున విస్తరిల్లె
దివ్యదోఃప్రహతవాదిత్రఘోషంబులు చిత్రరూపంబులై చెన్నుమీఱె
నమరకాంతలలసదభినయోల్లాసంబు లభినవన్యాసంబు లమరఁజేర్చెఁ
గల్పభూరుహపుష్పకమనీయవృష్టి యపూర్వసౌరభములఁ బొల్పుమిగిలె

గీ. ప్రమదములు నిండెఁ బావనప్రతిభ నెఱసె, నఖిలకల్యాణభంగులు నతిశయిల్లెఁ
గరుణ నరసింహదేవుండు చిరతరముగఁ, దగిలి శ్రీమదహోబలస్థాయియైన. 131

వ. తదనంతరంబ 132

చ. సనకసనందనాదియతిసంఘము నత్రిమరీచు లాదిగాఁ
దనరువిధాతలున్ బ్రకటధర్మతపోవ్రతనిత్యకీర్తులున్

మనువులుఁ దోడరా భువనమాన్యుఁడు పద్మజుఁ డేగుదెంచె న
వ్వనరుహనాభు భక్తజనవత్సలు భక్తిభజించు వేడుకన్. 133

వ. మఱియును మేరుమందారహిమవద్వింధ్యనిషధహేమకూటకైలాసచక్రవాళాదిశై
లంబులును గంగాయమునానర్మదాదిమహానదులును ప్రభాసపుష్కరప్రయాగసాల
గ్రామగయావటకాశ్మీరకాలంజరకేదారాదిమహాతీర్థంబులును గాశిక్షేత్రకురుక్షేత్రాది
పుణ్యక్షేత్రంబులును పుష్కరారణ్యదండకారణ్యనైమిశారణ్యాద్యరణ్యంబులును
లవణోదకశుద్ధోదకాద్యాదిసాగరంబులును జంబూప్లక్షశాల్మలాదిమహాద్వీపంబులును
నగ్నిష్టోమవాజపేయాతిరాత్రహయమేధాది మహాధ్వరంబులును యమనియమాది
యోగాంగంబులును మహాపద్మశంఖముకరకచ్ఛపాదిమహానిధులును నహోరాత్రపక్ష
మాసర్త్వయనసంవత్సరాదికాలవిశేషంబులును భూలోకభువర్లోకాదిలోకంబులును
దిగ్విదిగ్గగనంబులును కమనీయాకారంబులు ధరియించి యయ్యాదిదేవుంగొలువ నా
విర్భవించె వసురుద్రమరుదశ్వివిశ్వేదేవాదిదేవగణంబుల జయజయశబ్దంబులును బర
మయోగీంద్రమునీంద్రనివహంబుల సాధువాదంబులును బ్రహ్లాదనారదప్రముఖభక్త
జనంబులనిరంతరస్తోత్రనాదంబులును బ్రహ్మేంద్రమరుత్ప్రజాపతులమహాప్రసా
దాభినందనధ్వనులును గిన్నరవీణాస్వనంబులును భరతాదులయాతోద్యనినదంబు
లును గలసి బ్రహ్మాండకటాహంబు పూరించె నివ్విధంబున నభినవస్వర్గం బనందగి
యపరబ్రహ్మలోకంబు నా నొప్పారి ద్వితీయవైకుంఠం బనం బరఁగి యహోబలంబు
సకలకల్యాణంబులకు జన్మభూమియు సమస్తసంపదలకు నాస్పదంబును నఖిలధర్మం
బులకు నాధారంబును బరమభాగవతైశ్వర్యంబులకు నిత్యనివాసంబును నై ప్రకా
శించుచుండె నట్టియెడ. 134

క. తనబింబము వేఱొకటై, పెనుపొందినయట్లు మెఱయు వెలిగొండుగ ప్రాకారం
బునఁ బట్టె నమృతకిరణుం, డనుపమతేజున కహోబలాధీశునకున్. 135

చ. ఇరుదెస నబ్ధినాథుఁడు సమీరుఁడు కాంచనదారుచండచా
మరములు దాల్చి తన్మృదులమారుతలీలఁ జతుర్భుజాంకసు
స్థిరయగు నిందిరారమణి శ్రీకరకుంతలభారచారువ
ల్లరులకు నూత్ననర్తనవిలాసము లిచ్చుచు నుండి రచ్చటన్. 136

ఉ. ముందట వైనతేయుఁడు సముజ్జ్వలనూతనపక్షమాలికా
సుందరమేరుశైలమున సొంపగునున్నతిఁ బేర్చియున్ భయా
స్పందితమానసోల్లసితభక్తిపరానతమూర్తియై జగ
ద్వందితు నయ్యహోబలనివాసు భజించె నృసింహదేవునిన్. 137

శా. ఏకాలంబును రా నెఱుంగరు మనం బేకాంతవిజ్ఞానకే
లీకాంతంబుగ నుల్లసిల్లుదురు పాలింతుర్ జగజ్జాలమున్

వైకుంఠస్థిరవాసు లట్టిఘనకైవల్యాఢ్యులున్ వచ్చి రా
లోకస్వామి నహోబలేశ్వరుఁ గృపాలోలాత్ము సేవింపఁగన్. 138

వ. ఇట్లు పరమమహోత్సవంబైయున్న నరసింహు పేరోలగంబున మౌనీంద్రులును యోగీంద్రులును సురేంద్రులును సాంద్రానందసందోహసుందరాకారులును భక్తివినయసంభావగంభీరులును గరపుటక్రమఘాటితలస్ఫారులు నగుచుండ నఖండితైశ్వర్యధుర్యుండును ప్రసిద్ధభాషాచాతుర్యుండును లక్ష్మీశదయాలాభోన్ముఖుండును నైన చతుర్ముఖుండు కృతాంజలియై యాదేవదేవున కిట్లనియె. 139

ఉ. ఆగమతత్త్వవాచ్యుఁడ వనంతయశోబలధర్మవాఙ్మయా
యోగరమాసమగ్రుఁడవు యోగిమనస్సరసీపరిస్ఫుర
ద్భోగమరాళనాథుఁడవు యుద్ధమదోగ్రబలదారితారివ
క్షోగణితాప్రదీప్తనఖశోభనమూర్తి నహోబలాధిపా! 140

క. నీకృప నీవిక్రమరస,పాకము నీకేళిలీల ప్రస్తుతిసేయన్
నాకువశంబె దయాకర!, శ్రీకర! నరసింహ!గుణవశీకృతలోకా!. 141

సీ. దైత్యుని యత్యుగ్రతపమున కిచ్చిన కోలాగాని నాయందు నెఱయగలదు
క్రొవ్వి యయ్యసుర యక్కొలఁదుల నిలువక చేసినతప్పును జెప్పఁ బెద్ద
బాములన్నియుఁ బడినామీఁద సోలయక యున్నవేల్పుల తాల్మియొప్పఁబొగడ
దిక్కెవ్వరును లేనిదీనుల సురలఁ గైకొన్న నీకరుణకు గుఱుతుగాదె
ఆ. పగతు దునుమ నీవు పన్నినమతములు, దలఁప నుగ్గడింపఁ దరమె దేవ!
భక్తివిభవసులభ! ప్రహ్లాదవరద! లక్ష్మీనృసింహ! నిగమశిఖరిసింహ.! 142

చ. అసురులు వంగి నప్పు డమరావళి గ్రుంగిన యప్డు ధర్మముల్
పస మఱి తూలినప్పు డపవర్గము వ్రాలినయప్డు దోఃకళా
రసికశుభావతారములఁ బ్రస్తుతి పొందుదు విశ్వరక్షణ
వ్యసనమతిన్ జతుర్యుగములందును నీకృప యిట్లు శ్రీనిధీ!. 143

క. ఆపదయగుచో నెందును, రూపించిన నంద కలఁగి రూపుగ భక్తుం
జేపట్టుదు నీ సరిగా, నోపునె యేదైవములు నహోబలనిలయా!. 144

ఉ. నేరనివార మేమిటికి నిక్కము నీగుణరూపచింతకు
న్నేరము పెద్దయు న్నియమనిష్ఠయు భక్తియుఁ బూని సల్పఁగా
నేరము మమ్ము నివ్విధము నేరమి చూడక యాశ్రితైకర
క్షారతబుద్ధివై కరుణఁ గావు మహోబలతీర్థనాయకా!. 145

వ. అని యిట్లు భారతీవల్లభుండు సల్లాపరూపంబుగా నభిరూపార్థసంస్తవంబు గావించినఁ గారుణ్యతరంగితాంతరంగుఁడై దేవతాసింహుం డగులక్ష్మీనరసింహుం డప్పితామహుదెస మధురస్మితవికాసభాసురంబులుగా నాలోకించి యిట్లనియె. 146

సీ. మునులతీవ్రపుశాపమునఁ జేసి మత్ప్రతిహారులు దితిసూనులై జనించి
రందగ్రజుఁడు హిరణ్యకశిపుఁ డభిహతుఁడయ్యె హిరణ్యాక్షుఁ డనుజుఁ డింక
నాదివరాహరూపాస్మదీయోగ్రతే జంబుచేతన యుపశాంతిఁ బొందు
వినుము త్రేతాయుగంబున వీరరావణకుంభకర్ణాఖ్యరక్షోవరేణ్యు
తే. లై సముద్భవ మందుదు రపుడు నేను, నవతరించి జయింతు మూఁడవయుగంబు
నందు శిశుపాలదంతవక్త్రాఖ్యఁబుట్టి, పడయుదురు వీరు మద్భావభవ్యపదము. 147

వ. అని యానతిచ్చి యిట్లునహోబలనామధేయంబున నిమ్మహాతీర్థంబుమదీయనివాసం
బై నేఁడు మొదలుగాఁ ద్రిభువనపూజనీయత్వంబునం బొగడొందు నిప్పుడుమత్సే
వోత్సవంబునకుం జనుదెంచిన యియ్యమరగణంబును నిమ్మునిసముదయంబులునుసా
గరద్వీపాదివిశేషంబులునుంగూడ నిన్నియు నిచ్చోటన నిరంతరంబును సన్నిధిచేసి
యుండునది యిది యస్మదీయవిజ్ఞాపనంబు. 148

చ. సకలసురైకవాసమగు సర్వమునీంద్రమయంబు విశ్వతీ
ర్థకలితమున్ సమస్తసుకృతప్రభవంబును నై త్రిలోకదీ
పకమగు నీయహోబలము భక్తి యెలర్ప భజించునంచితా
త్మకులకు నెల్లతీర్థములుఁ దథ్యముగా సమకూరు నెప్పుడున్. 149

సీ. విషువద్దినముల రవిగ్రహసోమగ్రహణముఁ బున్నమ నమవసలను
హరిదినసముల జయంతి బారసి వెండియును జేరుకలపుణ్యయుక్తతిథుల
భక్తి నేతెంచి యీభవనాశినీమహానదియందు నభిషేచనంబు సల్పి
గరుడాద్రికందర స్థిరమందిరంబునఁ బొలుపారునన్నహోబలపురీశుఁ
ఆ. గొలుచువారు పుణ్యములకెల్లఁ గుదురైన, వారు నన్ను నెపుడు వలచువారు
వలతు నెపుడు నేను వారికివారికి, నేనొనర్చు టరయ రెట్టివారు. 150

మ. భవరోగంబుల కౌషధంబు భవపాపజ్వాలకున్ వైరి దు
ర్భవపంకప్రవిశోధనంబు భవభావస్ఫారతృష్ణాహరం
బవిరోధం బకలంక మక్షయరసోదాత్తంబు భక్తప్రియో
త్సవ మెందున్ భవనాశినీజలము నిత్యస్తుత్య మిమ్మేదినిన్. 151

క. భవనాశిని భవనాశిని భవనాశిని యనుచుఁ బలుకు భక్తజనులకున్
భవనాశిని భవనాశిని, యవుటకు భువియందు సందియంబును గలదే. 152

ఉ. నాకరుణారసంబు భవనాశిని నా నవినాశనాకృతిన్
శ్రీకరవాహినీతనుజఁ జేకొని నాకమనుష్యలోకద
ర్వీకరగేహగాహితపవిత్రగుణౌఘమునన్ మహాజన
శ్లోకితయై తనర్చు నతిలోకవిలోకసుపాకభవ్యతన్. 153

అసురాంగనాకుంకుమాంగరాగంబున నరుణోదయచ్ఛాయ నమరు నెడలు
సీ. మునివరనియమనిర్ముక్తకుశాస్తృతములఁ దెట్టువలు గట్టి పొలుచు నెడలు
శబరికాశ్రవణప్రశస్తబర్హిచ్ఛదచిత్రితోర్ముల విలసిల్లు నెడలు
మదకలకాంతారమాతంగమదజలోద్వేలాంబువుల నిగ్గుదేరు నెడలు
తే. నగుచుఁ బ్రతిదివసంబును నతినవంపుఁ, గొప్పిదంబులు దనుఁ జెంద నుల్లసిల్లు
సకలకళ్యాణకాలీలసత్ప్రవాహ, భవ్య యీభవనాశినీ పరమతటిని. 154

ఉ. ఈవనధిప్రసూతయును నేనును నింపెసలార వేడ్కమై
నీవనమధ్యభాగమున నెప్డు చరింతుము దానఁ జేసి ల
క్ష్మీవననామ మిన్వనము శ్రీరమణీయము లోకపావనం
బౌవనజాప్తచంద్రవసుధాంబరసుస్థిర మిజ్జగంబులన్. 155

క. తనుఁ దలఁచినఁ దనుఁ జూచినఁ, దనుఁ జెందినఁ దను సముచితస్తోత్రములన్
గొనియాడిన లక్ష్మీవన, మనుపమసకలార్థసార మగు జనములకున్. 156

సీ. భవభానుతీవ్రతాపంబునఁ బడనీదు తనతరుశాఖలతనువునీడ
దుఃఖవాసనములఁ దొలఁగించుఁ దనలతావరపుష్పశోభితవాసనముల
దనతనుగాలిసోఁకునఁ జాలఁ జిగురొత్తుఁ జతురమనోజ్ఞవిజ్ఞానలతలు
వనవిహంగములయనుఁగు దెలుఁగు లాహ్వానంబు సేయుఁ గైవల్యఖగము
గీ. వనినఁ బొగడ నలవి యగునె యహోబల, భూషణంబు సుకృతపోషణంబు
సాత్త్వికప్రియంబు సర్వాశ్రయంబు ల, క్ష్మీవనంబు భువనపావనంబు. 157

ఉ. ఈవిపినంపుఁ గమ్మవిరు లిందిర గ్రొమ్ముడి కీపరాగముల్
శ్రీపదనాబ్జవాసనకుఁ జెన్నగు నీవనపల్లవంబు ప
ద్మావిలసత్పదంబుగరిమంబున కెందును దాన మేది ల
క్ష్మీవనమంచు సంస్తుతులు సేయుదు రర్థి సమస్తలోకముల్. 158

క. ఈవేదశైల మమరఁగ, నావేదశిఖాగ్రవర్తి యగు నవఁగను వి
ద్యావిభవము సాధులకున్, గావించుచునుండుఁ దన్నుఁ గని కొల్వంగన్. 159

క. వేదనగ మఖిలకల్మష, వేదవినోదమున వేదవేదాంగవిధా
వేదితము విసరభవని, ర్వేదాదివిదితవివేకవేద్యము ధాత్రిన్. 160

ఉ. ఆగమశృంగశైలములయందు మృగేంద్రసకృద్విభూతి నే
నేగతి నొప్పుదు న్మహిమ యింపుగ శ్రీనరసింహమూర్తి లీ
లాగరిమంబునన్ దనరులాగున నిట్టిద దీనిమూలి యా
ట్టీగరుడాద్రి పేర్మి నుతియింపఁగ శక్యమె యొట్టివారికిన్. 161

క. గరుడాద్రి దురితవిషధర, గరుడాకృతి సిద్ధసాధ్యగంధర్వమరు
ద్గరుడాసేవ్యం బుజ్జ్వల, గరుడాయత ఘనదినుకవ్యస్థితికిన్. 162

ఉ. భాసురభానుభానునిభభావిభవుఙ్ గరుడాద్రిదివ్యకిం
హాసను నన్ను నున్నతదయార్ద్రి నహోబలతీర్థనాథు ల
క్ష్మీసము పేతుఁ జారునరసింహశరీరు భజించు నుత్తముల్
వే సకలార్థసార్థసుఖవీథులఁ గ్రాలుదు రెల్లకాలమున్. 163

వ. మఱియు నీయహోబలంబు సుస్తీర్థసారంబు గావున నిందలితీర్థంబులవివరింపనుం దత్ఫలంబు భూషింపనుం బహుతరంబైనకాలంబువలయుఁ గృతత్రేతాద్వాపరకలియుగంబుల నిమ్మహాతీర్థంబుమీఁదఁ దాత్పర్యంబులేక నన్నుఁగొల్వక యశ్రేష్టచరితుల గుదురు భాగ్యంబున నెవ్వరేని యిచ్చటికివచ్చి భయభక్తివిశ్వాసంబులతో మదీయసేవాసక్తులయినవారలు సకలమనోరథంబులు సఫలంబులుం గాఁగని దివిజులకుం బడయరానియస్మదీయలోకాభిగమనంబుఁ బడయుదురు. యిదిపరమరహస్యంబు త్రైలోక్యహితార్థంబు గా నెఱింగించితి నని వెండియు నిట్లనియె. 164

క. వినుకలియుగమున మానవు, లనయము నాస్తికులు దృష్టమైనది దెలియం
గనుగొనియు నమ్మరని యే, నొనరించితిఁ బ్రత్యయంబు లోకకొన్ని కృపన్. 165

సీ. సంతానకాంక్షులై యెంతయుఁ జింతిల్లు కాంతలు పురుషులు గలిగిరేని
చేరి జయార్థులై బీరంబు మిగులంగఁ గడఁగెడురాజులు గలిగిరేని
యధికరోగార్తులై యారోగ్యసంసిద్ధి గావింప వెజ్జులు గలిగిరేని
బహువిపన్మగ్నులై పారంబు గానక కలఁగెడు దీనులు గలిగిరేని

ఆ. వారు వారు వారు వారును భక్తియు, నమ్మికయును నెమ్మనముల మిగుల
నను నహోబలేశు నరసింహదేవునిఁ, గొలిచి కాంతు రెల్లకోరికలను. 166

క. కన్నులు జాత్యంధునకుఙ్, గన్నియకును జారుభర్త గర్భిణికి సుతుం
డున్నతవిద్య విమూఢున,కు న్నిజముగ నమ్మి నన్నుఁ గొలిచిన నొదవున్. 167

క. నరహరి యహోబలేశ్వర, శరణం బనుచుఁ బలుక సర్వావస్థాం
తరముల నెప్పుడు నతనికిఁ, గరస్థలము భుక్తిముక్తికళ్యాణంబుల్. 168

సీ. క్షీరాబ్ధిభవనంబు శ్రీపురుషోత్తమం బాదికేశవ మనంతాలయంబు
శ్రీకాంచిపురి,హరిక్షేత్రంబు మధుర శ్రీద్వారక శ్రీరంగభూరిపదము
శ్రీకూర్మసదనంబు సింహాచలంబును నాదివరాహసమాశ్రయంబు
మాధవాఖ్యంబు గదాధరనిలయంబు బదరీవనము శార్ఙ్గపాణిగృహము

ఆ. మొదలుగాఁ ద్రిలోకవిదితంబు లగుమహా,స్థానములును సుజనసంస్తవముల
నొప్పుఁగాని నాకహోబలతీర్థంబు, పగిదినధికవల్లభములు గావు. 169

ఉ. ఏదివసంబునందయిన నెమ్మెయి నైనను నెవ్వఁడైన న
త్యాదరవృత్తి భక్తియుతుఁడై చనుదెంచి యహోబలేశు న

స్నాదిమదైవతంబుఁ గనినట్టిమహాత్ముఁడు సిద్ధసౌఖ్యస
మ్మోదము నొందు నెంతయు నమోఘము నాపలు కంబుజాసనా. 170

వ. విశేషించి మద్భక్తజనంబులును వసంతమహోత్సవంబు మిగులం బాటించికొలువంగో రునప్పుడేను బ్రసన్నుండనై సేవకు మనోరథార్థంబులు నెరపుదు నమరాసురసంయమిసిద్ధసాధ్యగంధర్వాదులు దమయిష్టసిద్ధ్యర్థంబు వసంతయాత్రాప్రసంగంబునం జను దెంచి నన్ను నారాధించెద రాసమయంబున మర్త్యులమర్త్యులను భేదంబుదోఁపక సర్వంబును దేవతామయంబయ్యె నిప్పటిమహోత్సవం బిట్లొప్పినయట్లు వసంతోత్సవంబు నాకు మనఃప్రియంబై యుండు. 171

చ. అమర వసంతయాత్ర నఖిలావనిమండలిమధ్యవాసులున్
దమతమకల్మి భూజను లుదాత్తవిభూషణపత్రగంధమా
ల్యములు నొనర్చువారలు సువాయనసంచయ మిచ్చువారలై
ప్రమదముతో నొనర్తురు కృపానిధి నన్ను నహోబలేశ్వరున్. 172

ఉ. అట్టివసంతయాత్రఁ గొనియాడినవానిని రిత్త నెన్నడున్
బుట్టువు చావు నొందని ప్రభుత్వము వైష్ణవరాజ్యలీలలన్
గట్టుగఁ బట్టు ముజ్వలవికాసకృపాకమనీయబుద్ధిమైఁ
జుట్టలు వీరు నాకు నని చూతుఁ దిరంబుగఁ నేను వారలన్. 173

ఆ. హేమరత్నరజతభూమికన్యాదిక, దానములను సద్వ్రతక్రియలును
నొకటికొకటి ఫలము నొసఁగు నహోబల,తీర్థమున నొనర్చు ధీనిధులకు. 174

క. తపములు పితృకార్యంబులు, నుపవాసంబులును నియ్యహోబలమున ని
ష్కపుణ్యమనుష్ఠింప న,నుపమంబగు తీర్థఫలము లొందఁగఁగలుగున్. 175

సీ. అనవరతంబును నస్మదీయధ్యానశీలురై బుద్ధిరంజిల్లువారు
చక్రాంకితులసీవిశాలసాలగ్రామసేవ నస్మత్ప్రీతి సేయువారు
నతిభక్తి మచ్ఛరణాగతజనులను గొనియాడి వేడుకఁ దనరువారు
మామకదివ్యనామస్తోత్రసంసక్తి నానందపరత నింపారువారు

ఆ. చేరికొల్చువారు శ్రీమదహోబల,తీర్థనాథు దేవదేవు నన్ను
వారుభుక్తిముక్తిభవభాగులు, వారు పుణ్యధనులు వారు ఘనులు. 176

క. యతులును సాత్త్వికులును సా,త్వతులును జక్రాంకభాగవతులును నిత్య
వ్రతులు నహోబలతీర్థ,స్థితు నరసింహాత్ము నను భజింపఁగ నర్హుల్. 177

శా. వేదార్థప్రతిపాలనైకనిపుణుల్ విప్రోత్తముల్ సత్కథా
స్వాదప్రీతులు భూపతుల్ గుణవశుల్ వైశ్యుల్ నిజాచారసం
వేద్యుల్ తక్కటివారునుం గలియుగావిర్భావకాలంబునన్
వేదాతీతు నహోబలేశు నను సేవింపంగఁ బాత్రుల్ మహిన్. 178

ఉ. వారల కెల్లఁ గల్మషనివారిణియై మహనీయసంపుటా
కారిణియై విముక్తిపదకారిణియై విలసిల్లుచుండును
త్కారుణికత్వలీలవినుకష్టవుజాతియు నన్మహోబల
స్థానివాసుఁ జేరి కనుబ్రాజ్ఞనిషేవితపుణ్యలోకముల్. 179

మానవకోటి కింక ననుమానము లేల విముక్తికల్మి వి
జ్ఞానవిహీనపక్షిపశుజాతములుం దటినీమహీధ్రముల్
మ్రానును రాయి లోనగుసమస్తచరాచరజంతుజాలముం
బూని పునర్భవాతురతఁ బొందవహోబలతీర్థవాసతన్. 180

తే. విను మహోబలతీర్థపవిత్రసేవ, యందు రుచి యెల్లవారికి బొందనీను
మాయ గావింతుఁ గష్టపుమానవులకు, దానఁ జెడుదురు మాత్సర్యదర్పనిరతి. 181

చ. అనితరతత్త్వశీలురగునట్టి మహాత్ములు మాయచేయుత్రి
ప్పున బడిపోక భక్తియుత భూతదయాకలితాంతరంగులై
యనఘు ననంతు నచ్యుతు ననాది నతర్క్యు నహోబలేశు న
న్ననుపమనారసింహు మహితాత్ము భజింతురు నిత్యధన్యులై. 172

తే. నీవు మద్భక్తుఁడవు మునిదేవసమితి, కెల్లఁ గురుఁడవు గావున నేను నీకు
నధికగోప్యంబు విబుధమాన్యంబునైన, సిద్ధమంత్రంబుఁ జెప్పెదఁ జిత్తగింపు 183

చ. ఇలఁ గలపుణ్యతీర్థముల కెల్ల నహోబల మెక్కుడం తలం
పలవడఁ జేయుమామకములై చను భూతభవద్భవిష్యద
త్యలఘుతరావతారముల కన్నిఁటికిం నరసింహమూర్తి యు
గ్గలముగఁ జూడు మివ్విధమ కాఁగనుమీ శ్రుతిశాస్త్రవీథులన్. 184

చ. అని పరమాత్ముఁ డిట్లు పరమార్థకథారసలీల వీనులం
దనియఁగఁ గ్రోల్చినఁ దగబితామహుఁ డుద్గతసమ్మదాశ్రులో
చనుఁడు పరిస్ఫురత్పులకచారుశరీరుఁడునై సురారిభం
జను నరసింహు శ్రీరమణు సన్నుతిలో నునిచెం దిరంబుగన్. 185

క. సురలు మునీంద్రులు నానం, దరసాబ్ధిని దేలుచును సుదర్శనలక్ష్మీ
నరసింహామూర్తిమీఁదం, బరఁగించిరి తమసమస్తభావము భక్తిన్ 186

వ. మఱియు సిద్ధసాధ్యచారణగంధర్వాదులును బరమరసావేశంబునం దదాకారంబు గ
నుంగొనుచుం గౌతుకాశ్చర్యభక్తిభరితభావంబులతోడ జయజయశబ్దతత్పరులై యుం
డిరి. లక్ష్మీనరసింహదేవుండును బ్రహ్లాదు నఖిలదానవకులైశ్వర్యధుర్యుంగా నభిషేచ
నంబుచేసిన నతండును సాష్టాంగదండప్రణామంబులతోడ బహువిధస్తోత్రపవిత్రా
ర్చనలొనర్చినం బ్రసాదమధురాలోకనంబు లతనిపై సొలయ నప్పరమేశ్వరుండు
వరం బడుగుమనిన నమ్మహాత్ముం డిట్లని విన్నవించె. 187

క. ఏజన్మమున జనించిన, నాజన్మమునందు నీసముంచితచరణాం
భోజంబులపై విజిత, వ్యాజమయిన భక్తి భక్తవత్సల! యీవే. 188

క. ఖలులకు సంసారముపైఁ, గలవేడుకఁ బాపి మోక్షగరిమము గూర్పన్
వెలయనలయు నీమహిమలు, దలఁపుము నిట్లున్న నాడు తలఁచిన వరదా!. 189

వ. అనిన బ్రసన్నుండై భక్తవత్సలుం డట్లకా ననుగ్రహించితి యోగీంద్రులకుమద్భక్తజనంబులకునాంబ్రాజ్ఞజనంబులకు నన్నియు నీయరచేతిలోనివి నీవుమదీయసాలోక్యసారూప్యసామీప్యసాయుజ్యసిద్ధులన్ గ్రమంబునన్ బొందఁగలవాఁడవ యని యానతిచ్చి మఱియు ని ట్లనియె. 190

సీ. అధికబోధమ్మున నస్మత్పదాంబుజభక్తిరసంబునఁ బ్రకటమైన
నీమహనీయవినిశ్చలచరితంబు సంప్రీతి నేర్పడఁ జదువువారు
వినువారు జనులకు వినిపించువారును సకలకల్మషసముచ్చయము ద్రోచి
యాయురారోగ్యపుత్రార్థసమృద్ధులఁ బొంది మద్భక్తి సొంపున వహింతు
తే. రన్యులకుఁ బడయరానియుదాత్తనిత్య, పదముఁ బడయుదు రానందభాగులగుచు
సర్వపూజనీయం బగుసాధుహితము, వాచకంబు మన్మహిమకు వాఙ్మయంబు. 191

క. అని యానతిచ్చి త్రిజగ,జ్జనకుఁడు ప్రహ్లాదదేవుఁ జరితార్థునిగా
నొనరించె విశ్వలోకము, ననిశము రక్షించుచుండె నధికప్రీతిన్. 192

చ. సమధికభక్తియుక్తుఁడయి శార్ఙ్గి భజించునరుండు సంతత
నిమితయశోవిలాసుఁడయి చెన్నలరారెడు భోగభాగ్యదు
ర్దమవిభవంబు మై సుకృతి తద్దయుఁ గాంచుచు మర్త్యలోకని
ర్గమనమునాఁడు విష్ణునుపకంఠము పొందు వినిశ్చలంబుగన్. 193

క. అనిదేవశ్రవుఁ డెఱిఁగిం,చిన దివ్యక్షేత్రమహిమఁ జిత్తమెలర్పన్
విని గాలవుండు ముదమును, దనుపును బెనఁగొన నృసింహుఁ దలఁచుచునుండెన్.

వ. అనిరోమహర్షణుఁడు వినిపించుటయు సంయమిప్రవరులుభక్తిరసావేశంబున నానందామృతధారల మునింగి యహోబలనాథునిచ్చలు దలంచుచు యథేచ్ఛం జనిరి 195

ఆశ్వాసాంతము.

క. గర్వితదైత్యవిఖండన, దర్వీకరశయన వరసుదర్శనశార్ఙ్గా
ఖర్వాయుధమండితభుజ, గీర్వాణావనముదాత్త కేశవ నృహరీ. 196

శా. పారావారశయాన సింధుతనయాపాంగేక్షణోదార ను
స్మేరాలోకనమూర్తి దైత్యవిభవశ్రీవర్ధనవ్యత్యయా
కారుణ్యామృతవృష్టితర్పితసుభక్తవ్రాత నిత్యోదయా
రాజచ్చరణాబ్జసంజనితగీర్వాణాపగా శ్రీహరీ!. 197

మాలిని. ప్రకృతిగుణతరంగా ప్రస్తుతౌదార్యసంగా
సుకృతిజలధిభంగా సూరిచేతోబ్జభృంగా
నికృతిజనవిదూరా నిర్మలాకారమారా
వికృతిదనుజవీరావేశసంహారకారా. 198

గద్యము. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహధ్యానానందసౌందర్యధుర్య శ్రీసూర్యసుకవిమిత్రసంభవశంభుదాసలక్షణాభిధేయయెఱ్ఱయనామధేయప్రణీతం బయిన శ్రీలక్ష్మీనృసింహావతారంబను పురాణకథయందు సర్వంబును బంచమాశ్వాసము.

నృసింహపురాణము సమాప్తము.